# జ్ఞాననేత్రం

బుచ్చిబాబు కధలు

మొదటి సంపుటి

## బుచ్చిబాబు

పల్లవి పబ్లికేషన్స్

ఏలూర్ రోడ్ విజయవాడ-2

# జ్ఞాననేత్రం

బుచ్చిబాబు

మలికూర్పు
జూన్ 1993

పల్లవి పబ్లికేషన్స్
ఏలూరురోడ్, విజయవాడ-2.

ముద్రణ
మహాలక్ష్మి ప్రింటర్స్
విజయవాడ - 1

వెల : 30-00
గ్రంథాలయ ప్రతి : 50-00

# ఇందులో

# నా గా జు మే డ
## (వాక్ చిత్రం)

ముప్పై ఏళ్ళ క్రితం సంకల్పించి ఇరవై యేళ్ళ క్రితం ప్రారంభించిన నా గాజుమేడ యీనాటికి పూర్తయింది. దాని నమూనా ప్రఖ్యాత పురుషులే తయారుచేశారు. గ్రీసు దేశపు శిల్పులు పొరిక్లోటిస్, ఫిడియస్, ఖాల్డియన్ యువరాజు "గుడియా", అసిరియా చక్రవర్తి అశ్రుబనిపాల్ సౌధంలో దారు చిత్రాల నిర్మాత ట్రాజన్, ఇంగ్లండులో గోడ కట్టిన రోమ్ రాజు హాడ్రియన్—వీరు నమూనా సిద్ధంచేశారు. తంజావూరు ఆలయ శిల్పులు, హరప్పా నిర్మాతలు దంతంలో సౌధ నిర్మాణం జరగాలని సూచించారు. దంతం రంగు కాలం గడచినకొద్దీ పోతుందన్నారు ఎల్లోరా శిల్పులు. సౌధ నిర్మాణానికి కావలసినంత దంతం అసలు ప్రపంచంలో దొరకదన్నారు అమరావతీ స్తూప నిర్మాతలు. ఏనుగుల్ని చంపితే ముందు ముందు ధనికుల వేట, క్రీడా వినోదాలకి ఏనుగులు లేక వారంతా తిరుగుబాటుచేసి యీ దంతపు భవనాన్ని నిర్మూలం చేస్తారు గావున ఆ యత్నం చెయ్యొద్దని "మకియవెల్లి" సలహాపైన అది విరమించాను.

మంచిగంధపు మేడ కట్టమని మొహెంజదరో మేస్త్రీలు సూచించారు. నైలురాణి క్లియొపత్రా వల్లకాదంది. పాములొస్తాయట. పాములంటే అసహ్యంతో మిశితమైన మమకారం ఆమెకి. "ఆ పాముని ముద్దిడుకుని మరణిస్తే ఎంత బాగుంటుందో" అనుకునే ఆ సుందరాంగన మాట కాదనలేకపొయ్యాను. అద్దమే మంచిదని పెద్దలు నిర్ణయించారు. సరే, అల్లాగే అద్దాలమేడ కట్టమన్నాను. భూమి త్రవ్వారు—ఐరోపా దేశాలలో దొరికినంత గాజును పోగుచేశారు. పునాది అవసరం లేదన్నారు, గాలిలో తేలియాడే మేడ గనక. ఎందుకేనా మంచిదని, కాస్తంత పునాదులు

ఉంచుదామన్నారు మహాశిల్పులు "గియోటో", "సినోరెల్లిలు". పక్క గోడలు జర్మన్ శిల్పి "గ్రోపియస్" పని; ద్వారబంధాలు, "డొనటెల్లో" పూర్తిచేశాడు. కప్పులు "లియొనార్డోదవిన్సి", "మైకెల్ ఎంజిలో"— ప్రముఖ శిల్పుల తయారి. మధ్య పెద్ద హాలు. హాలు నగిషీలకి జపానీయ కళాకారుడు "ఉటమారో"ని రప్పించాను. పై అంతస్థులు ఆంగ్ల శిల్పులు "ఇనిగో జోన్స్", "క్రిస్టఫర్ రెన్" ఢిల్లీలో వైస్‌రాయ్ భవనం కట్టిన "ఎడ్విన్‌లుట్‌యెన్స్"ల సలహాపైననే తయారైనవి. మెట్ల వరుసలన్నీ "సెర్లినీ" ప్రతిభను చాటుతాయి. భరతముని సూచనల ననుసరించి ఒక నాట్యశాల తయారుచేశారు. దాన్నిండా కుడ్య చిత్రాలు, ఫ్రెస్కోలు, ఫ్రీజ్‌లు, రామప్ప ఆలయం నిర్మాతల నాయకుడైన శిల్పి చంద్రభూషణ్ చెక్కిపెట్టాడు. అందులోనే మైకెల్ ఎంజిలో ప్రత్యేక శ్రద్ధతో చెక్కిన వీనస్ డిమైలో శిల్పం, "నాగిని" నగ్న సౌందర్యం అమర్చబడ్డాయి. ముంతాజ్ సతి ప్రతిమ నల్లరాతిలో ముసుగువేసుకుని, యమున నదీతీరాన్ని భేదిస్తున్నట్లుగా కూర్చి, దానికింద "కలలుకనేవారికి కన్నీటికేమి కొదవ" అని సువర్ణాక్షరాలలో వ్రాశారు. ఈ ప్రతిమలమధ్య ఏకాంతం కుదరదని మొరెట్టుకున్నాను. ఇవేమీ లేకుండా ఏకాంతంగా ఆలోచించేటందుకు వినోదించేటందుకు నాకు పైన ఒక బురుజులాంటిది కావాలన్నాను. "ఏకాంతంగా వినోదించడం యీ సృష్టిలో సాధ్యంకాదనీ, వినోదానికి మరొకరు కావాలనీ, అసలు నా గాజుమేడ నిర్మాణంలో ఆంతర్యం ఏమిటో తెలవియ్యమనీ పేచీలువెయ్యసాగాడు "సోక్రటిస్."

నాకి ప్రపంచం గందరగోళంగా ఉంది. "జాడ్యం, కుష్ఠు, యుద్ధాలు, వార్ధక్యం, మృత్యువు—వీటినుండి తప్పించుకు పారిపోయి దూరంగా వొంటిగా ప్రశాంతంగా గడపాలని వుంది" అన్నాను.

"మనుషుల్లో ఉండలేని మానవుడు" అని ఆక్షేపించాడు "రూసో." దూరంగా వెళ్ళి, సమాధిలోపడి, దీక్షతో తపస్సు చేస్తేగాని మానవుడు

ఉత్తమ లక్ష్యాలను సాధించలేరు. క్రీస్తు, మహమ్మదు, శంకర, త్యాగరాజు, బుద్ధుడు—అందరూ ఈ విధంగా వెళ్ళిపోయి ఆత్మబలం సమకూర్చుకుని ముక్తిని సాధించినవారే—నాకూ అల్లా అవాలని తోచ డంలో తప్పేమిటి ?

బుద్ధుడు మృత్యువుని జయించగలిగాడా ? జాడ్యాన్ని మాప గలిగాడా ? వార్ధక్యాన్ని వారించగలిగాడా ?" అని హేళనగా ప్రశ్నిం చాడు "కాన్ఫ్యూషియస్." అతనికి వ్యవధి చాలలేదు. శిష్యులు కొందరు చుట్టూ జేరి అప్పుడే సాధించేశావులే అంటే నమ్మేసి బోధనా పద్ధతులు, సిద్ధాంతీకరణ, ఉద్యమ వ్యవస్థాపన మొదలైన వాటిల్లోపడి, అసలు కోరినదాన్ని వొదిలేశాడు—అంటూ సమర్థించాడు బెర్నార్డుషా. నాబోటి గాళ్ళు మరో కోటిమంది దీక్షగా పట్టుదలతో వేటిని కాంక్షిస్తే అవి సిద్ధి స్తాయి—అని షా, డార్విన్, "బెర్గ్‌సన్లు" ధైర్యం చెప్పి ఉత్సాహ పరుస్తూ వెన్ను మీద చరిచారు.

ఇంతకీ యింత పెద్ద పెద్ద ఆలోచనలు నాలో తీవ్రంగా తిరగాడ్డం లేదు. సామాన్య ప్రజలందరికీ లభ్యమైపోతున్న విషయాలపై నాకు నమ్మకం, మమకారం తగ్గిపోతున్నాయి. అందరికీ చదువు, విజ్ఞానం లభ్యమైతే వాటిని సంపాదించుకోవాలన్న కాంక్ష క్షీణిస్తోంది. ఉత్తమకళ ప్రతివారూ ఆస్వాదిస్తున్నారనగానే నాకు ఆ కళ చవకదిగా కనబడు తోంది. అందరూ మెచ్చుకున్నది మెచ్చుకోలేను; అందరూ ఆనం దించేది నే ఆనందించలేను. నా అనుభవం, ఆనందం అపూర్వంగా, ఎవ్వరికీ లభ్యం అవనివిగా, నా స్వంతవిగా ఉండాలి. అందుకే ఈ గోలంతా.

ఈ జనం అంతా స్వర్గంలోకి పోతారంటే నాకు స్వర్గానికి పోవా లనే లేదు. "ఈ ఆలోచనలు నరకానికి నెట్టుతాయిలే" అన్నాడు గాంధె. అక్కడికే పోతాను,

పూర్వం మాటలుటండీ, ఒక్కొక్కడు వొక్కొక్క గ్రంథం వ్రాశాడంటే అది మతమై కూర్చునేది. దానిలో రహస్యం విశదీకరించేందుకు వందలాదిగా వ్యాఖ్యాతలు, శిష్యులు బయలుదేరినారు. మరిప్పుడో— సుళువుగా వ్యవహార భాషలో సామాన్య మానవుడికి అర్థమయ్యేలా వ్రాయాలి. నాట్యం అందరికీ రుచించాలి. చిత్రలేఖనం నిత్యజీవనంలో వుపకరించాలి. ఏ కళాఖండం ఇరవై నయాపైసె మించరాదు. అనుభవించేటందుకు జీవితానుభవం, సంస్కారం, పాండిత్యం, ఊహ, కృషి ఏవీ అక్కరలేదు. అందుకనే యిక్కడ వుండలేను. దూరంగా ఏకాంతంగా ఉత్తమ కళని, గొప్ప సౌందర్యాన్ని, ఆత్మ సాక్షాత్కారాన్ని, సాధించి వ్యక్తిత్వాన్ని, ప్రత్యేకతని బుజువుచేసుకొని ఆధ్యాత్మికానుభూతిని పొందుతాను. అందుకే యీ గాజుమేడ.

"హోమర్", "గెథె", "టాల్‌స్టాయి"లు బాగుంది, కానీ మన్నారు. షేక్స్పియరు, వేమన్నలు పెదవి విరిచి, అసమ్మతిని తెలియచేస్తూ తల పంకించారు.

ఏకాంత బురుజు నిర్మాణం పూర్తిచేసిన అద్భుత శిల్పులు — "కర్రిజియో", "టియిపొలో", "రూబెన్స్", "బెర్నిని"లు. "ఎరిక్‌గిల్" గారు డైనింగు హాలు సిద్ధం చేశారు. పోర్టికో, బాల్కనీ "ఆరిస్టిడి మాలియెల్" తయారు చేశారు. ఈ "మాలియెల్" స్త్రీ నగ్న ప్రతిమ చెక్కడంలో నిపుణుడు. నాలో నేను నవ్వుకున్నాను. నాకీ శిల్పాలెందుకు? రక్తమాంసాలతో సజీవులైన నగ్న స్త్రీలే వుంటున్నప్పుడు—కళాజగత్తులో మిథ్య ప్రతిమలతో నిమిత్తమేమిటి? అతని వుత్సాహాన్ని అరికట్టడం యిష్టంలేక ఊరుకున్నాను. ఇంక పడకగది. ఇది కేవలం "రోడిన్" చెయ్యాల్సిందే. అజంతా, ఎల్లోరా నిర్మాతలు యీ పనికి ఎగబడ్డారు — వారిని పంపించి వేసేటందుకు నా తాతలు దిగిరావాల్సి వచ్చింది. వాళ్ళు గొప్ప పనివాళ్ళే కాదనను. చిన్నవి, నాజూకువి

వారివల్ల కాదు. అంతా భారీగా పెద్ద ఎత్తున సాగాలి. పైగా మతంలో పడిపోతారు. నా మతం మానవత్వం. "రోడిన్" దీనికి తగినవాడు. మానవత్వంలోని హృదయాన్నే కాకుండా, అస్థిపంజరాన్ని సహితం ఎత్తి చూపగల ప్రతిభాశాలి. అద్భుతమైన గది. మరి మంచం ఎక్కడ ?

నవ్వాడు రోడిన్. "మంచం వుండకూడదు. గది అందం చెడుతుంది. పైగా నువ్వు నిద్రపోదల్చుకోలేదుగా. ఆనందం, అనుభూతి, ఏకాంతంలో ప్రశాంతత అవి కావాలిగా — నిద్రపోతే అవి దొరకవు."

"అవుతే మాత్రం. అది కేవలం ఒక ఆదర్శం. దాన్ని సాధించడానికి, సాధ్యపడినంతవరకూ ప్రయత్నిస్తాను. అంతేకాని నిద్రాహారాలు మానుకోమనా! నిద్రాహారాలు మానవత్వానికి సూదంటురాయి — పునాది. మంచానికి కోళ్ళు" అన్నాను.

మరో ఏడాదికి సిద్ధం చేశాడు.

"ఏది మంచం?"

"ఇదిగో"

నాలుగు కోళ్ళ మాత్రం వున్నాయి. నాలుగు తలలు లేని స్త్రీ మూర్తులు. ఒకామెకి పిరుదులు లేవు; మరొకామెకి స్తనాలు లేవు. మూడో ఆమెకి చేతులు లేవు; నాలుగో ఆమెకి పాదాలు లేవు.

"మానవత్వం అనే మంచానికి కోళ్ళు" అని నవ్వుకుంటూ పొయ్యాడు "రోడిన్".

పిచ్చివాడు. "లినార్డోడావిన్సి"ని అడిగాను ఇదంతా ఏమిటని.

"ఆ మాత్రం తెలీదా. మానవుడు పరిపూర్ణ సౌందర్యాన్ని భరించలేడు. కొంచెంలో పోయిన అందం పాపాలకి తావున్న మంచితనం, అమరత్వం ఆశించే అల్పాయువు — యివే మానవత్వం ప్రకటిస్తాయి. పరిపూర్ణ సౌందర్యం, మంచితనం దైవానికి సాధ్యం. ఏ ఆలయంలో నయినా సరే, అన్ని అవయవాలు సరిగ్గావున్న ప్రతిమను చూశావా

నాయనా ? మైలో వీనస్ చేతులేవి ? ఖజరాహోలో పాలిస్తున్న త్రిమూర్తి చన్మొన ఏమైంది ? అజంతాలో నల్లరాణి కాలొంకర తియ్యరేమి ? వుంచరు, నాయనా! వుంచరు. మానవుడే వాటిని ధ్వంసం చేస్తాడు. పరిపూర్ణ సౌందర్యం భరించలేడు." ఇదంతా చరిత్రకారుడు గిబ్బన్‌కినచ్చినట్లులేదు. అతని వుద్దేశంలో మానవత్వం సంపూర్ణంగా వికసించినపుడు గొప్ప నాగరికత బైలుదేరుతుంది. సహజమైన కోర్కెలు తీర్చుకునే అవకాశం వుండి, మానవుడి అవయవాలు, సర్వేంద్రియాలు వికసించి, వాటికి సరైన సృష్టిశక్తులు ప్రకటితమయ్యే అవకాశం వున్నప్పుడు, వున్నతమైన నాగరికత ఆదర్శ శిఖరాన్ని అందుకుంటుంది. రోము నాగరికత ఆ విధంగా విజృంభించింది. తరువాత క్రైస్తవ మతం వ్యాపించి, సహజమైన వాంఛలను అరికట్టే నైతిక విలువలు ప్రచారమైనప్పుడు, మానవుడు సృష్టిశక్తులు గోల్పోయి, తన శరీర అవయవాలకి పూర్తిపని కల్పించక, పరలోక చింతనలోపడి యీ లోకాన్ని విడిచిపెట్టినప్పుడు, నాగరికత పతనం జరుగుతుంది. రోము నాగరికత ఆ విధంగా పతనం చెందింది" అంటాడు చరిత్రకారుడు గిబ్బన్.

"విజృంభించి శిఖరాన్ని అందుకున్న ప్రతి నాగరికత పతనం చెంది తీరుతుంది—మానవుడు పుట్టడం, పెరగడం, వృద్ధి చెందడం, కృశించి, నీరసించి, క్రుంగి, వార్ధక్యంలో మృతి చెందడంలో సృష్టిలయ వ్యక్తమైనట్లు, నాగరికతలు పతనం చెందడం చరిత్రలో లయ—అందుకోసం విచారించనక్కరలేదు" అంటాడు మరో చరిత్రకారుడు "స్పెంగ్లర్"

కాబట్టి స్వేచ్ఛగా ఇంద్రియాలకు పని కల్పించి, సుఖించి ఆనందించినప్పుడే మానవుడి జీవితానికి పరిపూర్ణత సిద్ధిస్తుంది. కావున ప్రవక్తలు ప్రదిపాదించిన మతానికి లొంగిపోవద్దని "వోల్టేరు", "వాల్ట్ విట్‌మన్", "సోలమన్" చక్రవర్తి, సముద్రగుప్తుడు, నా ఊహలని, సంకల్పాన్ని ఆమోదించి హెచ్చరించారు.

ఇనుము, గాజుతో గాజు భవనం నిర్మించిన "పాక్స్‌టన్" దొర గారు మేస్త్రీగా ఉంటానన్నాడు. ఖండాంతరాల నుండి గాజు తెచ్చారు. పనివాండ్రమాటేమిటి ?

"నువ్వు మా వారసుడవు—మా గడింపు, సంపాదనా, అంతా నీవే. మేం సమకూరుస్తాం పనివాండ్రని" అని పెద్దలు ముందుకొచ్చి పని వాండ్రని రప్పించారు. వేలు, లక్షలు, కోట్లు—సూర్యుణ్ణి వెన్ను మీద కట్టేసుకుని, గాజులా మెరిసే ఇనుప కండరాలతో, అస్థిపంజరం కదలి కతో భూమాతని అదరగొట్టె భుజబలంతో, "హమ్మురాబి", హానిబాల్, "నెబుకాడ్ నాజర్" "షార్లి మేన్", "దిన్ ఇలాహి", ఈజిప్టురాజు "హైక్ సోస్", "అక్బర్", "అశోకుడు", "తైమూరు", "ఛంగీస్ ఖానుడు", సుమేరు ప్రభు "ఊర్ ఎంగర్"—ఎందరెందరో మహారాజులు తమ ఆధ్వర్యంలో నాగరికతలు నిర్మించిన పనివాండ్రని రప్పించారు. లెక్కలు, చిట్టాలు, కొలతలు, ప్రణాళికా నిర్వహణ, "తైకర్ గస్" "రోబ్స్పియర్" "కౌటిల్యుడు" చూస్తున్నారు. వారి కష్టసుఖాలు కను క్కుంటూ "శ్రీనాధుడు" "మార్కస్ ఆరిలియస్" శ్రమ పడుతున్నారు. తాపీ పనివాడు "చెంగీస్" చెప్పుచేతుల్లో పిరమిడ్లు లేవనెత్తిన శ్రామికులు వారంతా—చైనా గోడ లేవనెత్తినవారు ఆమూల; బాబిలన్ ఆకాశంలోకి లేవనెత్తినవారరుగో!

చురుకుగా, వేగంగా పనిచేయ్యమని, "సావనరోలా", "నానాఫడ్న వీసు", "సెనెకా" వుద్బోధిస్తున్నారు. అటునుంచి యిటు, యిటు బాగు లేదు, యిటు నుంచి అటు సామాగ్రిని ఫిరాయించి, ఒక్కొక్కపని రెండేసిమార్లు చేయిస్తున్నాడు "మహమ్మద్ బిన్ తుగ్లక్." బద్ధకించిన వాడిని చావతంతున్నాడు బొబ్బిలి పాపారాయుడు.

పనివాండ్ర చెమటలు కారి నదులైనాయి. ఆ నదిలో క్లియోపాత్ర గాజు పడవలో షికారుకి రమ్మంటుంది. చెమట వాసన వాడిన రోజా

పుష్పం కాక మరేమిటని ఓమర్ ఖయ్యామ్ కులాసా పాటలు. 'హాండల్', 'బెతోవెన్', మోజార్టులు' తమ గానంతో వారి శ్రమ తొలగిస్తామంటారు. ఈజిప్టు రాజు "ఇక్ నాటిన్" భార్య, మహా సౌందర్యవతి, ఆరుగురు బిడ్డల తల్లి "నెఫెర్ టిటి" వారి కాలక్షేపానికి నాట్యం చేస్తానంటుంది

"నెఫెర్ టిటి" సౌందర్యం, రక్తమాంసంతో కూడిన కండకావ్యం. రెండు మేఘాల మధ్య నుండి పొడుచుకొచ్చిన సూర్యకిరణంలా బుగ్గల నుండి దూసుకొచ్చిన ముక్కు; పర్వత శిఖరం వెనక దిగి సగమైన సూర్యబింబం లాంటి ఆమె నోరు — నిజమే - కాని ఆరుగురు పిల్లలతల్లి నాట్యం చెయ్యడమా! పిల్లకొకటి చొప్పున పొట్ట కింద ఆ మడతలు లయకి లొంగుతాయా? రంగాజమ్మ నాట్యానికి వొప్పగున్నాను ఆఖరుకి. ఆలయంలో స్త్రీ శిల్పాల స్తనాల నిండుతనం, బలం, వొంపుల వొయ్యారము, చూపుని ఆ రెంటి మధ్య బంధించి వేసేటందుకు మాత్రం మిగిలిన సందు - చూపు యింకెటూ ప్రసరించినా, గొలుసుతో కట్టేసిన చిరుత పులికి మల్లే మళ్ళా వాటి మధ్యకే రావాలి మరి!

ఆ కూలీలు, ఆ మేస్త్రీలు అల్లా వారాలు, నెలలు పనిచేస్తున్నారు. వర్షానికి తడిసేబట్టలు లేవు; ఎండిన చర్మం తడవదు. ఆ ఎండని, ఆ వానని, ఆ తడిని, ఆ వేడిని ఆ ఎముకల్ని శిథిలాలుగా జీవంతో చరిత్రలో కదులుతున్నట్లు వారి రక్తంగాజై, వారి వాసన వాతావరణమై, వారు విడిచేసిన శక్తి రేడియమ్‌గా, న్యూట్రాన్, పాజిట్రాన్, సైక్లోట్రాన్, ఎలక్ట్రోన్‌ల క్రియ- ప్రతిక్రియల గొలుసుగా, భాషలేని వారి ఆకలి ఆలోచనలు అతుకులుగా, చావడానికి ఓపికలేనంతగా శ్రమించిన వారి ప్రాణాలు నగిషీలుగా, యుగయుగాల జిజ్ఞాసపరిణితి అంతస్థులుగా నా గాజుమేడ లేచింది - ఈనాటికి పూర్తయింది.

వారేమీ ప్రతిఫలం కోరలేదు. 'ఇది మా ఆస్థి - మా శక్తి - వారసుసుగా నీకు ధారపోస్తున్నాం. స్వీకరించు. తీరిక వున్నప్పుడు ఎప్పుడేనా

మమ్మల్ని స్మరించు; అంతేచాలు’ అన్నాడు వాళ్ళందరి తరపునా నాగార్జునాచార్యుడు.

వారినిచూస్తే జాలేసింది. వారికాలంలో వారు మహా పురుషులు - కానీ నా ముందు వారెంత ? వారి అజ్ఞానం, సంకుచిత దృక్పథం, పరిమితమైన చైతన్యం - నాకెంతో అల్పంగా కనిపించాయి. వారు వారి వారి యుగాల ప్రతినిధులే కావొచ్చు; వారి వారి యుగాల విజ్ఞానం, ప్రతిభ వారిలో కేంద్రీకరించి వుండొచ్చు. కాని, వారు ఆ యుగాలలో బంధితులైనారు. అది దాటి ముందుకు చూడలేరు. కు తెలుసున్న వెయ్యో వంతు వారికి తెలుసా ? చరిత్ర చీకటి గహలు నాతో వెలుగు చూశాయి. బూడిదై యింకా నవ్వుతున్నారా నన్ను చూసి ! అవును, నేను బూడిద నవుతాననేగా ? అవుతేనేం ? నా జీవితం నిండైనది, నా చైతన్యం, జిజ్ఞాస, వికాసం, వెలుగు, సృష్టి విజృంభణ, ఆత్మసాక్షాత్కారము నాలో దైవం కాసేపు యథార్థమయ్యే పరిపక్వత వారికేది ? వారి పళ్ళ మధ్య కాలం మట్టి కొట్టింది - నామాటో ? గాజుముక్కలు.

నా గాజుమేడ ఎంతో పెద్దది. ఈఫెల్ బురుజుకంటె వెయ్యిరెట్లు ఎత్తైంది; ఎవరెస్టు శిఖరం కంటె వొందరెట్లు పెద్దది——

“ఎక్కడ పెట్టం ?”

“పైకి దూరంగా ఎతుగా యీ లోకానికి అందకుండా చాలా దూరముగా” అన్నాను. పైకి పెట్టేశారు.

కింద భూమి అంచు గుండ్రంగా కనిపిస్తోంది - ఆకు పచ్చగా, గోధుమరంగుతో చిన్న చిన్న గుట్టలు—మళ్ళా చదునైన నేలా. అక్కడక్కడ కొండపల్లి బొమ్మలల్లే గుడిసెలు, భవనాలు. చెట్లచాటున, గుట్టల నీడలో భయపడి దగ్గరకి జరిగినట్లుగా చూట్టూ పొగలో మసగగా ఆకృతి కోసం పెనుగులాడుతున్న గ్రామాలు, గ్రామాలలో రొద చీమల బృంద గానంగా వినబడుతోంది. మేఘాల మధ్య నుండి అక్కడక్కడ కొండ జాతి కన్య రొమ్ములకి మల్లె పర్వత శిఖరాలు; కొండజాతి కన్య చింపిరి

జొట్టపై అడవి పరంపర. మిగతా అంతా సముద్రం—పచ్చగా, తెల్లగా కరిగిన ఇటుకల మాదిరి వొడ్డుకేసి కదులుతున్న సముద్రం.

ఆ కెరటాల కేసి చూశాను ఎప్పటి నుంచో వున్న సముద్రం—చరిత్రకందని వయస్సు. అనంత జీవి. చీర విడిచేసినట్లు కింద లోతుగా భూమి. మళ్ళా చీర వెతుక్కుంటున్నట్లుగా, వొడ్డుకేసి సిగ్గుపడుతూ పరుగులు! వాటికెంత మమకారం! ఆ పెద్ద కెరటం తండ్రి - నెరిసిన గడ్డం తెల్ల తుంపరలు—మెల్లగా ముసుగుతీసి చూస్తున్నాడు సంతానాన్ని. అవి పిల్లలు; ఆ వంకర కెరటం, పడుచుదనంలో విర్రవీగి, ప్రేమలో విషాదం తెలియకుండా భ్రమించి మిడిసిపడుతూ వొడ్డున శృంగారంకోసం విరగబడుతోంది. వాడు ఆ పోకిరీ కుర్రాడు బంతనుకొని రాళ్ళని తన్ని "అమ్మో కాలు విరిగిం"దని పెల్లికిలపడ్డాడు. ఏంబులెన్సులా అక్కయ్య లోపలికి లాక్కు పోయింది. స్త్రీలు, పురుషులు ఈ చోద్యం చూడాలని వొడ్డునపడి చేరిపోతున్నారు – వొంటిగా వొస్తారు. వొంటిగా వెడతారు—ఈ మధ్యలో సముద్రమంతటి ప్రేమ వాటికి పాపం! ఆ వృద్ధ తండ్రి "భద్రం" "భద్రం" అంటూనే వున్నాడు. ఎవ్వరూ వినిపించుకోరు—వ్యక్తిత్వాన్ని అలవరచుకున్న జీవిత పరిశోధకులు చస్తారు. అంతే పర్యవసానం. ఒకరిద్దరు వొడ్డున వొళ్ళు కాలి "బాబో" అనీ నాన్నని వెదుక్కుంటూ లోపలికిపోతారు. కాని నాన్న లేడు. వృద్ధుడు ఆ మూల రాళ్ళ గుట్టకింద ఇసికతెన్ను చూసి, భగవంతుడని భ్రమించి, భక్తితో తల పగలకొట్టుకొని హతుడయ్యాడు. తండ్రిలేని ఆ కెరటాలు అమ్మకోసం లోపలికెళ్ళి ఆమెలో కలిసిపోయ్యారు. అమ్మా నాన్న ఐక్యమైనదే సముద్రంహృదయం, రహస్యం; అమ్మో! దానిలో ఎన్నో దాపరికాలు; కుట్రలు, కుళ్ళు, దగాలు, అనచారాలు, పాపాలు, పాటుపోటులు పశ్చాత్తాపం, చందమామ రాత్రి, పగలు సూర్యుడు తీర్పు, అఘాతంలో దుండగాలకి ఒప్పుమండి తుఫాను లేపి దాన్ని కడిగి పవిత్రంచేస్తూంటారు. ఆమె నిట్టూర్పుకి నోచుకోరండి. ఆ మూలుగు బాధనుకోకండి. అంతా దగా.

పైపై నాటకం. దానిపొట్టలో దాగిన ముత్యంపుచిప్పకు తెలుసు యీ వేషం; పొంపుతిరిగి చిప్పలో దాక్కొని ముత్యం మవుతుంది — తపస్సుచేసే ఋషికిమల్లే. ఈ సముద్రం, ఈ లోకం దగా అని, మాయ అని ఇద్దరికీ తెలుసు. ఈ సంగతి మనుషుల కెల్లా తెలుసు? యోగిని పట్టుగుని లేపి ఏమిటని అడుగుతాడు; ముత్యాన్ని వేటాడి ప్రేయసిమెడలో వుంచి మురిసి పోతాడు. సముద్రంలో చాంచల్యం ఆ ముత్యంలో మిగిలివుంది — అది ఆమెని ఆవరిస్తుంది. ఆమె అతన్ని విడిచి మరొకరితోపోతుంది.

ఎంతసేపని చూడను సముద్రం కేసి! విసుగెత్తింది. లోపలి హాల్లో కెళ్ళాను. అన్నింటిలో నేనే—ఎన్నో నేనులు — కోణాని కో చదరపు నేను. వంకరమలుపు కో గుండ్రని నేను— పొడుగ్గా నుదురు సాగేసినట్లు; పొట్టిగా గడ్డల నొక్కేసినట్లు - ఆ రంగులమధ్య, ఆ వెలుగులనడుంగా - వికృతమైన వాస్తువు నేను ఒక్కణ్ణే. బైట నిలబడి ఆనందించనా? అసలు బైటనేదిలేదు; వొక్కొక్క సూర్యకిరణం గోడలమీదపడి విరిగి ఏడు రంగులుగా ముక్కలై నా కంటిపాపల్ని కాల్చివేస్తున్నాయి. చందమామలో రంగువంకరలు, వంకర రంగులూను.

రామాయణంలో వెన్నెల వర్ణన చదువుతానంది మొల్ల. ఆమె నల్లటి మొహం ఏడురంగులతో కలతచెందింది. భయంతో కప్పుకున్న చీరమడతలు జారి విడిపడ్డాయి. మొల్లవి పెద్ద నిండైన స్తనాలు. ఆ అద్దాలమధ్య అవి అతిశయోక్తిగా శిథిలాలయాల మాదిరి దగ్గరగా వెళ్ళి చంద్రగోళాన్ని చూసినట్లు వికృతంగా మరీ పెద్దవిగా నాలుగు, పదహారు — అబ్బ, వేలు, కోట్లు — అంతా అవే. నాకు వూపిరాడదు. నేను మారంగా బురుజులోకి వెళ్ళిపోయ్యాను. రంగాజమ్మ నృత్యం చెయ్యడానికి సిద్ధం నగ్నంగా వున్నప్పుడు, చోటుచేసుకుని ఆమె రొమ్ములమధ్య నా మొహం దాచుకోవాలని వుండేది - వాటిల్లో అంత పారవశ్యత, ఓదార్పు, అభయం వున్నాయి. కాని మొల్ల వుదంతం చూసింతర్వాత నేను వివస్త్ర అయిన స్త్రీని భరించలేను. చీరలు, ఒకదానిపైన ఒకటి వొంద చీరలు కట్టుకుని మరీ నాట్యం

చెయ్యమన్నాను. "పుట్టబొమ్మనా?" అన్న దామె ఆక్షేపణగా. ముత్తు స్వామి దీక్షితులు తంబూర తీసుకొచ్చాడు. మాస్కో-నుండి తిరోగమించి నపుడు మిగిలిన సైనికులతో డ్రిల్లుచేయిస్తానంటాడు నెపోలియన్. "బెర్లియోజ్" ఆర్కెస్ట్రా వినిపిస్తానంటాడు. నా బొమ్మ గణిత శాస్త్రంలో చిహ్నాలుగా విభజించి గీస్తానంటాడు "పాల్ సెజాన్". ఆదిభొట్ల నారాయణ హరికథ చెబుతాడట. తాన్సేన్ గానం చేస్తానంటాడు. తెనాలి రామకృష్ణుడు భోగందాని భోగట్టా వినమంటాడు. "ఎర్రాప్రగడ", "ముద్దుపళని," 'లారోషిఫోకల్ట్' "బాస్వెల్,"చిలకమర్తి," 'లారెన్స్' 'అరిస్టాటిల్' తమ రచనలు చదువుతామంటారు.

సోక్రటీస్ ఒక ప్రశ్న వేశాడు.

"ఇవి చూసేటందుకు, వినేటందుకు, ఆనందించేటందుకు జనం ఏరి? ప్రేక్షకులేరీ?"

నాకోసమేగా, నేనే ప్రేక్షకుణ్ణి.

ఆస్వాదించే రసికులున్నప్పుడే కళాకారుడి విజృంభణ. ఒక్కడే వుంటే అతని కేం వుత్సాహం వుంటుంది?

"పోనీ మీరంతా వున్నారుగా" అన్నాను.

"వారందరూ కళాకారులే—వారిలో ఒకరికి పడదు నీకు తెలుసుగా. ఒకర్ని చూసి ఒకరు ఓర్వలేరు. ఒకరువేదికపై నున్నప్పుడు ఇతరకళాకారు లెవ్వరూ వుండరు" అన్నాడు సోక్రటీస్.

"పర్యవసానం?"

"భూమిదగ్గరగా చేరి, అక్కడివారిని రప్పించడమే" అన్నాడు.

అతని తెలివికి మెచ్చి, నా మేడనుగురించి ప్రేక్షకజనం వేసే ప్రశ్నలకు సమాధానాలు చెప్పే ఇన్ఫర్మేషన్ ఆఫీసరుగా సోక్రటీస్‌ని నియమించాను.

కిందకి దించే ఏర్పాటు చెయ్యమన్నాను.

ఆ వింతగా నవ్వినవ్యక్తి "ఆల్బర్టు ఐన్‌స్టీన్"

"అది సాధ్యపడదు భూగోళమే మనదగ్గిరికి రప్పించాలి" అన్నాడు.

"అదేమిటి?"

"ఆ మాత్రం తెలీదా? భూమికి ఆకర్షణశక్తి వుంది. దాన్ని అతిక్ర మించి మరోగోళం ఆకర్షణశక్తి అణువులను ఆకర్షించే అణుపదార్థాన్ని గాజులో వెయ్యించమని పాక్స్టన్‌కి సలహాయిచ్చాను. లేకపోతే నీ గాజు మేడ కిందకి పడి కూలిపోను" అన్నాడు.

"అవులే భూగోళం మనదగ్గరకొస్తుందా?"

'గాజులో అణుపదార్థం సాంద్రత తగ్గించాలి' అన్నాకు ఐన్‌స్టిన్.

"మరి కానివ్వండి. ఎంతకాలం పడుతుంది?"

'ఏ గడియారంచొప్పున ఎంతకాలం?' అని ప్రశ్నించాడు.

"అంటే?"

ఈ మాత్రం తెలీదా? కాంతి సెకనుకు లక్ష ఎనభై ఆరువేలమైళ్ళ వేగంతో ప్రయాణం చేస్తుంది. దూరంగా కనబడే ఆ గోళంకేసి చూడు, అక్కడనుండి వెలుగురావడానికి ఆ వేగం చొప్పున మూడువేల సంవత్స రాలు పడుతుంది – మీ భూగోళం కాలమానం ప్రకారం నువ్వు ఆ గోళం నుండి చూస్తే ఈ సోక్రటీస్ విషంతాగేఘట్టం చూస్తావు. ప్లాటో, గౌతమీ పుత్ర శతకర్ణి, చోళరాజు, లంకేశ్వరుని చెల్లెలు శూర్పణఖ నీదగ్గరకి ఒచ్చారనుకుంటున్నావు. వాళ్ళు రాలేదు. నువ్వే వాళ్ళదగ్గరకి కాలం – స్థలం ఏకమైన నాలుగో పరిమాణంలో ఒచ్చావు.

ఆ గోళం నుండి చూస్తే సీజర్ హత్య కనబడుతుంది. ఇక్కడ నుండి విజయనగర సామ్రాజ్య పతనం కనబడుతుంది. కాలానికి ముందు వెనుక లేవు. అది స్థలంలో బంధించబడి వుంది. ఆ స్థలం భూగోళా నికి సంబంధించింది. అవుతే ఒక దృశ్యం చూస్తావు. మరో గోళం నుంచి మరో దృశ్యం చూస్తావు. ఘట్టాలకి మొదలు అంతం లేవు. అవి వుంటూ వుంటాయి. తిలకించేవాడు ఎప్పుడు ఎక్కడ వున్నాడో–దాని మీద ఆధారపడుతుంది ఆ వుండి వుండడం" అనేది.

"ఎంత ఉపన్యాసం దంచావయ్యా, మేడని కాస్త కిందకు దించ మంటే" అన్నాను.

దించారు.

"ఎక్కడ దించం" అని అడిగారు.

"ఎక్కడ ఖాళీవుంటే అక్కడ" అన్నాను.

"ఎక్కడా ఖాళీలేదు" అన్నాడు లెనిన్.

కిందికి చూశాను. ఎక్కడా విశాలమైన బైళ్లు లేవు. అన్నీ నగరాలు, నదులు, ఒంతెనలు, కర్మాగారాలు.

కాస్తంత ఆకుపచ్చ నేల వుంది. అది సరవయ్యగారి పొలంట. దానిగుండా నూనెగొట్టాలు పెడతారుట. అక్కడ ఓ స్తంభం పాతాలంటే పన్నులుట, పత్రాలుట, ఒడంబడికలుట. నా స్వంత పొలం ఓ రెండు ఎకరాలు వుంది. ఆ ప్రాంతంలో స్తంభం పాతించండి అన్నాను. మా కరణంగారు సహకరిస్తారు, కనుక్కోండన్నాను. ఐన్‌స్టీన్ మళ్ళా నవ్వుతూ మొదలెట్టాడు.

"మీ భూగోళం కాలమాన ప్రకారం ఆ ప్రజ నలభై ఏళ్ళు ముందుకు సాగారు. ఏడెనిమిది పంచవర్ష ప్రణాళికలు అమలు జరుపు కొని భూమిని పంకించుకొని యంత్రాల ద్వారా ఉత్పత్తి అభివృద్ధి చేసు కొని సుఖంగా ఉన్నారు. మీ వూరి కరణం, మునసబులు చనిపోయి పదేళ్ళయింది."

ఏం చేయను.

నా గాజుమేడకి చోటే లేదా!

రెండు పనులు జరగాలి. నా గాజుమేడ భూమి దగ్గరగా వుండాలి. అందులోకి జనం ఎక్కివొచ్చే నిచ్చెనలాంటి పరికరం ఉండాలి. తుదకు "లింకన్" సలహాపైన రెండు స్తంభాలు లేవనెత్తించి వాటమీద ఎత్తుగా నిలబెట్టే ఏర్పాట్లు చేశాడు "బెంజమిన్ ఫ్రాంక్లిన్". అతనికి గాలి పటాల ఆటంటే యిష్టంట. నా మేడ ఓ గాజు గాలిపటంట,

ఇప్పుడు బాగుంది. భూమి కనబడుతుంది. స్వేచ్ఛగా, హాయిగా, ఏకాంతంగా ఉన్నాను. ఇంక వినోదించవచ్చు. "నెఫెర్‌టిటి", "కాథరిన్", "ఆస్‌పోలీస్", "మేరీ పిక్‌ఫోర్డు", "మైత్రేయి", మల్లమ్మ, మాంచాల—వీరందర్నీ రమ్మన్నాను. తాన్‌సేన్, సైగల్ గానం సాగించారు. రంగాజమ్మ నృత్యం సాగింది. పిరుదులతో లయకలుపుతూ ఆమె భుజాలు ఎగురుతున్నాయి. విన్యాసానికి నడుం కాసేపు సన్నబడి, కాసేపు పెద్దదై కళ్ళల్లో కామం కదిపిన కాంతులు నల్లగా, తెల్లగా దాగిలి మూతలాడుతూ భక్తితో కందినచెక్కిళ్ళు, శృంగారంతో ఎర్రగా అదిరిన పెదవులను చూసి సిగ్గుపడి, నమ్రత, కవ్వింపు నుదిటిమీద ముంగురుల మధ్య యిరుక్కుని, జెడలో బంధించబడి, మెడలో దర్శనమిచ్చి, నరాల ఫిరాయింపులో రక్తం చిందిన చర్మం మెత్తటి వెలుగు ఆమె నవ్వులో కాంతికి తట్టుకోలేక నీడలో అంతర్ధానమైన దృశ్యంతో చైతన్యం గోల్పోయి గ్రాగుబోకునై, పశువునై, కేంద్రం గోల్పోయిన ఎలక్ట్రాన్‌లా పరిధిలేని సున్నాలా, కోణాలులేని త్రిభుజంలా.

* * *

ఏదో చప్పుడు—ఏవో ధ్వనులు. కిందికి చూశాను. క్రింద మనుష్యులు యిటుకేసిచూసి నవ్వుతున్నారు. కొంప మునిగింది. గాజు మేడలో పేచీయే యిది. ఏదో రహస్యంగా చేయడానికి వీలులేదు. కిందవారు చూస్తున్నారు. వాళ్ళకి వెటకారమా. ఆ గొడవ ఆపు చేయమని నానా ఫర్నవీస్‌ని పంపించాను. నే కూడా వెళ్ళి కనుక్కుంటా నన్నాడు నెపోలియన్.

తిరిగొచ్చి చెప్పారు. క్రిందవాళ్ళు నాకేసి చూడ్డం లేదనీ, వారివారి పనుల్లో నిమగ్నులైనారనీ, పైకి చూశారంటే, ఏ గ్రహణమో వుందను కొని చూసివుంటారనీ, నేను కంగారుపడనక్కరలేదనీ హామీ యిచ్చారు. అయినా నాకు భయంగానే వుంది.

"అనును. నీ జీవితం అంతా భయాలపుట్ట. ఈ నగ్నసత్యాలు,

యీ వినోదాలు ఏమిటో తెలుసా ? నిన్ను కనగానే మీ అమ్మకి జబ్బు చేసింది సువ్వామెపాలు తాగలేదు. మరో దాదిని పెట్టి పాలిప్పించారు. ఆమె ప్రేమించిన వ్యక్తి ఆమెని మోసగించి వెళ్ళిపోయాడు. ఆ భగ్న హృదయంతో నీకు స్తన్యం యిచ్చింది. ఆ భయాలు, అనుమానాలు, భగ్నవాంఛలు నిన్ను పట్టుకుని పీడిస్తున్నాయి. నిన్ను గురించిన యథార్థము తెలుసుకుని యిప్పుడే యీ ఏకాంత కామకలాపాలు విరమించు" అన్నాడు ఫ్రాయిడ్.

"నీ చేత యిల్లాంటి సిద్ధాంతాలు చెప్పించేటందుకు, బాల్యంలో నీ అనుభవము ఏమిటో జ్ఞప్తికి తెచ్చుకుని, ముందు నీ ఆంతరంగికాన్ని నువ్వు సరిచేసుకో"అని మందలించాను.

దీన్ని హర్షించాడు ఏడ్లర్.

"ఇప్పుడింతకీ చేయవల్సింది ఒకటుంది. నాకు బైటవాళ్ళు కనబడాలి. కాని బైటవాళ్ళకి మాత్రం నేను కనబడకూడదు. అట్లాంటి గాజుని కనుక్కోలేరా విజ్ఞానశాస్త్రవేత్తలు" అన్నాను.

న్యూటన్" కనుక్కుంటా నన్నాడు. కాని దానికి కావాల్సిన పరికరాలు భూమిలో ఉన్నాయి. కొన్నివేల మంది పనివాండ్రు చాలా కాలం శ్రమపడాలి అన్నాడు. తెప్పించమన్నాను. అలెగ్జాండర్ తన సైన్యాన్ని రప్పించాడు. కుతుబ్‌మీనార్ కట్టిన కూలీలు సిద్ధమయ్యారు. ఆంగ్‌కోర్‌వాట్, మజ్‌దూర్ లొచ్చారు. పరికరాలు యిక్కడికి తెప్పిస్తే పనికి పూనుకుంటాంగాని, మేం భూలోకంలోకి మాత్రం వెళ్ళమని ఖచ్చితంగా చెప్పారు. మరెల్లా ?

భూమిమీద పనివాండ్రని వినియోగించండి అని వీరేశలింగం పంతులు గారి సలహా.

"వారికి వేతనాలివ్వాలి. పైగా చరిత్ర సమకూర్చిన ఆస్తిపాస్తులు అనుభవిస్తూ, ఏమీ పనిచేయకుండా, వినోదించే యీ చరిత్రస్వామి తత్వం పెంపొందించేటందుకు రమ్మంటే ఆ పనివాండ్రురారు. వారంతా

ఏకమై ఒక వుద్యమంలేవదీసి, విప్లవం చేసి నీ గాజుమేడ కూలదోస్తారు" అన్నాడు కారల్‌మార్క్స్.

"వినోదం, తీరిక, కాలక్షేపం లేకుండే నాగరికతే లేదు; కళా సృష్టి లేదు; పోషణ లేదు. అటు చూడు, స్తంభాల క్రింద కార్లు, ట్రాములు, రైళ్ళు, యంత్రాలు, పొగ, తారు, కరిగిన ఇనుము, అతికిన ఉక్కు—ఈ కృషి అంతా ఎందుకు ? తిండి, బట్ట సరిపోతాయా ? నిత్య జీవితంలో సౌందర్యం అక్కర్లేదా ? ఆత్మవిశ్వాసం ఉండాలా ? సత్యాన్వేషణ, దైవచింతన అక్కర్లేదా ?" అని అడిగారు "విలియమ్ మారిస్", "సామ్యుయల్ బట్లర్."

"అవన్నీ ధనికులు బీదల్ని తృప్తిపరచడానికి కల్పించిన మాయ తత్వం. ఏ సృష్టి జరిగినా ఆకలి ద్వారానే" అన్నాడు ఏంజెల్స్.

కిందవాళ్ళకి కనబడకుండా బైట గోడలకి, నేలకి ఏదేనా లేపనం పుయ్యమన్నాడు, "పాస్కల్". అల్లాగే చేశారు.

అది వల్లకాదన్నాడు గాంధీగారు. పదిమందీ ఆక్షేపించే పని మనం ఏకాంతంగా చెయ్యకూడదన్నారాయన. భూలోకంలోవారినందర్ని రప్పించి, వో గంటసేపు, చర్ఖాలు త్రిప్పి, దారాలు ధరించమన్నారాయన. నే నేం చెయ్యను ? ఆయనంటే భయం నాకు. నెలరోజుల కోనాడు వుపవాసం ఉంటానని, ఆ రోజు ఆయన సిద్ధాంతాలను స్మరించి రాట్నం వాడుకుతాననీ వాగ్దానం చేశాను.

"నువ్వు పాటించలేని వాగ్దానం మాత్రం చెయ్యకేం" అని నవ్వు కుంటూ వెళ్ళాడు మహాత్ముడు.

మళ్ళా గానం, నాట్యం, కవిత్వపఠనం మొదలుపెట్టారు.

సారాబెర్నాట్ శకుంతల, హరిప్రసాదరావు దుష్యంతుడు—నాటకం. రుంగల చలపతి సక్కుబాయి, జీమ్స్ బాస్వెల్ ఆమె భర్త—మరో నాటకం.

ఖలీల్ జిబ్రాన్ ప్రేమగేయాలు; బాడిలేర్ బూతు పద్యాలు; ఈసప్ పిట్టకథలు, ఆనార్కలీ విషాద ప్రణయం. నేనును వాటిల్లో కలిసిపోయి, విడిపోయి, నన్ను వెదుక్కుంటున్నా. "ప్రేక్షకు లేరీ ?" అన్నాడు సోక్రటిస్.

"ఇప్పుడేమిటి నేను ఆనందిస్తుంటే" అన్నాను.

"పిచ్చివాడా—నువ్వు ఆనందించడంలేదు. నిద్రపొయ్యావు. నిద్రలో కల—అంతే; ఈ కళాకారు లెవరూ రసికులు లేనిదే వుపక్రమించరు—లే, లే, కళ్ళు తుడుచుకో" అని కదిపాడు సోక్రటీస్.

అవును, ఎవ్వరూ లేరు. ఏదో కల. ఎక్కడినుంచో పెడవాసన, తారుకంపు-అబ్బ! పొగ-నుసి- కళ్ళల్లో పడుతుంది. ఏమిటిదంతా ?

ఇవన్నీ భూమినుంచి బైలుదేరిన వాసనలు, చప్పుళ్ళు, దృశ్యాలు, అన్నారు నలుగురైదుగురు. ఇవన్నీ ఆపుచెయ్యమని చెప్పేస్తానని "మహమ్మద్ గజనీ" వెళ్ళాడు.

వాళ్ళేదేమీ ఆపరుట.

మేం అందరం వెళ్ళి చావదన్ని చక్కావొస్తాం — అన్నాడు గురజాడ.

"యుద్ధం తగదు—మన మేడ మరో చోట పెట్టుకుందాం" అని అశోకుడి బోడి సలహా.

పైగా మన మేడేమిటి ? ఇది నా మేడ. ఈ ముఠా అంతా రాత్రీ పగలూ ఇక్కడే వుంటారా ఏమిటి కొంపతీసి ?

అందర్నీ అవతలకి పొమ్మన్నాను. ఒక్కసారిగా శ్మశానాలు తెరుచుకున్నట్లుగా నవ్వులు ప్రతిధ్వనించాయి. ఒక్కసారిగా గాజుమేడ కదిలినట్లయింది.

ఒగుర్చుకుంటూ చక్కా ఒచ్చాడు, వాత్సాయనుడు.

"నా కామసూత్రాలు చదివి యీ మొగాళ్ళు ఆడాళ్ళు సంతోషంతో బలం తెచ్చుగున్నారు. నీ మేడ స్తంభాల్ని వూపేస్తున్నారు" అన్నాడు.

"ఏం, ఏమొచ్చింది?"

"ఏమో. వాళ్ళేదో కట్టుగుంటారట. వినోదశాలట; యీ స్తంభాలు అడ్డంగా ఉన్నాయిట; తియ్యకపోతే ఊడపీకుతామంటున్నారు" అన్నాడు.

"అందరూ వెళ్ళి విషయమేమిటో కనుక్కోండి", అని గర్జిం

సమాధానం లేదు. ఎవ్వరూ మాట్లాడరు.

ఆఖరి కన్నాడు అరిస్టాటిల్. మీ మనుషులు చరిత్రలోకెళ్ళా ల్సిందేగాని, చరిత్రలో మనుషులు మీ దగ్గరికి రారు. వారి కంతటి నిజాయితీ."

ఏడిసినట్లే ఉంది.

"పోనీ మేడ మరో చోటుకి మార్పించండి" అన్నాను.

టపీమని ఒక రాయిలాంటిది అద్దం నేలమీద పేలింది. గాజు ముక్క ఊడింది. మరో రాయి; మరోటి. నేల ముక్కలవుతోంది. ఏమిటిదంతా?

"కిందవాళ్ళు స్తంభాలని కదల్చలేక మేడమీదికి రాళ్ళు విసురు తున్నారు" అన్నాడు వీరేశలింగం.

"ఓర్చలేరండి" అని పైకనేశాను.

"నువ్వు వాళ్ళని చూసి ఓర్చగలిగావా?"

వీ డెవడు? షేక్స్పియర్. "ఏదీ మనసారా చెయ్యలేవు. నీకు స్నేహం కావాలి. మనుష్యులు పనికిరారు. ప్రేమ కావాలి, భార్య చాలదు; గట్టిగా, తీవ్రంగా, బలంగా, స్వేచ్ఛగా ఏ ఉద్రేకానికీ లొంగి పోవు; అన్నీ సగంసగం ఏడుపు; మూతి బిగించి ముద్దుకోరుతావా? చేతులు వెనక్కి కట్టుకొని కౌగలింపా? నీ కన్నీరు కాస్త కాస్త, కొంచెం కొంచెం కావాలి. దేనికోసం కృషిచెయ్యవు. ప్రతిదీ లభించాలి. చీమ క్టుడితే ఆపరేషన్; ప్రేయసి బుగ్గగిల్లితే తలవంపు—నీ గర్వం, నీ అహం,

నీ క్రౌర్యం, నీ కామం, నీ నీచత్వం, నీ అల్పత్వం—అన్నిటికి సాక్షి నీ గాజుమేడ. అది కూలి అందులో హతమవ్వడమే నా విషాదాంత నాటకాంతం—నీ జీవితాంతం..."

రాళ్ళు పడుతున్నాయి. పొగ దట్టంగా అలుముకొని, చీకటి చేస్తోంది.

"పోనీ నన్ను దించివెయ్యండి—మా మనుష్యుల్లోకి, భూమిమీదకి పోతాను" అని దీనంగా కోరాను.

ఎవరో నవ్వుతున్నారు. ఆ నవ్వు గుర్తుంది—ఐన్‌స్టీన్.

'నువ్వు భూమిమీదికి పోలేవు' అన్నాడు. కచ్చితంగా.

"ఎందుకు పోలేను ?

"నువ్వు నలభై ఏళ్ళ క్రితం గాజుమేడ పూర్తిచేశావు. భూలోకం కాలమానం ప్రకారం ఇప్పటికి మరో నలభై ఏళ్ళయింది. నీ ఆయుర్దాయము డెభ్భై ఏళ్ళు. అంటే ఏమన్న మాట !"

బిక్క మొహం వేశాను.

"నీకు లెక్కలు రావు. నువ్వు చనిపోయి పదేళ్ళయింది, మీ కాలమానం ప్రకారం".

'అమ్మయ్యో బాబో' అంటూ శోకాలు మొదలెట్టాను.

'ఏడవకు. చచ్చినా, బ్రతికినా నీలో మార్పులేదు. ఏదో కృషిచేసి, ఏకాంతంగా ఆలోచన సాగించి, దీక్షతో మహాకార్యం సాధిస్తానన్నావు మొదట్లో. నువ్వు సాధించిందేమిటి ? చచ్చింతర్వాత కూడా ఆ చేష్టలే. ఆ అవతారమే, ఆ టికమక ఆలోచనలే. కాబట్టి పాఠం నేర్చుకో బ్రతికుండగానే నువ్వు ఏదన్నా సాధించాలి, చచ్చింతర్వాత కాదు'.

"ఇంక నే నెక్కడ బ్రతికేది — ఇంతటితో సమాప్తే."

నీ లోకం లెక్కల ప్రకారం సమాప్తే. కాని మరోగోళంలో, మరో దృక్పథంతో, నువ్వు బ్రతికేవున్నావు. అదే మానవుడి చరిత్ర. దూరముగా ఆ గోళంకేసి చూడు. అందులోంచి చూస్తే నువ్వసలుపుట్టనేలేదు.

"మరి ఈ అనంత విశ్వంలో ..."

"విశ్వం అనంతంకాదు. దానికి పరిమితి వుంది. నువ్వనుకున్న మీ విశ్వంలో ప్రయాణం చేస్తే, మళ్ళా తిరిగి యిక్కడికే చేరుకుంటావు. శూన్యం గుండ్రంగా, వొంగిఉంది. బత్తాయి పండు మీద చీమ నిరంతరం తిరుగుతూ, విశ్వం అనంతం అనుకుంటుంది. అంతే నీ బ్రతుకు."

చచ్చినవాడికి—నాకీ మేడలో కాపరం ఏమిటి? ఏదీ ఒక రాయి యివ్వు, పగలకొడతాను. ఈ గాజు పెంకులన్నీ కూలి క్రింద మనుష్యుల మీదపడి చస్తారు. నాకసి తీరుతుంది.

"చచ్చిన వాడివి ఇప్పుడైనా దయలేదా? మనుష్యుల్ని ప్రేమించ లేవా? నీ గాజు మేడ నువ్వే పగలకొట్టుకో—కాని క్రింద మనుష్యుల మీదపడదు. మరో గోళం వైపు ఆకర్షింపబడే అణువులు గాజులో వెయ్యించానని చెప్పానుగా. ఈ ముక్కలన్నీ మరో గోళంలోకి పోతాయి."

"మరి నేను?"

"ఇంకా 'నేను' అనే భావిస్తున్నావా? ఇంక నువ్వు లేవు. ఆ గాజు పెంకుల మధ్య ధ్వంసమై పరిమితి గల విశ్వంలో, గుండ్రముగా తిరిగి తిరిగి యిక్కడికే చేరుకుంటావు."

మనుష్యులు వేసిన రాళ్ళలో ఒక రాయితీసి బురుజు మీద విసి రాను. అందులో 'రవివర్మ' కూర్చొని ఏవో చిత్రాలకి మెరుగులు పెడు తున్నాడు. అతనికి తగిలింది రాయి.

అతనికి కోపంవచ్చింది. ఆ సీసాలు, ఆ కుంచెలు తీసి బురుజు కేసి కొట్టాడు. ప్లాటో వాయిస్తున్న "హార్పు" తీగలపై అపశ్రుతులు మోగించి నా మొహాన కొట్టాడు.

"ఈ సగంచచ్చిన మానవుడు చరిత్రలో అమరులమైన మనల్ని కించపరిచాడు; దూషించాడు—పైగా రాళ్ళతో హింసిస్తున్నాడు. మనం అతనికోసం పడిన శ్రమంతా వృధా అయింది. కృతఘ్నుడు; ఊరుకుం

టారేం ! ఆతన్ని అనామకుడుగా చేసిపారెయ్యండి. తన్నండి, హింసించండి" అంటూ 'సిసిరో' 'శ్రీనివాసశాస్త్రి'లు తమ గంభీరోపన్యాసాలతో పురికొల్పుతున్నారు.

పిరమిడ్లు వూడబీకి ఆ రాళ్ళతో నా గాజుమేడని పగల గొడుతున్నారు. హంపి, హారప్పా, మొహంజదారో, చైనా, హాడ్రియన్‌గోడలు— అన్నీ వూడలాగి నా మేడని కొడుతున్నారు. క్రింది నుంచి మనుషులు రాళ్ళతో నేలని పేలుస్తున్నారు. పైన, క్రింద, ఎడమ, కుడి అన్ని దిక్కుల నుండి రాళ్ళు, పెంకులు, బాణాలు, గొడ్డళ్ళు, పారలు, కంచు చెంబులు, ఇనుప బల్లాలు, విమాన విధ్వంసక తుపాకులు, ఆటంబాంబులు అన్నీ పేలిపోతున్నాయి.

పెద్ద చప్పుడైంది. చరిత్రలో స్త్రీలు ప్రియుల్ని తమ రొమ్ముల మీద హత్తుకున్నప్పుడు చేతుల గాజులు పగిలిన చప్పుడు; సముద్రగర్భములో కోటి ముత్యపు చిప్పలు విడి ముత్యాలు పగిలినట్లు, పగతో నియంతలు పళ్ళు పటపట కొరికినట్లు, ఓదలైన వృద్ధులు చలికి తట్టుకోలేక కొట్టుకుంటున్న పళ్ళను బిగించినట్లు, ప్రేమతో దైవం పిలుస్తుంటె వినిపించుకోక సమాధిలో కెళ్ళిన భక్తుల గుండెకాయలు పగిలిన చప్పుడు ... నా గాజుమేడ కూలింది.

జారిపడి ముక్కలైంది టీ కప్పు. పెండ్లికి స్నేహితుడచ్చిన కానుక టీ సెట్టు – సెట్టులో మిగిలిన వొక్క టీ కప్పు. మిగతావి వారూ వీరూ తీసుకుపొయ్యారు. ఇదొక్కటే మిగిలింది. ఇది కాస్త పగిలింది. ఆ సమయంలో ఆమె స్నానాని కెళ్ళడం నొక అదృష్టం. గబ గబా పగిలిన ముక్కలు ఏరి, ఎత్తి పారేస్తూ, ఆ కొద్ది విషాద మధురక్షణాలలోనే కన్న పగటి కల నా గాజు మేడ !

# 4711 ఓ ఢి కొలోన్

(ఆమె చెప్పినట్లుగా)

శనివారం కోర్టుండదు గనుక మూడు గంటల మేటనీ చూచి, అల్లా బీచికి వెళ్ళి ఎనిమిదింటికి యింటికి రావడం వారికి మామూలు. అట్లాంటిది ఆ దినం ఆరింటికే వొచ్చి తలుపుతట్టారు. ఇంత చప్పునే వొచ్చారేమిటా అనుకుంటూ తలుపు తీశా.

"ఇవాళ మీ రావణాసురుడు కనిపించాడు" అంటూ ఎందుకో నవ్వుకుంటూ కుర్చీలో కూర్చున్నారు. నా కర్థంకాలేదు. ఫ్లాస్కులో కాఫీ కప్పులో పోసి చేతికిచ్చి ప్రశ్నార్థకంగా వారికేసి చూశాను.

"......?"

"అతనే" మీ రావణాసురుడు పద్మరాజు అన్నారాయన. నాకు చాలాభాగం అర్థమైంది. కాని తెలీనట్టే.

"ఎవరండి?" అన్నాను.

"మీ చిన్నప్పటి పద్మరాజు."

నాకు పూర్తిగా తెలిసింది.

"నిజంగా? ఎక్కడండి?" కర్తిలేని కుతూహలాన్ని కనుబొమ్మలలో ప్రకటించా. ఆయన "మీ పద్మరాజు" అన్నందుకు నాకు కోపము రాలేదు. "మీవాడు", 'మీవూరు', మీ తాలూకు—" అంటూండడం ఆయనికి బాగాఅలవాటు. మనస్సులో ఏదోపెట్టుకుని అనడంకాదు. నాకుచూపే ఆంతరంగిక గౌరవాలలో అలా అనడం వొకటి.

'సినిమాలో కనిపించాడు.' సగం ఆటలో దీపాలేశారు. అప్పుడు నా పక్కనే కూర్చున్నాడు. కప్పు బల్లమీద పెట్టారు.

'ఆయనే పద్మరాజని మీకెట్లా తెలుసు? ఇదివరకు చూళ్ళేదుగా.'

'చెప్పనీ. మీదేవూరన్నాను. నీ వూరి పేరే చెప్పాడు. తన పేరే చెప్పాడు. సుందరం ఇక్కడే ఉందన్నా. 'ఆహా, అల్లాగా' అన్నాడు.

'ఐతే యింకా జ్ఞాపకం ఉన్నానన్నమాట.'

'మిమ్మల్ని గురించి చాలాసార్లు చెబుతూ ఉండేది సుందరం' అన్నాను. విని ఊరుకున్నాడు.'

'ఇప్పుడేం చేస్తున్నాట్ట?' అన్నాను. ఏదో అనాలి గనక. ఎమ్.ఏ. పూర్తిచేశాట్ట.'

'అబ్బా. పెద్ద చదువే వొచ్చిందే. చిన్నప్పుడు చదువురాదనుకునే దాన్ని. పెర్రిబాగులాడిలా కనిపించేవాడు.'

'అపును' సూటూగీటూ వెయ్యకపోతే శుద్ధ అమాయకుడులాగే ఉండును' తువ్వాలు పైన వేసుకుని, 'బీచి'కని బయలుదేరారు.

'ఉద్యోగం మాట చెప్పాడా?' అని మెట్లమీది కొచ్చి అడిగాను.'

'అబ్బే లేదు. ఏదీ, ఇంతలో దీపాలార్పేశారు. ఆట ముగిసి దీపాలేసిం తర్వాత చూస్తినిగదా, అక్కడ లేనేలేడు. ఎప్పుడెళ్ళిపొయ్యాడో!'

పద్మరాజుని గురించిన ఈ చివ్వరివిషయం ఆ రాత్రి నన్ను నిద్రపోనిచ్చింది కాదు. అతన్ని తల్చుకోనిరోజు లున్నాయనడం నన్ను నేను మోసంచేసుకోడంలో చేరుతుంది. అతన్ని గురించిన ఆలోచనలు నాకు భయం, ఆశ్చర్యం, సంతోషం గలగచేస్తాయి. ఈ మూడింటిలో ఆశ్చర్యం ఎక్కువ. అతన్ని బాగా జ్ఞాపకానికి తెచ్చుకున్న తరవాత నాలో ఎల్లాంటి మార్పు కలిగిందీ తెలుసుకోవడానికి చాలాసార్లు అద్దంలో కూడా నా ముఖం చూసుకునేదాన్ని.

మావారు చెప్పిన విషయాలని బట్టి అతను నన్ను మరచిపొయ్యే ఉంటాడని స్థిరపడింది. సినిమా అవకుండానే ఎక్కడ మాట్లాడాల్సి వొస్తుందో అని వెళ్ళిపోయిన అతని ప్రవర్తన నాకు కోపం కూడ కలగ జేసింది. ఎందుకంటే, అతన్ని గురించి ఎవరేమనుకున్నా ఎవళ్ళకీ అతనిమీద కోపం రావడం అసంభవం. అతనట్లాంటివాడు నాకే కోపం రావడాన్ని బట్టి ఆ సినిమాలో మనిషి నిజంగా పద్మరాజు కాదేమో నని

పించింది. కాని మావారు ఇట్లాంటి విషయాల్లో ఎన్నడూ పొరబాటు పడరు.

*　　*　　*

అవన్నీ పదహారు సంవత్సరాలనాటి సంగతులు. పద్మరాజు తండ్రి, మా నాన్నా ఒకే ఊళ్ళో మూడు సంవత్సరాలు ఉద్యోగం చేశారు. వాళ్ళఇల్లు మా ఇంటి పక్కనే. నాకూ అతనికీ మొదట్లో ఎల్లా స్నేహం కలిసిందో నాకు జ్ఞాపకంలేదు. ఒకరోజున అతను ఎగరేసిన గాలిపటం మా దొడ్లో చెట్లమీద యిరుక్కుంది. మా దొడ్లో కొచ్చి చెట్టెక్కుతుంటే నేను 'ఎవరది ?' అన్నాను. 'గాలిపటం' అన్నాడు. అతను స్నానం చెయ్యగానే, క్రాపింగు దువ్వుకోకుండావుంటే చాలా ఆకర్షణీయంగా వుండే వాడు. బుగ్గలు, సిల్కుబట్టలా మెత్తగా, వెలుగుతో మెరిసిపొయ్యేవి. తీర్చిన ఆ ముఖంలో యే ఒక్క స్థలాన్నీ చూడనీకుండా, చిన్న ఒంకీల వెంట్రు కలు నుదురుమీద పడి గంతులేసేవి. కళ్ళు ఎవరికేసీ చూస్తున్నట్లుగా ఉండవు. ఎంతో అమాయకంగా, దీనంగా, అర్థశూన్యంగా మెరిసి పొయ్యే కళ్ళతనివి. ఆ కనురెప్పలు ? బొమ్మల్లో కూడా అంత నమ్మ రాని వాటిలా ఉండవు. వాటిని కత్తిరించి నా కళ్ళకి అతికించుకుందా మనుకునేదాన్ని. ఎప్పుడోకాని నవ్వేవాడు కాడు. నవ్వినప్పుడు నన్ను నేను మరిచిపొయ్యేదాన్ని. గాలిపటం కోసం అతను కొమ్మల్లో అవస్థపడు తుంటే నేను నిర్ఘాంతపోయి నిలబడిపొయ్యాను. దారం తెగి గాలిపటం ఎగిరిపోయింది. దాంతో నా మనస్సూ ఎగిరిపోయింది.

*　　*　　*

మొదట్లో అతనూ నేనూ కలసి, రోడ్లమీద రైలాట ఆడుకునే వాళ్ళం. అతను ఇంజెను. చొక్కా పట్టుకుని వెనకాల గార్డుపెట్టెలా నేనూ. ఈల ఊదేదాన్ని; అతడు 'కొకోకొక్' అని చెవులు గింగుర్లెత్తే టట్లు కూసి, 'ఛక్ ఛక్' అని చప్పుడు చేస్తూ రెండు చేతులూ పైకి క్రిందకి త్రిప్పుతూ, గంతులేస్తూ లాంతరు స్తంభందాకా పరుగులెత్తే

వాళ్ళం. మధ్య మధ్య నిలబడి 'గూడూర్' అని కేక వేసేవాడు. నేను 'టీ' 'సోడా' 'చుట్టా' 'సిగిరెట్' అని అరిచేదాన్ని. ఇల్లం పరుగు లెత్తుతూ ఆడుకోడమేకాని, ఎప్పుడూ కబుర్లు చెప్పుకొనేవాళ్ళం కాదు. చాలాకాలం నుంచి కలిసివున్న వాళ్ళలాగా, క్రితం జన్మలో బాగా పరిచయం వున్న వాళ్ళ మాదిరి మాకు మాటలే కనిపించేవి కావు మొదట్లో. రైలాట ఆడుకుంటుంటే, మా నాన్న ఆఫీసునుంచి రావడం చూసి, నేను అతని చొక్కా వొదిలేసి ఇంట్లోకి పారిపొయ్యాను. నేనింకా వెనక నున్నాననుకునే అతను 'ఛక్ ఛక్' అంటుండగా మా నాన్న వచ్చి చొక్కా పట్టుకుని 'నన్నెక్కనిస్తావా నీ రైలు ?' అన్నారు.

'ఇది గూడ్సుబండి కాదు. మనుషులెక్కేది' అన్నాడు.

'రి తుంటరీ!' అన్నాడు మా నాన్న. 'ఇంజన్ నీళ్ళకెడుతోంది' అని వాళ్ళ ఇంట్లోకి పొయ్యాడు.

తరవాత కొన్నాళ్ళు మా దొడ్లో 'రాముడూ, సీతా' ఆట ఆడుకునే వాళ్ళం. మా రామాయణంలో లక్ష్మణుడు లేడు.

'నాకు ఆ లేడిపిల్ల కావాలి' అనేదాన్ని. వెంటనే అతను చీపురు పుల్ల తీసుకుని మేకపిల్ల వెంటపడేవాడు. అది నిజంగా అందేది కాదు. ఆట మాట మరిచిపోయి, దాన్ని పట్టుకోడం కోసం వీధులన్నీ తిరిగి కొన్ని గంటలదాకా ఒచ్చేవాడు కాడు. లేడిపిల్ల చిక్కకూడదని జ్ఞాపకం ఒచ్చేది కావును, యింక రావణాసురుడి వేషం వేసేవాడు. అట్టతల కాయలు కత్తిరించి మసిబొగ్గు నీళ్ళల్లో కలిపి కోరమీసాలూ, కళ్ళూ గీసి తలకి చుట్టుకొని 'బియ్యం పెటు' అంటే నేను బసాలో బియ్యం అతని చేతుల్లో వెయ్యగానే, నన్ను లాక్కుని గడ్డివాముమీదికి తీసుకుపొయ్యే వాడు. అది రావణాసురుడి విమానంట. ఆవుమాద గడ్డిలో ఆడుకుంటూ మాకేసి చూసేది. అది జటాయువుట. ఒకరోజున పెద్ద ఆవు మా గడ్డిమేటి దగ్గఱికి చక్కా వొచ్చింది. దాని కొమ్ములు మాకు దగ్గర్లో వున్నాయి. నాకు చాలా భయమేసింది. పాలేరో వొచ్చి దాన్ని తోలేశాడు. అది దూరంగా వెళ్ళేదాకా రావణాసురుడు

విమానం దిగలేదు. ఇంతవరకూ మాత్రం మావారికి తెలుసు.

మరికొన్నాళ్ళు ఇళ్ళింట్లో 'మొగుడు పెళ్ళాం' ఆట ఆడుకునే వాళ్ళం. వాళ్ళింటికి పెద్దదొడ్డిలేదు. అందుచేత డాబా మీదికి చేరి మడత మంచాలు రెండువాల్చి, దుప్పట్లు చుట్టూ కిందకి లాగి మంచాలకింది చాపని ఇల్లుగా భావించేవాళ్ళం. కానీ కారప్పూస కొని లక్క పిడతలో పోసి, ఇటికమీద పెట్టి, తంతంతా జరిపి అన్నంకింద వొడ్డించేదాన్ని. తర వాత వేటకని వెళ్ళేవాడు. పావుగంటలో వీధిలోని నల్లకుక్కపిల్లకి తాడు కట్టి తీసుకొచ్చేవాడు. 'ఇవాళ వేటనుంచి ఏం తెచ్చారు ?' అని అడగ్గానే 'ఇదిగో యీ సింహపుపిల్ల వొక్కటే దొరికింది' అనేవాడు. చాపలమీద పడుకునేవాళ్ళం. నేను కాళ్ళుకూడ పిసికేదాన్ని. కాలెండర్ కాగితాలమీద చాకలిపద్దు వేసేదాన్ని. అతను నిద్రపోయినంతసేపూ కనుబొమ్మల్ని లెక్కపెట్టడమే కాని నిద్రపట్టేదికాదు. గంటలో పెద్దగాలి ప్రారంభించి కారప్పూస పొట్లాన్ని తీసుకుపోయింది. మా గుడారం కదిలిపోయింది. 'అయ్యో ఇల్లుకూలింది లేవండి' అని అతన్ని లేపాను. 'పెద్ద డాబా కడదాం పద' అని మెట్లుదిగాం. మా స్థితిచూసి సింహపుపిల్లకు కోపం వొచ్చి మొరిగింది.

◆ ◆ ◆

'ఇవాళ మీ ఇంజన్ డ్రైవరు కనిపించాడు' అన్నారాయన.

'మీ గూడూర్' అని నవ్వి పిల్లాడిలాగ 'కొకోకొక్' అని కూసి చేతులు వూగించి గదిలో పచార్లుచేశారు. నా కర్మమెంది.

'ఎక్కడ ?'

"ట్రాంబండిలో, ఏదో పెద్ద పరీక్షకి కట్టాట. పరీక్షకి రెండు రోజుల్లో ఢిల్లీ వెడతాడుట. అది ప్యాసైతే మంచి వుద్యోగం దొరుకు తుందట..."

"మనింటికి రమ్మనలేకపొయ్యారా ?"

"అందామనుకున్నా. ఇంతలో "నే వెడతా" అని ట్రామ్‌లోంచి దిగిపొయ్యాడు."

"మకాం ఎక్కడో ?"

"ఏం చెప్పందే. బండిలోజనం మమ్మల్ని మాట్లాడుకోనిస్తేనా, కాళ్ళు తొక్కేవా డొకడూ, వొళ్ళో కూచునే వొకత్తీ..."

♦ ♦ ♦

నా కీచర్య మళ్ళీ ఆరాటం కలిగించింది. మావారు ఏమన్నా అనుకుంటారేమో ననుకుని అల్లా సిగ్గుపడి వెళ్ళిపొయ్యాడా! కాని సిగ్గుకీ, దాపరికానికీ కారణాలు లేవే. వెనకటిరోజులు నాకు మళ్ళా తెరమీద బొమ్మల్లా కనిపించేవి. బాగా చిన్నతనంలోనే నాకు పెళ్ళి స్థిరపడినరోజున కూడా నేనూ పద్మరాజూ వాళ్ళదొడ్లో చాలా సేవు కలిసి కూర్చున్నాం. నాకు పెళ్ళి" అని సిగ్గుతో తలొంచుకున్నా. "భలే, భలే. నాకు కొత్త చొక్కా వొస్తుంది" అన్నాడు. పెళ్ళంటే ఏమిటో, ఎట్లాంటి త్యాగాన్ని కోరుతుందో అభిప్రాయమే లేదు మా యిద్దరికీ.

"నేనూ చేసుకుంటా పెళ్ళి, మానాన్ననడిగి" అని మూతి బిగించి జాలిగా చూశాడు.

"నీ పల్లకీలో కూచోనా ?" అన్నాడు.

"అమ్మో!"

"పోనీ పల్లకీకింద నడుస్తా. మధ్యలో ఆగినప్పుడల్లా కారప్పూస పెడుతూండు, ఏం ?"

ఆ అమాయకం నాకు మరుపురాదు.

మధ్యలో మేం దెబ్బలాడుకునేవాళ్ళం కూడా. ఎందుకో తెలియదు.

పొద్దున్నే నాగడిలోకొచ్చి "నీకూ నాకూ మాటల్లేవ్, తెలుసా. మా డాబామీదికి చూడొద్దు" అనేవాడు.

"ఇప్పుడెందుకు మాట్లాడావ్ ?" అన్నా.

"ఇకనుంచి మొదలు, ఒకటి, రెండు, మూడు — " అని బుగ్గలు చేతుల్లో కొట్టుకుని కనురెప్పలు పీక్కున్నాడు.

ఒకరోజు సాయంత్రం మావొడ్లోకొచ్చి నా మంచానికి ఎదురుగా కూర్చున్నాడు.

"ఓవూళ్లో అమ్మాయి వుందట" అని మొదలెట్టాడు.

"నాతో ఎందుకు మాట్లాడతావ్ ?"

"నీతో మాట్లాడంలేదు. ఆ గడ్డిమేటితో మాట్లాడుకుంటున్నా. ఉంటే ఏమైందిట, ఆ అమ్మాయి పెళ్ళిట. ఆపళంగా, ఆవూళ్లోనే ఓ అబ్బాయి వున్నాడట." నేను చెవుల్లో వేళ్ళు దోపుకున్నా, వినడాని కిష్టం లేనట్టు. ఇంతలో "పద్మా" అంటూ వాళ్ళమ్మ చక్కావచ్చి మేష్టారొచ్చా రని బరబరా యీడ్చుకుపోయింది.

"ఆ అబ్బాయిని వాళ్ళమ్మ ఈడ్చుకుపోయిందిట" అన్నా, అతని కథని అందుకొని పూర్తిచేస్తూ.

"మళ్ళా వొచ్చి తంతాట్టలే. ఐతే మరిచిపొయ్యాను. నాతో ఎందుకు మాట్లాడతావ్ ? ఇంట్లోకి వెళ్ళాడు.

ఆ రాత్రే ఎనిమిదింటికి వాళ్ళ డాబామీదికి వెళ్ళాను. అతను నిద్రపోతున్నాడు. చెవులో అగ్గిపుల్ల పెట్టాను. ఖంగారుపడి లేచి ఆవు లించి చప్పుడుకాని చిటికలేసి, నా ముఖాన్ని తన రెండుచేతులతో దగ్గ రకు లాక్కున్నాడు. మా యిద్దరి ముఖాల మధ్యా వాతావరణం గొప్ప పరిమళంతో బరువెక్కిపోయింది. అది సంపెంగ, మంచిగంధం, గులాబీ కలిపితే వొచ్చే సువాసన. ఆ దగ్గరతనం, ఆ వేడి-ఆ సౌందర్యం నే భరించ లేకపొయ్యాను. ప్రతిరాత్రీ లోకంలోని కోటానుకోట్లు స్త్రీ పురుషులూ, దేనికోసమో వెతుకుతున్నట్లు, వొకళ్ళ పెదవులకోసం వొకళ్ళు తడుము కుంటారు. ముద్దుపేరు చెప్పి, యింతమందీ వెదికేది, ఎక్కడో యథార్థమె వుండాలి! అదేమిటో నాకు తెలీదు. అతను ముద్దుకోసం నా నోరు వెదక లేదు. ఆ యథార్థం మా యిరువురి మనస్సులలోను ఆనాడు, వుండి ఉంటుంది. అప్రయత్నంగా వెనక్కిలేచి నిలబడ్డాను. తన బొటన వ్రేలుతో చూపుడువ్రేలిని నొక్కి నా చెక్కిలిమీద కొట్టాడు. చురుక్ మని తగిలి కొంచెం మండింది. తొందర్లోనే ఆ మంటపోయినందుకు దిగులుపడ్డాను. నా ప్రక్కనే కూర్చొని ఏవోకబుర్లు మొదలెట్టాడు,

"అపళంగా, పల్లకిలోంచి పెద్దభూతం ... అగరొత్తులు వెలిగించి చెయ్యి కాలింది..." నేను వింటూ నిద్రపోయ్యాను అక్కడే. "పువ్వులు... మాంచిమాంచి టోపీలు ... పులి ... ఏయ్, వూరుకో...అమ్మదొంగా" అట్లాంటిమాటలు నిద్రలో వినిపిస్తూనే వున్నాయి నాకు. నిద్రలేచి చూస్తినికదా, అక్కడలేడు. నే నింతవరకూ మళ్ళా అతన్ని చూడ లేదు.

ఐదునెలలు గడిచాయి. ఆ రాత్రి ఉదయశంకర్ డాన్సు చూసి మావారు పదింటికి ఇంటికి చేరుకున్నారు.

"ఎట్లావుంది?" అన్నాను అన్నం ఒడ్డిస్తూ.

ఏంచెప్పను ఇంద్రలోకం అంటూవుంటే అల్లావుండి వుంటుంది. నిన్నుకూడ తీసుకెళ్ళాల్సింది అబ్బ, ఏంజనంతొక్కిడనుకున్నావ్. ఆ 'సిమ్కీ' పొట్టిగా అచ్చుపార్వతిలా తయారయి, ఏం ఆడిపోయింది! నాకు నిజంగా వాళ్ళతో లేచిపోదా మనిపించింది. కాని నేను వాళ్ళ ట్రూపులోకి ఆఖరికి తబలావాయించేందుకేనా పనికిరాను... ఆవకాయ వద్దు... చాలు, చాలు.' నేను ఈ వర్ణనలనీ, బొమ్మల్ని చూసి వూహించుకుని ఆనంద పడాల్సిందే. ఏమీ మాట్లాడలేదు.

చెయ్యి కడుక్కుంటూ అన్నా రాయన "మరచిపోయ్యాను, మీ పద్మరాజుకూడా ఒచ్చాడు డాన్సుకి నాకు చాలా దూరంగా వున్నాడు. మధ్యలో నన్నుచూసి నవ్వాడు కూడా."

"ఢిల్లీనుంచి ఒచ్చాడన్నమాట." ఏదో అనకపోతే ఎట్లా మరి !

"ఏమో? మేం మాట్లాడుకోలేదు. అతనితో అతని భార్యకూడా వుంది. తెర దిగినప్పుడల్లా ఆ అమ్మాయిని చూడడమే సరిపోయింది, హాల్లో జనానికి."

"నిజంగానా? అంత బాగుందేం?

ఆయన నవ్వుకున్నారు.

  

ఈ విషయం నాకుకొత్తది. పద్మరాజు పెండ్లవుతుందన్న సంగతి నావూహకేతట్టలేదు. అంత అందమైన పెండ్లామని వినగానే నాకు ఈర్ష్య బదులు జాలి కలిగింది. పాపం! ఆ పిలకి ఏం తెలుసుంది? అతను ఆ అమాయకత్వాన్ని గోల్పోయి, అందరిలా వ్యవహర్తగా మారిపోయి వుంటాడు. ఆరోజులు మళ్ళా జ్ఞాపకానికొచ్చి బాధ కలిగించాయి. మా చిన్ననాటి దినాల్లో సూర్యోదయమే గొప్ప అదృష్టంలా తోచేది. తెల్లవారగానే ఎంతో ఉత్సాహం, తత్తరపాటు, సంతోషం. వానకురిస్తే కాగితపు పడవల్ని నీళ్ళల్లో ఒదిలి సప్తసముద్రాలలోకి నెట్టుకుని పొయ్యేదాన్ని. ఆ గాలి, ఆ చెట్లు దుమ్ము, ఆకాశం – అన్నీ మాకోసం నిర్మించబడినట్టుగా వుండేవి. ఆ ప్రకృతికీ మాకూ ఎంతో బాంధవ్యం. ప్రతివస్తువూ, ఎప్పుడో ఎరుగున్న దానిలా తోచేది. శరీరంలో శక్తులు కదిలి నాట్యంచేసేవి. ఈ లోకంలో సమస్యలు లేవు. మా ప్రయత్నం, ఆలోచనా లేకుండానే, మాకీ ప్రపంచరహస్యం అర్థమైంది ఆనాడు అదేమిటి? ఇంక నాకు తెలీదు.

మరిప్పుడో ? పెద్దదాయన్నయ్యాను. సూర్యోదయం కోసం ఆవులిస్తూ కాచుకోడంలేదు. గ్రహణంపట్టినప్పుడు తప్ప చంద్రుడిని చూడను. వేసంగి ఒచ్చిందంటే ఎంతో అవస్థ. చెమట. గజందారంలో మనిషి వునికిని సహించలేను. చిరాకు. ఆ వీపు పేలడం ఆ తడి తువ్వాళ్లు– నాకు భయమేస్తుంది. పద్మరాజుని తల్చుకుంటూనే నాముఖంలోకి వెనకటి చక్కదనం ఒస్తుందేమోనని అద్దంలో చూసుకుంటా. కడుపులో గాభరాగా వుంటుంది. ముఖం బండబారింది. పెదవులు సుకుమారాన్ని పోగొట్టుకున్నాయి. కంటికింద బెదరించే ముడతలు, తల్లో లెక్కలేనన్ని తెల్ల వెంట్రుకలు. ఇంతే జీవితం. ఆనాడు నేనూ అతనూ కలసి జీవించాం. ఈనాడు జీవితాన్ని ఆలోచిస్తూ, వితర్కరించుకుంటున్నా. అబ్బ, భయమేస్తుంది. నాకు జబ్బుచేసి మూలుగుతుంటే ఆయన వింటూ కూర్చోడం. ఈ కథలు, ఈర్ష్యలు, పోటీలు, పట్టుదలల్లు—పోను పోను, దారి సన్నపడి, ఆకాశం చీకటైపోతుంది. వెనుక తెలుసుకున్న రహస్యం మళ్ళా దొరకదు. ఆ రహస్యాన్ని ఎట్లా ఆనాడు తెలుసుకున్నా కూడా చెప్పలేను.

పద్మరాజు నన్ను మోసంచేసి, తనే ఆ రహస్యాన్ని దాచుకున్నా డని నా అనుమానం. చీకట్లోకూర్చుంటే ఎవరో ప్రక్కన నిలబడినట్లు తిరిగి చూస్తా. కనురెప్పలమీద పెద్దబరువు. వెలుగు, నా కళ్ళు భరించ లేవు. శాలువా కప్పేసుకుంటా, కాని ఇదంతా నా భ్రమ కావచ్చు. అతనుమట్టుకు నాలా మారి ఉండకూడదూ? గడ్డం బిరుసెక్కి, కంఠం బొంగురుపడి, అసహ్యామైన మీసాల ముక్కలు—టూత్ బ్రష్‌ని తారులో ముంచినట్లు – కుళ్ళుభావాలతో, తలనొప్పితో - అతను దేవలోకపు పురుషుడా? నావూహ నిర్మించిన మహారణ్యంలో దోవకనిపించచంలేదు. ఆనాటి రహస్యం తాలూకు వెలుగులు నాగుండెల్లో లేకపోలేదు. కాని అవి ఈ అనంతమైన చీకటిని వెలుగు చెయ్యలేవు. అదే నా దిగులు. ఇందులో రహస్యమైన సంతోషం, తృప్తి లేకపోలేదు.

* * *

నెల గడిచింది. ఆదివారం. మావారు పదింటికి బజార్నుంచి ఏవో తెచ్చి, నే అక్కడ లేననుకొని డ్రాయర్లో పెట్టారు. నేను వాట్ని గురించి ప్రశ్నించలేదు.

“మళ్ళా మీ పద్మరాజు కనిపించాడు” అన్నారు. నేను డ్రాయరు కేసి ప్రశ్నార్థకంగా చూశా.

“పరీక్ష ప్యాసయాట్ట రెండు నెల్లలో ఉద్యోగం ఆర్డరు వస్తుందట...”

“బాగుంది. అబ్బ, ఎంతవా డయ్యాడండి. పోనీలెండి పాపం, అదృష్టవంతుడు. పెళ్ళాంకూడా వుందా?”

“అప్పే; పుట్టింటికి పంపేశాట్ట”.

“ఇప్పు డింతకీ ఎక్కడుంటున్నాడు?”

“వై.ఎమ్.సి ఏ.లో సాయంత్రం ‘టీ’కి రమ్మన్నాను. తప్పకుండా వస్తానన్నాడు. నాలుగింటికే సిద్ధంచెయ్యాలి. ఇంకా ముగ్గుర్ని కూడా పిలిచాను. ఐస్‌క్రీమ్‌కి ఆర్డరిచ్చాను.

‘ఉప్మ’ ‘టీ’ నువ్వేచెయ్యాలి...ఆరుగంటలకి సినిమా ప్రోగ్రాం కూడా పెట్టాం. నువ్వూ రావాలి...

'నామాటకేంలెండి.'

*    *    *

మధ్యాహ్నం రెండుగంటలకే ఆయన నిద్రనుంచిలేచి కాఫీ త్రాగి ఎక్కడికో వెళ్ళిపోయ్యారు. మూడింటిదాకా నాకు వంటింట్లోనే సరిపోయింది. పావుగంటలో స్నానంచేసి కొత్తచీర కట్టుకొని, హాల్లోకి రాగానే నా దృష్టి డ్రాయరుమీద పడింది. లాగిచూశాను. అందులో కాగితంతో చుట్టిన అట్టపెట్టె ఉంది. విప్పి, పైకి తీసి చూశా. ఒకటి బెంగాల్ కెమికల్ వాళ్ళ "జుల్ఫీ" హెరాయిల్. నేను వెనక వాడిందే. గుప్‌మని వాసన కొడుతుంది. నాకంత ఇష్టంలేదు. రెండోది చిన్న ఆకుపచ్చరంగు పెట్టి. పైన పసుపురంగు లతలు చిత్రించి ఉన్నాయి. మధ్యలో "4711 టాస్కా" అని ఉంది. మూత తీస్తే అందులోది బొటనవ్రేలంత సైజుది సెంటుబుడ్డి. అది జర్మనీలో తయారైంది. పక్కన "హాసేగౌండర్" కంపెనీ బిల్లు కూడా ఉంది. సెంటు బుడ్డి ధర 38–00. అప్రయత్నంగా సీలుతీసి వాసనచూసి, చీరకి రాసుకున్నా. అది సంపెంగ, మంచిగంధం, గులాబీ కలిసిన వాసన. నాకు ఆనాటి పద్మరాజు ముఖంలోని పరిమళం జ్ఞాపకానికొచ్చింది. కొన్ని పరిమళాలు కొందరు వ్యక్తుల్నీ కొన్ని దృశ్యాల్నీ స్మరింపచేస్తాయి కాబోలు! హాల్లో కుర్చీలు, బల్లలు సిద్ధం చేశా. నే అల్లిన పువ్వుల గుడ్డని టేబిల్ మీద ఉంచి పూలతొట్టిని అమరుస్తూండగా, వీధిలో అడుగుల చప్పుడు, కంఠాలు వినిపించాయి. చప్పున లోపలికి వొచ్చాను. తలుపు సందులోంచి చూస్తూనే వున్నా— మావారు ఒక కళ్ళజోడు వ్యక్తిని "కమిన్ పద్మరాజు" అని కుర్చీలో కూలెయ్యడం.

నేను గదిలో కెళ్ళిపోయి మంచంమ్మీద దొర్లి లోపల నవ్వు ఆగక చీరకొంగుని నోట్లో కుక్కుకున్నాను. ఆ వచ్చినాయన పద్మరాజు కాడు. అసలెక్కడా ఆ పోలికే లేదు. ఇంతలో వారు లోపలికొచ్చారు.

'లే, లే, అన్నీ సిద్ధం చేశావా ? నువ్వు కూడా వోసారి కనబడు' అన్నారు. నాకింకా నవ్వు ఆగడంలేదు.

"ఎందుకు నవ్వు ?"

"ఈ రథాన్ని ఎక్కడనుంచి తోసుకొచ్చారు ? ఈయన పద్మరాజు కాడు."

"పేరు పద్మరాజే"

"ఆ పేరు గలవాళ్ళు ఎందరుండకూడదు ?"

"చంపేశావ్. ఇప్పుడొచ్చిన ప్రమాదంలేదు, కానీ మరో కొత్త స్నేహితుడు దొరికాడనుకుంటా" అని నవ్వుకొని బైట కెళ్ళిపొయ్యారు.

గంటదాకా వారి సంభాషణ వింటూనే ఉన్నాను, కళ్ళజోడు పద్మరాజు ఏదో ఆగ్రా తాజ్‌మహల్‌ను గురించి కబుర్లు చెబుతున్నాడు. ఐదుగంటలు దాటింది. అంతా సినిమాకని ప్రయాణమయ్యారు. మావారు హాల్లో డ్రాయరుతీసి చూడడం నే చూశాను. సెంటుబుడ్డికేసి చూసి "ఇదెవరబ్బా, విప్పింది...ఓహో నేనే తీసివుంటాను" అనుకుని, మళ్ళా అందులో పెట్టేసి వెళ్ళిపొయ్యారు.

సెంటుబుడ్డి విషయం చూస్తే ఆయనిమీద నాకు చాలా కోపం వొచ్చింది. ఆయన, అతన్ని నిజంగా పద్మరాజని నమ్మి నాతో చెబుతూ వచ్చారా, లేక నన్ను మోసం చేసి, అంతా కల్పించి బాధపెట్టాలని సంకల్పించారా, నాకు తెలిసింది కాదు. నన్ను మానసికంగా శిక్షించాలని ఆయన సంకల్పమే ఐతే, ఆయనే పొందారు విజయాన్ని. అయన్ని నమ్మాలో, నమ్మకూడదో ఎట్లా తెలుస్తుంది! పైగా పసిపిల్లాడిదగ్గర నుంచి ముసిలి తాతదాకా స్త్రీని నమ్మకూడదన్న ఘోషే కదా!

# ముగింపు మీకు తెలుసు

నేనూ ఆమె చిన్నప్పుడు ఒక కళాశాలలో చదువుకున్నాం. పదిహేనేళ్ళ తరువాత భర్తతో కాపరం చేస్తుండగా మళ్ళా ఆమెను చూడడం జరిగింది. చిన్నప్పటి స్నేహితులు, చదువు, కళాశాలలో ఉపాధ్యాయులు—ఇవన్నీ ముచ్చటించుకుంటూ, వార్షికోత్సవ సందర్భంలో తరగతి విద్యార్థులందరూ కలిసి తీయించుకున్న ఫోటో ఒకటి తీసి, అందులోని వ్యక్తులు ఎవరెవరు ఏంచేస్తున్నదీ, ఎక్కడెక్కడున్నదీ ఆరాలుతీసి స్మరించుకుంటున్నాం. మూలగా నిలబడ్డ ఓ వ్యక్తికేసి చూపించి, "పాపం మురళి ఎక్కడున్నాడో!" అన్నదామె. మురళెవరు ?" వెంటనే స్ఫురణకు రాలేదు. "పావలా ఫ్లూట్ మీద గానం చేస్తుండేవాడట హాస్టల్లో-తెలీదు ?" అని అందిచ్చింది. జ్ఞాపకం ఒచ్చింది. అతన్ని "బాల" అనేవాళ్ళం. వేణువాద్యమే కాకుండా, భావ గీతాలు కూడా వ్రాస్తుండేవాడు. "ఎక్కడున్నాడో ?"

"ఏమో, నాకూ తెలీదు. అతన్ని మళ్ళా ఎప్పుడూ కలుసుకోడం జరగలేదు" అన్నాను. అక్కడినుంచి ఒచ్చేసిం తర్వాత "బాలు"ని గురించిన కుతూహలం హెచ్చింది. "పాపం మురళి ఎక్కడున్నాడో ?" అన్నదామె. ఆ "పాపం" ఎందుకు ? "బాలు" ఇప్పుడెక్కడున్నదీ, ఏం చేస్తున్నదీ తెలుసుకోవాలని అన్వేషణ సాగించాను. ఎంద రెందరికో వ్రాశాను. ఆరాలు తీశాను. నా యత్నాలు ఫలించాయి. "బాలు"ను గురించి తెలుసుకున్నాను...

"ఎవరో నువ్వు చెప్పనక్కర్లేదు. నాకూ తెలుసు" అన్నాడు మిత్రుడు శాస్త్రి.

"చెప్పు చూద్దాం" అన్నాను.

ఫలానా అని చెప్పేశాడు శాస్త్రి. ఆశ్చర్యపడ్డాను. సత్యాన్వేష

కుడు సాధించే దారుణ ఫలితాలలో సత్యాన్ని తెలుసుకోడం ఒకటి కాబోలు ననుకున్నాను.

నిజంగా జరిగిన ఒక సంఘటన ఆధారంగా ఒక కథ వ్రాద్దామని సంకల్పించి, ఆ వృదంతం మిత్రుడు శాస్త్రికి చెప్పి చూశాను. కథ ముగింపు ఆశ్చర్యం గొల్పేదిగా వుండాలంటారు విమర్శకులు. ముగింపు యిట్టే చెప్పేశాడు శాస్త్రి. ఇంక నేను కథ వ్రాయడం దేనికి ?

ఆధునిక సాహిత్యం వింతమార్గాలు తొక్కి ఎందుకు విపరీతమైన ధోరణులు వ్యక్తం చేస్తోందో కొంచెం అర్థమవుతూంది. నూతనమైన వస్తువు దొరకదు. ప్రతి విషయం గురించీ, పెద్దలు యిదివరలో వ్రాసే వున్నారు. చేప్పేతీరులో, "శిల్పం"లో విశిష్టత కనపర్చాలి. ఈ కస రత్తంతా దీని ఫలితమేమో ననిపిస్తుంది. దీర్ఘ సమాసాసనం, కామాల వైక్లబ్యం, చుక్కల పందెం, బ్రాకెట్ల మేళవింపు, గద్యకవితల ముష్టియుద్ధం, వికృత ప్రయోగా లనబడే నిప్పుల చక్రాల గుండా దూకుళ్ళు—యివన్నీ ఆధునిక సాహిత్య తాలింఖానాలలోని కొన్ని వింతలు. మిత్రుడు శాస్త్రి కూడా నాతో ఏకీభవించాడు. అతన్ని గురించి వ్రాస్తూ 'హేమింగ్‌వే ప్రభావం ఈయిన మీద బాగా కనిపిస్తోందే' అన్నాడట వొక విమర్శకుడు. శాస్త్రి గోల. అతనెప్పుడూ, హెమింగ్ వే రచన వొక్కటి కూడా పూర్తిగా చదువలేదు. చదవలేదు మొర్రో అంటే నమ్మే వాళ్ళెవళ్ళంటారు. 'ఇందులో పాత్రలన్నీ కల్పితాలు' అంటాడు రచయిత. చాలా భాగం కల్పనా సాహిత్యంలో రసవత్తరమైనది. ముందు రచయిత చెప్పిన యీ వొక్క వాక్యమేమో ననిపిస్తుంది.

అంత మాత్రంచేత, భయపడిపోయి కథా రచన విరమించవల్సిందే! శాస్త్రి వొక రచయిత, విమర్శకుడు. రచనకు అతను ఆపాదించే విలువలు వేరు, సామాన్య పాఠకుడు కోరే ఆనందం వేరు. ముగింపు తెలిసిపోయినంత మాత్రాన కథ కుంటుపడు తుందనుకోనక్కర్లేదు. ఈనాడు అపరాధ పరిశోధక నవల చాలా ప్రచారంలోవుంది. పాశ్చాత్య

దేశాలలో దాసికున్న పలుబడి, ప్రచారం మరేయితర రకం రచనకీ లేవనొచ్చు. వీటిల్లో చాలా భాగం హంతకుడెవడో తెలుసుకోవడంలో పాఠకుడికి వినోదం, తాత్వికోల్లాసం సమకూరుస్తాయి. మరో రకం డిటెక్టివ్ నవలలో, హంతకు డెవడో మనకి ముందే తెలిసి పోతుంది. అసలు కథంతా హంతకుడే చెప్పేస్తాడు. కాని అతనట్లా ఎందుకు చెయ్యాల్సి వొచ్చింది – ఏ విధంగా చేశాడు — అతని మనస్తత్వము ఏ విధంగా అల్లా ఏర్పడింది – కారణాలు, అవకాశం, అవలంబించిన విధానం – వీటిని చర్చించడం, ఈ రకం నవల వుద్దేశం. వీటిపట్ల కుతూహలం పాఠకుడిలో ఎప్పుడూ వుంటుంది. పాఠకుడి యీ కుతూహలాన్ని తృప్తి పరచే వుద్దేశంతో ఈ రచన సాగించడంలో ఆక్షేపణ వుండదనుకుంటా.

ఆటవికశాఖ వారు జంతువులచర్మాలు వేలంపాడుతున్నారని తెలిసి మా వూళ్ళో చౌదరిగారు – వొక ధనికుడు – పులిచర్మాలు తీసుకు రమ్మని పంపితే ఆ వూరెళ్ళాను. ఆటవిక శాఖాధికారి నౌకరొచ్చి, వారి బంగళాకి తీసుకెళ్ళాడు. అధికారిగారి పేరుమూర్తి. స్నానం చేస్తున్నారు, అల్లా కుర్చీలో కూర్చోమన్నారు. గోడలకేసి చూస్తూ వరండాలో పచార్లు చేస్తున్నాను. గోడలన్నీ అడవి మృగాల తలలు – కొమ్ములు, కోరలు, చర్మాలు - అమర్చబడి వున్నాయి. ఆటవిక శాఖాధికారి కూడా కాస్తో కూస్తో భయంకరంగా వుంటాడని నా వూహ. నిజంగా మూర్తి అల్లాగే వున్నాడు. చూడగానే ఏ ఉత్తరదేశపాయనో అనుకున్నా. దగ్గర దగ్గరగా ఆరడుగుల ఎత్తు – అంత ఎత్తుగా వుంటే గాని ఆ శాఖలో ఉద్యోగం దొరకదు కాబోలు – కొంచెం నలుపు. నల్లగుడ్డు చుట్టూ తెలుపు 'జీర', రంధ్రాలు కనబడేట్లు వొంకర తిరిగిన ముక్కు. దట్టమైన కనుబొమలు, తాంబూలం వల్లో పొగాకు వల్లో అక్కడక్కడ దాగైన పళ్ళు, పై పెదవిని కప్పిన మీసం, చదరంగా కత్తిరించబడిన తెల్లవెంట్రుకలతో వైవిధ్యాన్ని తెచ్చుకున్న గడ్డం – అది ఆయన వైఖరి. రాగానే కరస్పర్శ

చేశాడు. నలిగిన వేళ్ళని సరిచేసుకుంటూ కూర్చున్నా. తొందర పనిమీద జీపులో వెళ్ళాలిట – వోగంటలో వొచ్చేస్తాను. ఈలోగా అసిస్టెంట్లు చర్మాలన్నీ తనిఖీ నిమిత్తమై ప్రదర్శిస్తారు, వాటిని చూస్తూ వుండమని చెప్పి, అమ్మగారితో టిఫిన్ విషయం చెప్పవలసిందిగా నౌకర్‌తో మాట్లాడాడు. అటూ యిటూ చూసి లోపలికెళ్ళి నౌక తోలు హంటర్ తీసుకొచ్చాడు.

'ఇది అడవి పంది చర్మం' అని హంటర్ చూపించాడు. 'మొన్ననే వేటాడాం,' ఏమనాలో తెలిసింది కాదు. హంటర్ తిప్పుకుంటూ జీపులో ఎక్కాడు. టూపిరాడక దగ్గినట్లుగా, జీపు నానా భీభత్సం చేసి నిష్క్రమించింది.

ముందుగదిలో బల్లమీద కొన్ని పత్రికలు కనిపించాయి. కాలక్షేపానికి ఏదేనా పత్రిక తీద్దామని లోపలి కెళ్ళాను. పత్రికలతోపాటు ఏవో కవర్లు కూడా వున్నాయి. వొకటి నే చదువుకున్న కళాశాల పాత విద్యార్థుల సమావేశానికి రావల్సిందిగా పంపిన ఆహ్వాన పత్రం. కవరు మీద శ్రీమతి సీతాదేవి అని వ్రాసి వుంది. సీతాదేవి ఎవరు ? మూర్తిగారి చెల్లెలా ? కూతురా ?

నౌకరు టిఫిన్ సరంజాం బల్ల మీద పెట్టిన చప్పుడైంది. వెనక్కి తిరిగాను. ఆమె కనబడింది. చటుక్కున ఆమె లోపలి కెళ్ళిపోయింది. ఆ వొక్క క్షణంలోనూ ఆమెను పూర్తిగా చూశాననేచెప్పాలి. మొహం అంతా ఆవరించే పెద్ద కళ్ళు. ఎండి ఆనందంతో విడిపోయిన దానిమ్మను స్ఫురింపచేసే పళ్ళు, పమిట కొంగుని పాయిలుగా స్ఫుటంగా విడదీసిన ఎత్తయిన వక్షస్థలం—స్త్రీ కాబట్టి—ఇన్నింటినీ క్షణికమైన దృష్టి ఇముడ్చుకుంది.

ఇంతట్లోకి 'అసిస్టెంట్' వొచ్చాడు. అతని వెనకాల మరో యిద్దరు నౌకర్లు చర్మాల కట్టలని పట్టుకొచ్చారు. అసిస్టెంటు పొట్టిగా వున్నాడు. కొనవూపిరితో అక్కడక్కడ అంటిపెట్టుకొని వున్న వెంట్రుకల మధ్య

నిగ నిగ మెరిసే బట్టతల—అటవీశాఖలో ఉద్యోగాలని గురించి నే అనుకున్నది తప్పని ప్రత్యక్షంగా ఋజువు చేస్తున్నాడీ వ్యక్తి. జింక, దుప్పి, సివంగి – వీట్ల చర్మాలు చూపిస్తున్నాడు. నాక్కావల్సింది పులి చర్మం. అవి దూరంగా వున్న కాంప్ షెడ్ లో వున్నాయట. తీసుకొస్తానని వెళ్ళాడు.

ఆమె మళ్ళా మధ్య గది కిటికీలోంచి చూసింది. నేను మళ్ళా ఆమె కేసి చూశాను. కళ్ళు అంత మరీ పెద్దవి కావు – పళ్ళు దానిమ్మని స్ఫురింపజేస్తున్నా అదింకా పచ్చిదానిమ్మే. ఆ చీర మరతలుపడే స్వభావం కలది గాని, రొమ్ములు మరీ అంత స్ఫుటమైనవీ, ఎత్తైనవీ కావు. ఈ సారి నా దృష్టిని ఎక్కువగా ఆకర్షించినది ఆమె ఎర్రటి పెదవులు. సంధ్యా సమయంలో పటమటాకాశంలో కమ్మిన నల్లమేఘాలని చీల్చిన కడసారి సూర్య కిరణంలా. గుమ్మంలో కొచ్చింది.

'చక్కెరైపోయింది. ఇక్కడ దొరకదు. బెల్లం కొంచెం వేశాను. మరి కొంచెం కావాలా ?'

పరాయి స్త్రీని పరీక్షగా చూడటం గూర్చి మనస్సు పీకుతున్నా, ఆమె నెక్కడో చూసినట్టుగా వుండడంవల్ల అల్లా చూసానేమో. ఆమె కూడా అందుకే అలా చూస్తోందేమో !

"మూర్తిగారు — మీకు —"

"మా వారే"

"వారు ఏ కాలేజీలో చదువు—"

నవ్వింది.

"నన్నింకా గుర్తుపట్టలేదా ?"

నేనూ నవ్వాను. ఇప్పుడు గుర్తుపట్టాను. ఆమెని సీతారామమ్మగా కళాశాలలో ఎరుగుదును. తాశీల్దారుగారమ్మాయి. పదునాలుగు, పదిహేనేండ్ల నాటి మాట. కళాశాల కల్లా ముగ్గురే విద్యార్థినులు; వొకామె క్రైస్తవ కన్య 'అన్నా'; మరొకామె 'జయంతి' – తండ్రి డాక్టరు;

వంగదేశస్థుడు. స్త్రీలు చదువుకోవాలనీ, వరుణ్ణి వారే ఎన్నుకోవాలనీ, కట్నాలూ అవీ యివ్వకూడదనీ, జిల్లా కలెక్టరుగారు వుపన్యాసాలిస్తూండేవాడట. ఆయన్ని తృప్తి పరచి, మెప్పు పొందడం కోసం తాశీల్దారు గారు సీతారామమ్మని కళాశాలలో సాహసం చేసి చేర్పించాడని ఆ రోజుల్లో వింతగా చెప్పుకునేవారు. అప్పుడు ఆమెకి పదిహేను పదహారేళ్ళుంటాయేమో. మాతో చదువుకున్నదే గాని నిజంగా ఆమెతో ఎప్పుడూ నేనింత వరకూ మాట్లాడలేదు — ఆమె కంఠం ఎట్లా వుంటుందో మాకు తెలీదు. తలొంచుకొని కూర్చొనేది. ఆమె అప్పుడెట్లా వుండేదీ నాకు జ్ఞాపకంలేదు సన్నగా వుండేది. సాధారణ ఛాయ. కను రెప్పలు తీర్చి దిద్దినట్లుగా, వొంపు తిరిగి, నీడలు పడుతున్నట్లుగా, అస్పష్టమైన వొక దృశ్యం మెదడులో మసలుతుంది — పొగమంచుతో నిండిన అద్దం లోంచి వర్షపు ధారలని చూసినట్లుగా. ఇప్పుడెంతో మారిపోయింది. కాలం కాఠిన్యాన్ని కవులంతా ఆడిపోశారంటే యిందుకే కాబోలు! యౌవ్వనంపై మమకారం కొద్దీ కండలు పెరిగి, సన్నటి శరీరాన్ని కప్పేసి కౌగిలించుకున్నాయి. అప్పుడే కళ్ళ కింద చర్మంపై గీతలు, మెరుపుల్లా మధ్య మధ్య తెల్ల వెంట్రుకలు — ఎర్రటి పెదవులను మినహాయించి నడివయస్సు స్థబ్దత ఆవహించేసింది.

'చాలా మారి పొయ్యాను కదూ' అందామె.

'నన్నెల్లా గుర్తుపట్టారు ?'

'పాత విద్యార్థుల సమావేశపు ఆహ్వానం నిన్ననే వొచ్చింది, సమావేశం జరిగిన వారానికి చేరింది ఈ ఆహ్వానం. పాత సామాను తిరగవేస్తూంటే కళాశాల పత్రిక కనబడింది. అందులో మన బృందం ఫోటో వుంది. మీరూ వున్నారు, తీసుకొస్తా నుండండి' అని లోపలి కెళ్ళిందామె.

ఈ పదిహేనేళ్ళ లోనూ ఆమెలో కలిగిన మార్పు చూసిం తర్వాత నేనెంత మారిపోయుంటానో తల్చుకుని కాసేపు దిగులుపడ్డాను. యౌవనం ఎప్పుడు అస్తమించి నడివయస్సు స్థబ్దత ఎప్పుడు మీదపడుతుందో ఎవరి

మటుకు వారికి తెలీదు. బ్రహ్మచర్యం అవలంబించి, శరీర శక్తుల్ని ఖర్చు చెయ్యకుండా శ్రద్ధపరచుకుంటే యౌవనం మరికొంత కాలం నిలబడుతుందా? నిలబడదు. పైపెచ్చు అల్లా చేస్తే మరికొన్ని మానసిక జాడ్యాలు కూడా సంక్రమిస్తా యంటున్నారు మనస్తత్వ శాస్త్రజ్ఞులు. శరీరం మోటుగా ప్రవర్తిస్తుంది — యౌవనంలో పేట్రేగుతుంది. నడి వయస్సులో నిదానిస్తుంది. వార్ధక్యంలో శుష్కిస్తుంది. సంస్కృతి, తపస్సు, ఆధ్యాత్మికాన్వేషణ — యివేవీ ఈ మార్పుని ఆపుచెయ్యలేవు. ఇది గమనించే కాబోలు మార్క్స్ మొదలైన మేధావులు ప్రపంచ చరిత్ర పునాదుల్ని మట్టిలోంచి పెల్లగించమంటున్నారు.

'ఇదిగో చూడండి' అని కళాశాల సంచికలో ఫోటో చూపింది. సంచికలో పుటలన్నీ తాకిడికి పొడుంగా రాలిపోతున్నాయి. ఆ ముగ్గురు విద్యార్థినులలో మధ్య నున్నది ఆమె. వెనకాల నిలబడ్డ వారిలో రెండో వాణ్ణి నేను.

'మీ రేమిటి — అంత, అల్లాగైపోయారు?'

నేను భయపడ్డట్టుగానే ఆ కాస్త ప్రశ్నా అడిగేసింది. కాని, 'అంత లావు' — లాంటి కటువైన పదాలు వాడకుండా కనికరించింది. నాలో మార్పు హర్షించ తగిందా కాదా అని అడుగుదా మనుకున్నాను. కాని ధైర్యం చాల్లేదు.

రంగనాథం ఏం చేస్తున్నాడో?

రంగనాథం ఇంగ్లీషులో ఫస్టు. కాలేజీ పత్రికకి సబ్ ఎడిటర్, బి. ఏ. ఆఖరేడు. మేం ఇంటర్ మొదటి సంవత్సరం.

'రంగనాథం గూడ్స్ గార్డ్‌గా పని చేస్తున్నాడు. ఆ మధ్య పెరంబూర్‌లో కనిపించాడు' అన్నాను. షేక్స్ పియర్ నాటకాలు బాగా చదివేవాడు. అతనంటే ఉపాధ్యాయులకి కూడా బెదురేనని చెప్పుకునేవారు. ఎక్కడ షేక్స్‌పియర్, ఎక్కడ గూడ్స్ గార్డ్!

'అన్నా, ఎక్కడుందో !'

'స్కూలు మాష్టరు.'

'జ్యోయ్ మొతిదేబీమాటో' అన్నా వంగభాషలో ఉచ్చరణ అనుకరిస్తూ.

'మెడిసన్ పూర్తి చేసి కలకత్తాలో డాక్టరుగా పని చేస్తోంది. అప్పుడే కళ్ళకి జోడు. ముగ్గురు సంతానం' అని ఆమె స్వేచ్ఛగా నవ్వేసింది. కళ్ళజోడుకి సంతానానికి ఏం సంబంధమో తెలీక కాబోలు !

'ఇతను గోపాలం కాదు—? తెలుగు మాస్టార్ని అల్లరి ప్రశ్నలతో విసిగించేవాడు'.

'మీ కింకా జ్ఞాపక ముందే. ఇప్పుడెక్క డున్నాదో తెలీదు' అన్నాను.

'సరే – యిది మీరు – పులి చర్మాల కోసం ప్రస్తుతం యిక్క డున్నారు' అని నవ్వడం సాగించింది.

'కూర్చున్న వారిలో మధ్యనున్నది ప్రిన్సిపాల్, ఆయన సతీమణి. రిటైరయి యిప్పుడు అమెరికాలో వున్నాడు. ఆ రోజులు స్మరించుకుంటూ కాబోలు ఆమె మౌనంలో పడింది. నేను టిఫిన్ పూర్తి చేశాను.

'చూశారా – నేనూ పాత విద్యార్థినే, ఆహ్వానము మటుకులేదు. స్త్రీల కెల్లాగైనా ...'

ఒక మతిమరుపు జడ్జిగారిలా వుంది నా ధోరణి. ఆయన భార్య ఏవో ప్రశ్న లడుగుతూ వుండేదట. వాటిల్లో ఏదో వొక దానికి సందర్భం లేకుండా నాలుగైదు రోజు లయ్యాక సమాధానం చెప్పేవాడుట. ఒకరోజు ఉదయం 'ఏమీ లేదు, పిల్లలే' అన్నాడుట. రెండు రోజుల క్రితం 'ఆ చప్పుడేమిటండీ ?' అని ఆమె అడిగిన ప్రశ్నకి సమాధానమని వారం తర్వాత ఆవిడకి స్ఫురించిందట.

నన్ను వాక్యం పూర్తి చెయ్యకుండానే సీతాదేవి అంది.

'మీకూ ఆహ్వానం వొచ్చే వుంటుంది. వెనకటి అడ్రసుకి పంపి

వుంటారు. అనేక అడ్రస్‌లు మారి నాకు చేరినట్లుగా మీకూ ఎక్కడికో వెళ్ళే వుంటుంది. అయినా మనం వెళ్ళడం జరుగదుగా.'

అది నిజమే. కాని ఆహ్వానం రాలేదంటే కొంచెం చిన్నతనంగా వుంటుంది.

'నా కొచ్చిన కవర్‌మీద అడ్రస్ చూశారా? మా వారిపేరు టి. కె. మూర్తి అనుంది. వి. కె. మూర్తి అనుండాలి. అందుకనే మావారి కది చూపలేదు. తప్పుపేరిట ఆహ్వానం అందుకోడంబదులు, అసలు రాక పోవడమే మెరుగనుకున్నా—పేరుగాని, ఇంటిపేరుగాని కవరుమీద, కార్డు మీద సరిగ్గా వుండకపోతే బాధగా వుంటుంది. డర్బీస్వీప్‌లో మనకో లక్ష రూపాయ లొచ్చిందన్న వార్త తెలియజేసే ఉత్తరమైనా పేరు సరిగ్గా లేకపోతే చిన్నబుచ్చుకోవడంమాత్రం తప్పదు.

నౌకర్‌తో టిఫిన్ సరంజాం తీసెయ్యమని సంజ్ఞ చేసింది. నేను లేవబోతుంటే, ఆ ఫొటోలో వెనక నిలబడ్డ వారిలో మూలగావున్న వ్యక్తి కేసి చూపించి 'పాపం, మురళి ఎక్కడున్నాడో?' అన్నదామె. మురళెవరు? వెంటనే స్ఫురణకురాలేదు. ప్రశ్నార్థకంగా మొహంచిట్లించాను. "పావలా ఫ్లూట్‌మీద గానంచేస్తుండేవాడట హాస్టల్లో-తెలీదూ?" అని అందిచ్చింది. జ్ఞాపకంవచ్చింది అతన్ని 'బాలు' అనేవాళ్ళు. బాల కృష్ణ, మరోతరగతి వాడవడంవల్ల మాతో కూర్చునేవాడు కాదు. మా అందరికీ వారానికోసారి ప్రిన్సిపాల్‌గారి పాఠం వుండేది. అప్పుడే కలుసు కునే వాళ్ళం. హాస్టల్లోకూడా వాళ్ళవి మేడమీద గదులు, మావి కింద. ఒక ముస్లిమ్ రోజూ హాస్టల్ ముందు ఫ్లూట్ వాయిస్తుండేవాడు. ఫ్లూట్ అమ్ముతుండేవాడు కూడా. 'బాలు' ఒక ఫ్లూట్‌కొని, ఎవళ్ళూ లేనప్పుడు ఏదో మూలగా వెళ్ళి వాయించుకుంటూవుండేవాడట. ఎంతవరకు అభ్య సించాడో, ఎల్లావాయించేవాడో నాకు తెలీదు. అతనికి ఎవళ్ళూ పెన్సిల్ మటుకు యిచ్చేవాళ్ళు కారు-దాన్ని నోట్లో పెట్టుకుని కొరకడమో, ఊదడమో చేసాడని భయంం అంటూ వేళాకోళం చెయ్యడం నాకు గుర్తు.

అతను తెలుగులో మంచి మార్కులు తెచ్చుకునేవాడు. సంస్కృతంకూడా చదువుకునేవాడు. మా తెలుగు పండితులకి అతనంటె చాలా ఇష్టం. కాని ఆ రోజుల్లో తెనుగుకి అంత పరపతి లేకపోవడంవల్ల యితన్ని వో ముఖ్యుడుగా ఎవరూ పరిగణించారనుకోను.

'ఎక్కడున్నాడో ఏమో నాకు తెలీదు. అతన్ని మళ్ళా ఎప్పుడూ కలుసుకోడం జరగలేదు' అన్నాను.

ఇంతలో అసిస్టెంట్ వచ్చాడు. పులి చర్మాలని ఇక్కడికి తేవడం కష్టం. టెంట్ దగ్గరకే ఒచ్చి చూచుకోమన్నాడు. సరేనని లేచాను.

"జాలస్యని, జేమ్స్‌ని తీసుకురమ్మనండి" అన్నది సీతాదేవి. అసిస్టెంట్ సరేనని వెళ్ళాడు. ఆవిడ బల్లమీద ఉత్తరాలు, పుస్తకాలు, పత్రికలు, సంచిక అన్నీ తీసుకుని లోపలి కెళ్ళింది. నౌకరు టేబిల్‌పై గుడ్డతీసి దులిపాడు. నేను కాస్త దూరంలో ఉన్న తేనెపట్టుని చూస్తూ కూర్చున్నా. పదినిమిషాల్లో మరోచీరకట్టుకుని ఆమెవచ్చి, 'రండి-ఇల్లు చూద్దురుగాని' అని ఆహ్వానించింది. అది తిరువనంతపురం చీర - వెడల్పు జరీ, పల్చగా, తెల్లగా, నాజూకుగా వుంది. ఉదారంగు జాకెట్టు కనిపిస్తోంది. పదిరాళ్ళతో పొదిగిన నెక్లెస్ మెడని చుట్టుకుంది. తెల్లరాళ్ళ దుద్దులు—మధ్య ఎర్రరాయి మెరుస్తోంది. ఆవిడ వేషధారణలో నైపుణ్యంగలదని తెలుస్తూనేవుంది. సరైనదుస్తులు, ఆభరణాలు, పోషణవల్ల నడివయస్సుని ఆమడదూరంలో వుంచినట్లుంది లోపలి కెళ్ళాం. గదుల్లో మృగాల తల కాయలు గురించి చెప్పింది. భర్త ధైర్యసాహసాలను ప్రస్తావించింది. నెల క్రితం ఒక్కడూ ఒక సివంగిని వేటాడాట్ట. ఇరువురికీ అన్యోన్యం కుదిరి నట్టు తెలుసుకున్నాను. భర్త సాహసకృత్యాలని చెప్పడంలో ఉద్దేశం లేక పోలేదు. తన వివాహానికి పూర్వం అతను చాలా పిరికివాడట. తనొచ్చిం తర్వాత, అతను మారిపోయి, అపూర్వమైన శక్తులను తెలివిని ప్రదర్శి స్తున్నాడుట. సీతాదేవి భర్తని ఘనకార్యాలు సాధించడానికి పురికొల్పింది. ఆమె ప్రేమ ప్రేరణవల్ల అతను తన్మయుడయ్యాడు. ఆదర్శం స్పష్టంగా

లేనంతవరకూ, మానవుడు ఆ ఆదర్శంకోసం ఎన్ని త్యాగాలన్నా చెయ్య డానికి సిద్ధపడతాడుకాబోలు. ఇంతకీ ఆమె ప్రేరణవల్ల అతను సాధించ దలిచిందేమిటి? నాకు తెలీదు. తోటలోకెళ్ళాం. రెండు జింకలూ, నెమలి వున్నాయి. పంజరాల్లో వింతవింత పక్షులున్నాయి. తల్లోంచిపడిన పువ్వుని ఆమె ఒంగితీసింది. ఒంగినప్పుడుపొట్ట మడతపడింది—మడతేమిటి, రెండు మడతలు జాలేసింది. ఆదర్శం స్పష్టంగా వుండక పోవడమే మంచి దేమో. నేనెల్లాగయ్యానో! మెడమీద గీతలు కనపడసాగాయి. ఆనాటినుండి అద్దం చూసుకోడం తగ్గింది.

సీతాదేవి వివాహం జరిగి ఎంతకాలమైందో? పిల్లలా? ఆమె వయస్సు దాదాపు ముప్ఫై - ఇల్లా అనుకుంటూ వుండగా ఆమె మాట్లాడం సాగిం చింది. "ఎవరి ప్రయత్నమూ లేకుండా అంతా అల్లా జరిగిపోయింది. అదో చిత్రమైన గాథ"

"చెప్పండి, వినాలనుంది."

"నేనూ, మా పినతల్లి, వంటాయనా కార్లో వెడుతున్నాం. పెద నాన్నకి జబ్బంటే చూడొద్దామని బైలుదేరాం. ఆయనెక్కడో మారుమూల కాంప్‌లో వుండగా పక్షవాతం ఒచ్చిందట. పక్షవాతం అంటే నాకు భయం. మా తండ్రిగారు దానివల్లనే కాలంచేశారు. ఐదేళ్ళయింది. కారు అడవిలోంచి పోతోంది. రాత్రి తొమ్మిదైందనుకుంటా. నట్టడివిలో టైరు చెడింది. స్పేర్ టైర్ ఆ సాయంత్రమే వేశాడు. ఏమిటి చెయ్యడం? కీకారణ్యం. అరణ్యం రోద. దూరంగా ఏవో అరుపులు. మా పిన్ని ప్రాణాలుగ్గబెట్టుకుంది. ఏంచెయ్యాలో ఎవ్వరికీ తెలియడంలేదు. వంటా యన కర్రా కలపా పోగుచేసి మంటచేశాడు. మంటకి ఏ జంతువూ రాదట. ఇంక రాత్రంతా ఆ అడవిలో గడపాల్సిందే! డ్రైవరు కొంత దూరంపెళ్ళి ఎవరన్నావుంటేపిలుకుతారని కేకవేశాడు. ఇంతలో పెద్దగాలి, వర్షం. మంట కాస్తా ఆరిపోయింది. అప్పుడు భగవంతుడల్లే మూర్తిగారు ప్రత్యక్ష మయ్యాడు. గడం అదీ చూసి చీకట్లో భయపడ్డాను. తరవాత

చెప్పారు. అడవుల్లో క్యాంప్‌చేస్తూ మనుషులతో సంపర్కం తగ్గి గడ్డం చేసుకునే అలవాటు విడిచిపెట్టారు. ఈ అడవిలోనే కాంప్‌చేస్తున్నాడట. దూరంగా కేకలు వినిపించాయట. మమ్మల్నందరినీ టెంట్‌లోకి చేరేశాడు. కాసేపటికి వాన వెల్సింది. మళ్ళా మంటలు చేశారు. స్టవ్‌మీద కాసినన్ని పాలుంటే కాచిచ్చాడు. పిన్ని తాగి పడుంది. అల్లా కల్సింది స్నేహం.'

నేను మిగతాది వూహించుకోగలను. అద్భుతమైన ప్రకృతి దృశ్యం, కొండలు, లోయలు, పెద్దఅడివి – దూరంగా ఎక్కడో అడివి జుట్టులో మధ్యపాపిటలాగ చిన్నకాలువ – అడివిదేవత బలుబుచేసి చీదినట్లుగా వర్షం, చీకటికి జడుసుకొని దూరంగా వెళ్ళి మెరవని తార కలు – ఈ ప్రకృతిలో వుండి పోదాం అనుకుంటూ వుండేవాడిని కాని, నిజంగా వుండలేను. ఒకక్షణం దర్శనమిచ్చి మానవహృదయానికి గగు ర్పాటు, సున్నితమైన ఆవేదన, తాత్కాలిక సౌందర్యానుభూతి కలిగించే టందుకే యీ ప్రకృతి భీభత్సదృశ్యం. "నువ్వు నాలోవాడివేస్మా" అని వొక్కసారి జ్ఞాపకంచేసే దూరపుచుట్టం ప్రకృతి – అది చచ్చిందో బ్రతికిందో ఎవరికీపట్టలేదు భయం, చీకటి, చలి, ఆకలి – శరీరానికి నిబ్బరం, వెలుగు, వెచ్చదనం, సంతృప్తి కావాలి శరీరం దగ్గరగా, యింకాదగ్గరగా జరిగింది. ఆకలి అనే జ్వాలలో ఆ శరీరాలు నిశ్శబ్దంగా పడ్డాయి. మంట చల్లారింది. తెల్లవారింది. వెలుగు, నిబ్బరం, కొత్తబలం, సంతృప్తి చెందిన శరీరపు వికాసం-ఇవన్నీ వివాహం అనే సంస్థలో అంతమొందాయి. ఆ అనుభవం రోజూ, అందరికీ ఏదో విధంగా లభ్య మయ్యేదే. కాని ఆ శరీరాలు, ఆ పరిస్థితులు, తిరిగిరావు. జ్ఞాపకంమాత్రం నిల్చిపోతుంది. చివరివరకూ అదే స్మరించుకుంటూ, అవే యివనుకుని, భ్రమతో జీవితయాత్ర సాగుతుంది.

ఆమె మళ్ళా మాట్లాడుతోంది.

"తరవాత తెల్సింది. ఆయన కాంప్‌చేస్తున్నారట. భోజనం సామగ్రి, అసిస్టెంట్లు, నౌకర్లు ఆ సాయంకాలానికి జీపులో చేరుకోవాలిట,

ఆ జీప్‌కూడా చెడిపోయిందట. వారెవ్వరూ రాలేదట. ఈయనొక్కరూ హడలిపోయి, ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకొని, ఎవరేనా మనిషి కనబడితే బాగుండునని దైవాన్ని ప్రార్థిస్తూ కూర్చున్నారుట. భగవంతుడులా మేం కనిపించామట. లేకపోతే భయంవల్ల ఆయన ప్రాణం విడిచేసి వుండురట" అని ఆమె నవ్వింది.

"ఇదంతా జరిగి ఎంతకాలమైంది ?"

"నాలుగు నెలలు"

అతనికి ముప్పైరెండు, ఆమెకి ముప్పైవొకటి – ఇంతవరకూ పెండ్లి ఎందుకు కాలేదో ? ఆదర్శాల అన్వేషణే ? ఒకాయన ఆదర్శ స్త్రీ కోసం వేచివున్నాడట. ఇరవై యేళ్ళకి దొరికిందట. తను ఆదర్శపురుషుడి కోసం అన్వేషణ సాగిస్తున్నానందట ఆమె. మధ్య నా కెందు కివన్నీ ? అడిగేటందుకు నేనెవర్ని ?

ఇంతలో అసిస్టెంటొచ్చాడు. జేమ్సు తలకి పట్టీ వేసుకున్నాడట. అక్కడికే వెళ్ళి చూడడం తప్పదన్నాడు. బైలుదేరాను. పావుగంటలో అక్కడికే వచ్చాడు మూర్తిగారు. వేలంలో పాడే అవసరం లేకుండానే కొంచెం తక్కువధరకి చర్మం నాకు లభింపచేశాడు. నేను సెలవు తీసుకుని వెడతానన్నాను.

"భోజనం చెయ్యరూ ?" అన్నాడు.

"వెడతాను, చౌదరిగారు కనిపెట్టుకొని వుంటారు నాకోసం" అన్నాను.

"ఏదేనా పుచ్చుకుని వెడుదురుగాన్లెండి" అన్నారాయన. ఇద్దరం బంగళా కెళ్ళాం. పళ్ళు, నిమ్మరసంతో డ్రింక్ తెచ్చింది సీతాదేవి. ఏదో మాట్లాడటంకోసం అన్నాను. "ఈ ప్రాంతంలో అడివిపందులు ఎక్కువంటారా ?"

"ఎక్కువే. పెద్దపులులు లేవు ఎప్పుడేనా చిరతపులి రోడ్డుకడ్డంగా పరుగునివుంటుంది. మీరు తీసుకెళుతున్న పులి చర్మం ఉత్తర హిందూ

స్థానంనుంచి వొచ్చినది. కల్నల్ అండర్సన్ పేరు విన్నారా ? ఆయన వేటాడిన పులి చర్మంట పీ కిచ్చినది. టానింగ్ పరికరాలు మంచివి రాలేదు. బాగా టాన్‌చేస్తే యీ పందిచర్మం చాలా ఆకర్షణీయంగా వుంటుంది."

"ఉండండి" అని గదిలోకెళ్ళి బల్లమీదవున్న నాలుగైదు హంటర్లలో వొకటి తీసుకొచ్చి నాకిచ్చాడు.

"ఇది ఉంచుకోండి—జ్ఞాపకార్థం."

నేను తీసుకుని "థ్యాంక్" చేసి దాన్ని పరకాయించి చూశాను. రెండడుగులు పొడుగుంటుంది-అంత బరువూలేదు. చుట్టూ నల్లచర్మంతో కప్పివుంది. చివరలో పట్టుకునేందుకు తోలుపటకా ఒకటుంది. ఊరికే అలంకారానికి, చేత్తో తిప్పుకునేటందుకూ ఆర్మీ ఉద్యోగుల హస్తభూషణం అది. తోలుగొళ్ళెం కాస్త చిరిగింది. చివరలో రెండుమూడు పసుపుపచ్చ డాగులున్నాయి చర్మంపైన. ఆయన లోపలికెళ్ళాడు. నేను గదిలో బల్ల దగ్గరకెళ్ళి, మిగిలిన నాలుగు హంటర్లనీ చూసి, వాటిలో డాగులూ, చిరుగులూ లేని మధ్యనున్న మంచి హంటర్ని ఏరి, నా చేతిలోది అక్కడ పెట్టేసి బైటకొచ్చాను. జ్ఞాపకార్థం తీసుకెడుతున్న బహుమతి కొంచెం కొత్తదిగా ఉండడమే మంచిదనుకున్నా. అన్ని హంటర్లూవొకటే — ఏ హంటరైతే నేం? కాని నే కొత్తగా ఏరుకున్న హంటర్ మరీ తేలికగా కనపడింది-కాస్తంత సన్నంగాకూడా వుందేమో. మరీ మంచిది. ఇంతలో మూర్తిగారు పైకం ముట్టినట్లుగా సంతకంపెట్టి రసీదిచ్చాడు. "ఈ ప్రాంతంకేసి వొచ్చినప్పుడు యిక్కడికి రాకుండా వెళ్ళకండేం?" అంది సీతాదేవి. "ఓ తప్పకుండా" అని ఉభయుల దగ్గరా శెలవుతీసుకొని వొచ్చేశాను.

ప్రయాణంలో తోవపొడుగునా — అసలు అంతకి ముందునుంచీ కూడా—ఆమె "పాపం, మురళి" అని ఎందుకన్నదా అని వితర్కించు

కుంటూనే ఉన్నా. "పాపం" ఏమిటి? అర్థంలేనిముక్క. అతన్ని గురించి ఆమె కేం తెలుసు ? "పాపం" అనగలిగేటంత తెలుసు అదేమిటి ? "పాపం" అనేది పేచీలతో కూడుకున్నమాట. దాని కెన్నో అర్థాలున్నాయి ఉచ్ఛరించిన విధంబట్టి, ఆ అర్థాలు మారుతూంటాయి. 'పాపాలు చెయ్యడం' అనడానికి "పాపం చెయ్యడం" అనడానికీ తేడావుంది. కొన్ని వాక్యాలు చూడండి 'పాపం పండింది' 'పాపాలు పెరిగి పోతున్నాయి' "పాపిష్టి బ్రతుకు" "పాపాలకల్లా భైరవుడు" పాపం మంచివాడు. "ఏం పాపం!" "మరే పాపం" "పాపానికి పశ్చాత్తాపం లేదు.

వీటిని గురించి ఆలోచిస్తే స్థూలంగా రెండురకాల అర్థాలు కనబడతాయి. నైతికంగా ఖండించదగిన చెడ్డపని అన్నది వొకటి. లౌకిక దృష్ట్యా సానుభూతి అన్నది రెండోది. "పాపం మంచివాడు" అనడంలో జాలి ప్రకటితమవుతుంది - లౌకికదృష్ట్యా ఆ మంచితనాన్ని కాస్త హేళన చెయ్యడమూ ఉంది. సీతాదేవి వాడిన "పాపం"లో జాలిపడటం వుంది. అతని మంచితనాన్ని కాస్తంత వెక్కిరించడమూ వుంది. మంచివాడు స్త్రీని ఆకర్షించడేమో! మంచివాడు తనకోసం చేసిన త్యాగాన్ని స్త్రీ క్షమించదేమో! సీతాదేవి అతన్ని క్షమించింది. "పాపం మురళి" అని అప్రయత్నంగా అనేసి తన ఆధిక్యతని (నైతికంగానా?) స్థిరపరచుకుందా? అతనేం చేశాడు? అసలేం జరిగింది? ఇల్లాంటివి ఎన్నో ప్రశ్నలు ఎదురైనాయి. నా కుతూహలం రేకెత్తింది. అతన్ని గురించిన వివరాలు సేకరించాలని అన్వేషణ సాగించాను.

చదువుకునే రోజుల్లో గోపాలం, నేనూ హాస్టల్లో ఒక గదిలో వుండేవాళ్ళం. శెలవలకి యింటి కెళ్ళినప్పుడు పెద్దపెద్ద ఉత్తరాలు వ్రాసుకునేవాళ్ళం. అదృష్టవశాత్తు ఎగ్జిబిషన్‌లో అతన్ని కలుసుకోడం జరిగింది. వ్యవసాయశాఖలో పనిచేస్తున్నాట్ట వాళ్ళస్టాల్‌తో కూడా నలుగురికీ వివరించి చెప్పేటందుకు అతన్ని పంపారుట. అతనే నన్ను గుర్తుపట్టాడు. "బాలు" గురించి ఎత్తాను.

"నీ దగ్గర కాలేజీ మేగజీన్ లేదా ?" అన్నాడు.

"లేదు."

"ఎక్కడైనా దొరికితే చూడు. అందులో అతని భావ గీతాలు కూడా పడ్డాయి.

"ప్రేమ గీతాలా ?"

"ఏమో నాకేం గుర్తులేదు. సాధారణంగా ఆ వయస్సులో యువకు లందరూ వెళ్ళబోసుకునే శృంగార జాడ్యం" అన్నాడు.

"ఫ్లూట్ వాయించేవాడట."

"చెప్పుకునేవారు. నేనూ వినలేదు. ఐనా అతని గొడవ నీ కెందుకు ?"

పెద్దయింతర్వాత బాల్య స్నేహితులు ఎల్లా తయారయ్యారా అని తెలుసుకోవాలన్న కుతూహలం" అన్నాను.

"అతన్ని ఆచారి బాగా ఎరుగును" అన్నాడు.

"రంగాచారా ? ఎక్కడున్నాడు ?"

"ఈ వూళ్ళో. పవర్‌హౌస్‌లో పనిచేస్తున్నాడు. ఏడాదైంది యిక్కడికి ట్రాన్స్‌ఫరై."

నా కాశ్చర్యం వేసింది. దగ్గరకొచ్చినకొద్దీ దూరమైపోతాం అన్న ఇంగ్లీషు పద్యంలో పాదం స్ఫురణకొచ్చింది. ఆచారిని కలుసుకున్నా, అవీ యివీ మాట్లాడుకున్న తర్వాత "బాలు" విషయం అడిగాను.

"పేరు ?"

"బాలు—

"కృష్ణయ్య! "బాలు" అనడం నే నెరగను. కృష్ణయ్యగానే ఎరుగుదును. కథలు అవీ వ్రాస్తూండేవాడు. కాలేజీ మేగజీన్‌లో అతని కథ ఒకటి పడింది" అన్నాడు.

"ఆ, అతనే. ఇప్పుడేం చేస్తున్నాడు ?" అని అడిగాను.

"ఆ కథపేరు 'రంభ'"

'అతనే, ఏం చేస్తున్నాడు ?"

"రంభతో సరసాలాడుతున్నాడు" అన్నాడు.

"అదేమిటి ?"

"రెండేళ్ళ క్రితం టి. బి. వచ్చి పొయ్యాడు."

నాకు విచారం వేసింది. 'పాపం మురళీ' అనుకున్నాను. టి. బి. వచ్చి చనిపోలేదు. ఏ స్త్రీనో ప్రేమించి, విఫలుడై ఆత్మహత్య చేసుకొన్నాడు—అనుకుంటే మనస్సుకి శాంతి.

నా కథ ముగిసింది. నే చెప్పినకట్టం విని శాస్త్రి చేసినవ్యాఖ్యానం తప్పని తేలిపోయింది. అపరాధ పరిశోధక నవల చదివి, హంతకు డెవడో పాటకుడు పోల్చుకోలేకపోతాడు. తన కియ్యబడిన విషయాలను పురస్కరించుకొని ఫలానా అని నిర్ణయిస్తాడు, చివరపుట చూడగానే. అతను కాడు. మరొకడని తేలిపోతుంది. రచయిత విజయం సాధిస్తాడు. నేనూ శాస్త్రిపైన విజయం సాధించాను.

ఈ విషయం సీతాదేవికి జాబుద్వారా తెలియచేస్తే ? ఉత్తరం ఖర్చు చూస్తే ప్రమాదం ఏమన్నావుంటుందా ? ఆలోచన తెమలక సాయంత్రం సినిమాకెళ్ళాను. విశ్రాంతి సమయంలో సోడా తాగుదామని బైటకొచ్చాను. ఎవరో భుజం చరిచారు. వెనక్కి తిరిగాను. గుర్నాథం. గుర్నాథంది బట్టతలైపోయింది. పాంటులో చొక్కా అమరికగా ఉండడం లేదు. కాసేపు ఉగ్గపెడితే తోపలి కెళ్ళినట్లుగా వున్నా, లాగూలు విసర్జించి పంచకట్టుపై పటకావేసి బిగించేసమయం వచ్చిందనుకున్నా. అతనికి నలుగురు పిల్లలుట. ప్రపంచం ఎలా కదలిపోతూంది! జీవితం ఎల్లా పెరిగిపోతూంది! ఆ శృంగారం ఆ కలలు, ఆ ఆదర్శాలు, భావగీతాలు ప్రపంచాన్ని పెంచడానికేనా? సృష్టిని ఆపడం ఎవ్వరితరం ?

'పాపం బాలకృష్ణ, టి. బి. తో చనిపొయ్యాడుటగా ? అన్నాను.

'ఎవడా అన్నదీ? చనిపోయినవాళ్ళ కుటుంబానికి ఇన్సూరెన్సు డబ్బుని కంపెనీ వారిచే కక్కిస్తున్నాడు" అన్నాడు గుర్నాథం.

"అంటే"

"నాలుగేళ్ళ క్రితం హైదరాబాద్‌లో కలుసుకున్నాను. ఇన్సూరెన్సు కంపెనీలో పనిచేస్తున్నాడు. టి. బి. తో చనిపోయింది కృష్ణయ్యచౌదరని

బి. ఏ. మొదటేడు. కథలు వ్రాస్తుండేవాడు. మన బాలు — బాలకృష్ణ — వాడికేం హాయిగా ఉన్నాడు."

"పెండ్లయిందా ?"

'అవకుండా వుంటుందా ? ఆ విషయం నే నడగలేదు సుమా. ఆ రోజుల్లో జాయ్‌మతిదేవిని దూరంగా ఆరాధించే భక్తులలో అతనొకడు. భావగీతాలు వ్రాసేవాడు — అంతా రవీంద్రుడు, ఊర్వశి, శాంతినికేతనం — ధోరణి. ఆమె వంగకన్యగా — అందుకు. ఆవిడకి ఫ్లూట్ అంటే యిష్టంట. ఇంటి దగ్గర పాపయ్యశాస్త్రి ఫ్లూట్ నేర్పేవాడట. మనవాడు కూడా షేక్ మీరాసాహెబ్ దగ్గర వో పావలా ఫ్లూట్ కొని ఊదేవాడు. బుస్‌బుస్‌మని చప్పుడేగాని సంగీతంలేదు. నాతో చెప్పుకొని యిదయ్యే వాడులే. ఓసారేం జరిగిందో తెలుసా ?'

"చెప్పు"

పెట్టిలోంచి వో సంచీ పెళ్లగించాడు. అందులోంచి వో ఎముక ముక్క చూపించాడు. నే జడుసుకున్నా. "ఇది మా అమ్మది" అన్నాడు. వాళ్ళమ్మ చనిపోయిందిట. దహనం జరిగిన మొర్నాడు అస్తికలన్నీ ఏరిం తర్వాత అందులో ఒక దాన్ని దాచేశాడుట. "ఈ ఎముకలో నే నొక భాగం — చిత్రంగా వుండదూ!" అన్నాడు.

"నాకిదంతా మార్బిడ్"

"అసహజంగావుందందూ చంపక. వో రకంగా సెంటి మెంటల్..."

"చపలుడందూచంపక" అన్నాను. ఇద్దరం నవ్వుకున్నాం.

"మరోసారి మరో తమాషా" అన్నాడు గుర్నాథం.

"చెప్పు."

"శెలవలిచ్చారు. ఇళ్ళకి పోతున్నాం. గదిలో ఎవ్వరూలేరు. పర్సు లోంచి ఓ పొడుగుపాటివెంట్రుక తీశాడు. 'ఇదెవరిదో తెలుసా?' అన్నాడు 'మీ అమ్మదా?' అన్నాను. 'కాదు జయమతిది' అన్నాడు. "నీ కెట్లా వచ్చింది?" "ఎవరతోనూ చెప్పకు. అప్పుడప్పుడు నానోట్సు ఆమె తీసు కుంటూ వుండేది. మొన్న బుక్కు తిరిగిచ్చేసింది. పుటలమధ్యలో

యిదుంది." "కావాలని పెట్టిందంటావా?" "అనుకుంటే ఎంత ఆనందం!" అన్నాడు. తీరాచేసి ఇన్సూరెన్స్ ఏజంటుగా తయారయ్యాడు.

ఇన్సూరెన్స్ వృత్తిని ఎందుకు చులకన చెయ్యాలో నాకు తెలీదు. అతను పనిచేస్తున్న ఇన్సూరెన్స్ కంపెనీ పేరు తెలుసుకొని యింటికి వచ్చేశాను. తొందరపడి సీతాదేవికి ఉత్తరం వ్రాయనందుకు సంతోషించాను. మనం చెయ్యని పనులవల్ల ప్రపంచాని కెంతటి ఉపకారం జరుగుతోందో తెలుసుకుంటే, నిరుద్యోగులు బాధతో కుమిలి హతమవరు.

ఆమొర్నాడే ఇన్సూరెన్స్ అర్గనైజరు సత్యనారాయణ్ణి కలుసుకుని ప్రస్తావించాను.

"ఇప్పు డాయన మా కంపెనీలో పనిచెయ్యడంలేదు. అప్పుడే ఇది వొదిలేసి నాలుగేండ్లయింది. అడవిమృగాలని పెంచుకునేవారికి - సర్కస్‌లు నడిపేవారికి - జంతువుల ఇన్సూరెన్స్ పథకాన్ని వొకదాన్ని తయారుచేశాట్ట! ఆ వ్యాసం పెద్దలని ఆకర్షించిందట. షికాగోపత్రికకూడ దాన్ని ప్రచురించిందట. వెంటనే అతనికి అటవికశాఖలో పెద్ద ఉద్యోగం లభించింది" అన్నాడు సత్యనారాయణ.

"ఇప్పుడెక్కడున్నాడు ?"

"మీ చౌదరిగారు ఇన్సూర్ చెయ్యమని పులిచర్మం తెచ్చాడు. అది ఆయనదగ్గర కొన్నదే. మీరేవెళ్ళి తెచ్చారుటగా.

నేను స్తంభించిపోయాను. నేను నమ్మను. నాటకంలో వేషం అన్నట్లు, ఇందులో ఏదో మోసం వుంది. నాకు నిదర్శనం కావాలి-అనుకుంటూ ఇంటికి వెళ్ళగానే మూర్తిగారి నౌకరు జాలయ్య ఓ చీటీ తెచ్చాడు. తీసి చూశాను.

"మీతో తీసుకెళ్ళిన హంటర్‌ని దయతో ఇతనిద్వారా పంపండి. మీకు మరో హంటర్ పంపుతున్నాను" అనుంది. జాలయ్య ఆ క్రొత్త హంటర్ చేతికిచ్చాడు. దాన్ని లోపలికి తీసికెళ్ళి పరీక్షగా చూశాను. రెండూ ఇంచుమించు ఒకటే. ఇదే ఎందుకు కావాలన్నాడు? నిదానంగా చూశాను. నాతో తెచ్చిన హంటర్‌మీద రెండు మూడు గుండ్రని గతుకులు మినహా-చాలా కొత్తగా వుంది. తేలికగా వుంది. కాస్తంత సన్నంగా

వుంది. తోలుగొట్కొందగ్గర చాకుతో కోసి చర్మం తొడుగు పూడదీశాను. లోపల వున్నది ఫ్లూట్. నాలుగు కంతలున్నాయి. ఆ కంతల్లో ఒక పొడుగాటి వెండ్రుక చుట్టబడివుంది. తొందరగా దాన్ని తొడుగులో వుంచేసి జిగురుతో గొళ్ళొందగ్గర అతికించి, దాన్ని జాలయ్యకిచ్చి పంపించి వేశాను.

నా సందేహం తీరింది. అతని పూర్తిపేరు వి. బాలకృష్ణమూర్తి. చదువుకునే రోజుల్లో ఆ "మూర్తి" తీసేశాడు. ఉద్యోగంలో కొచ్చిం తరువాత వి. కె. మూర్తి అని పెట్టుకొని ఆ "బాల"ని వదిలేశాడు. గడ్డం పెంచేసి ఆ వెనకటి శరీరాన్ని కప్పేశాడు. గతాన్ని విస్మరించాడు. అతని స్వప్నాలు, ఆదర్శాలు, ఆశలు గతంలో నశింపయ్యాయి. ఆమె కనుక్కో తీరుతుందన్న సంగతులను ఇతరులు ఆమెకి చెప్పేముందు, భర్త భార్యకి చెప్పెయ్యడం మంచిదని అతనికి తెలీదుపాపం!

గతాన్ని పూర్తిగావదల్లేదతను. దానిపై రోత-కోరినట్లుగా అతను తయారవలేదు. అతనికి కావల్సినవి లభ్యమవలేదు. అయితే అదే యదార్థం. అందులోనే అతని నిజస్వరూపం. ఆ జీవితానికి కట్టిపడవేసిన వెండ్రుక కావాలి. ఆ కంఠాన్ని వినే కంతలవాయిద్యం కావాలి. లభించిన దాన్ని అదిగా వూహించుకుని బాధపడి, బాధపడి, బాధలో తృప్తిపడి, తృప్తిలో అసంతృప్తిని రహస్యంగా పీకచుట్టూ వురేసుకుని -ప్రస్తుతాన్ని గతంలో పూడ్చేసి, గతాన్ని భవిష్యత్తుచితిపై పేర్చి-ఏమిటో ఈ వికృతమైన, అసహజమైన ఆలోచనలు తెలుసుకున్న సత్యం-కల్పితగాథకంటె యథార్థగాథ మహత్తరమైన ఆశ్చర్యాన్ని కలగచేస్తుందన్న నిర్వచనాన్ని ఋజువు చేస్తుందని తృప్తిపడకూడదా? ప్రస్తుతంతో సమాధానపడకూడదూ ? విపరీత వ్యాఖ్యానాలుచేసి విసిగించకుండా ముగింపు మొదట్లోనే తెలిసిపోయిన ఈ కథ ముగించకూడదూ ? ముగిం పేమిటో చెప్పివేసిన శాస్త్రి మరీ ఎక్కువ తెలిసున్న వాడవడంవల్ల అసలు రచనకే పూనుకో లేకపోతున్నాడనుకుని అట్లా చేసినందుకు అతనిపై నాకున్న కసిని ఈ కథద్వారా పాఠకుడితో పంచుకున్నా కదా అన్న తృప్తిలో నిలిపివేసాను.

# అబద్ధాలు

'సాయంత్రం బండికి వూరెడుతున్నా' అన్నాడు రాజారావు.

"ఏ వూరు ?" అనడిగింది, ఆయన భార్య సునీత.

"ఇంకేవూరు ? ఏటేటా ఏ ఊరెడుతున్నానో ఆ ఊరే-ఏముంది, పరీక్షలు-ఆ తంతు జరిపే భారం నామీదే తగులడుతుందిగా" అని కాస్తంత విసుగ్గా అన్నాడు.

"ఎలాగబ్బా-నాకు తోచదు.' మళ్ళా చప్పునొచ్చెయ్యండి!"

"రాక అక్కడ చేసేదేముంది ?"

సాయంత్రం బండికి ప్రయాణమయ్యాడు రాజారావు. ఆ ఊరు చేరుకునేటప్పటికి పదిగంటలైంది. తిన్నగా జట్కా బండిని జైళ్ళ సూపరింటెండెంటుగారి బంగళాకి పట్టించమన్నాడు. బండి దిగగానే గేటులో ఇద్దరు పోలీసులు అటకాయించారు. తను ఫలానా, ఫలానావారి కోసం వొచ్చానన్నాడు. లోపలికి తీసుకెళ్ళారు.

జైలు సూపరింటెండెంటు—నీలకంఠంగారు దీపం వెలుగులో ఏదో రాస్తూ కూర్చున్నాడు.

వరండాలోకి వెళ్ళగానే లేచి మందహాసంచేసి ఆహ్వానించాడు. పెట్టె, బెడ్డింగు ముందు గదిలో పెట్టించాడు. భోజనం సిద్ధం చెయ్యమని వంటాయనకి పురమాయించాడు.

"మీరు రావడం చాలా సంతోషం. పరీక్షల రోజులు, రావడం పడదేమో అనుకున్నాం నేనూ సుమిత్ర."

"చూచి చాలా సంవత్సరాలైంది. ఓసారి చూచిపోదామని ఎలాగో తీరికచేసుకొని వొచ్చిపడ్డాను" అన్నాడు రాజారావు. కాసేపు ఎవ్వరూ మాటాడలేదు. రెక్కల పురుగులు లాంతరుమీదపడి రోదిస్తున్నాయి.

"సుమిత్ర ఎప్పుడూ మీమాట చెబుతూంటుంది" అన్నాడు నీలకంఠం.

"ఏరీ, ఆమె కనిపించరేం ?"

నీలకంఠం బిగ్గరగా నవ్వితేగాని నవ్వినట్లు గ్రహించడం కష్టం. మీసాలు దట్టంగా మూతిని కమ్ముకున్నాయి.

"క్షమాపణ చెప్పమంది-వాళ్ళ తమ్ముడికి పెండ్లి సంబంధం వొచ్చిందట. పిల్లని చూడ్డానికి ప్రొద్దున్నే వెళ్ళింది."

"అలాగా-"

మళ్ళా నిశ్శబ్దం.

"మిసెస్ రాజన్‌ను కూడా తీసుకురాలేకపోయ్యారా ?" అని అడిగాడు నీలకంఠం.

"మీరు మరచిపోయ్యారేమో! నా పేరు రాజారావు, మా ప్రిన్స్పాల్ రాజన్."

"అవునవును, అన్నట్టు రాజన్ ప్రిన్స్పాల్. ఏమిటో ఈ రెండు పేర్లు ఎప్పుడూ-కలిపేస్తూవుంటాను. నే నాయన్ని ఎరగనను కోండి. మా సుమిత్ర ఆయన దగ్గర చదువుకుంది. అవునవును-రాజారావు—మా సుమిత్ర మీ విషయం తరచు చెబుతూంటుంది."

"అవును, ఆమే నేనూ ఇంటర్ ఒకే కాలేజీలో చదివాం. ఆవిడ నోట్సు లేకుంటే నేను ప్యాసయ్యేవాడినే కాదు" అన్నాడు రాజారావు.

"ఏం చదువులు ? ఇంటర్ ఇంతవరకూ ప్యాసవనే లేదు. పరీక్షకి కట్టమంటే వినిపించుకోదు. తరవాత మాట్లాడుకుందాం. భోజనము కానివ్వండి..." లాంతరు టప్‌మని ఆరిపోయింది.

రాజారావు భోజనానికి వెళ్ళాడు. అతనికి నవ్వొచ్చింది. రాజన్‌కి పంపిన ఆహ్వానం పోస్టుమాను తనకిచ్చాడు. సుమిత్రా తనూ కలిసి చదువుకున్నారు. సుమిత్ర వివాహానికి తను వెళ్ళాడు. ఇంకా జ్ఞాపకం ఉంచుకొని తనను ఆహ్వానించిందనుకుని ఎంతో సంతోషించాడు. ఇప్పుడా సంతోషానికి ఆస్కారం లేదు. పాపం నీలకంఠం చమత్కారంగా మాట తప్పించి సర్దేశాడు. రాజారావుకి చిన్నతనంగా

ఉంది. ఆ రాత్రి ఎల్లాగో గడిపి, ప్రొద్దున బండికి బిచాణా ఎత్తేద్దామను కున్నాడు.

భోజనంచేసి వరండాలో కొచ్చాడు.

"ఉదయం మాట్లాడుకుందాం. అల్లా ఆ గదిలో పడుకోండి— ప్రయాణం బడలిక ఉంటుందిగా మరి. నేను ఈ ఆఫీసు కాగితాలు చూచుకుంటూ వుంటాను" అన్నాడు నీలకంఠం.

బ్రతుకు జీవుడా అనుకుని, రాజారావు వరండాలో పచార్లు సాగించాడు. హాల్లో దీపం తన గది కిటికీలోంచి కళ్ళల్లోకి పొడుస్తోంది. దాన్ని తగ్గిద్దామని రాజారావు హాల్లోకెళ్ళాడు. హాల్లో రెండు సోఫాలు, కార్నర్ టేబిల్సు, మూడు కుర్చీలు వున్నాయి. గోడని ఫోటోలు, బొమ్మలు తగిల్చి వున్నాయి. దీపం వెలుగులో ఫొటోలకేసి చూశాడు. తనూ, సుమిత్రా వున్న కాలేజీ ఫోటో చూశాడు. అప్పటికీ ఇప్పటికీ తనలో ఎంతో మార్పుంది! కొంచెం లావెక్కాడు. జుట్టు నుదుటిమీద నుంచి వెనక్కి జరిగింది; వొత్తు తగ్గింది. కండ్ల క్రింద నల్లగీత లున్నాయి. సుమిత్ర తననిచూసి ఏమనుకుంటుందో! తనని ఆమె చూడనందుకు సంతోషించాడు. సుమిత్ర ఆ రోజుల్లో కాలేజీకి "బ్యూటీయెట్." ఆవిడున్న సెక్షన్‌లో వుండి చదువుకొంటున్న విద్యార్థులు ధన్యులుగా ఎంచబడేవారు. వారితో మాట్లాడి, వారి పరిచయం పొందడానికి మిగతా విద్యార్థులు ఉబలాటపడుతుండేవారు.

రాజారావు ఆమెవద్దనుండి నోట్సు తీసుకున్నందుకు కథానాయకు డయ్యాడు. నిట్టూర్చి తిరిగి నోట్సు ఆమె కిచ్చేశాడు. అతను, జీవితంలో మధురంగా వొదిలిన నిట్టూర్పు అదొక్కటే. అదొక మరపురాని అనుభవం. అత నింతవరకూ ఆ నిట్టూర్పు విషయం ఎవ్వరికీ చెప్ప లేదు. పైగా భార్యతో అబద్ధమాడాడు. నోట్స్ పుచ్చుకుంటూ, సుమిత్రే నిట్టూర్చిందని. చిన్న అబద్ధమే. కాని, దాన్ని పురస్కరించుకొని,

భార్య అతన్ని ప్రతిరోజూ ఒక్కమారేనా దెప్పిపొడుస్తూంటుంది. తరవాత అంతా పోట్టిది, నిట్టూర్పు లేదు గిట్టూర్పు లేదు-అంటే, భార్య నమ్మదు. ఇదెక్కడి కర్మ. అబద్ధం నమ్ముతారు ఆడవాళ్ళు అనుకున్నాడు. ఎప్పుడూ అబద్ధమాడకూడదనుకున్నాడు.

ఏం లాభం ? అబద్ధమాడి ప్రయాణం కట్టాడు ఆహ్వానం రాగానే. అది తనకి కాదనీ, ప్రిన్సిపాల్ రాజన్‌కి ఉద్దేశించబడిందనీ అతనికి స్ఫురించింది కూడా. తనకే ఎందుకవగూడదని ఆత్మవంచన చేసుకొని, సమాధానపడి సుమిత్రకి తను జ్ఞాపకం ఉన్నందుకి గర్వించి, కొండంతై, ఎక్కడలేని ఉత్సాహాన్ని తెచ్చిపెట్టుకుని, భార్యతో చీఫ్ ఎగ్జామినరుగా వెళ్ళాలని పొంకెట్టి సుమిత్రని చూడడానికోసం ప్రయాణమయాడు. ఇందుకోసమని చెబితే భార్య ఓపఖాన రానిచ్చునా! అసలింట్లో బ్రతకనిస్తుందా! ఒక మంచికార్యంకోసం, తన సంతోషంకోసం, ఇదొక్కటే అతనాడిన అబద్ధం ఇంకెప్పుడూ ఆడను అని తీర్మానించుకొని, ఆ ఫొటోని గోడకుతగిల్చి, నిట్టూర్చి, తనగదిలోకొచ్చి పడుకున్నాడు.

రాజారావుకి నిద్రపట్టలేదు. బద్ధకంలో, అలుపులో స్పష్టమైనకలలో ఏవో నిట్టూర్పులు.

తెల్లవారింది.

ఎనిమిదైంది.

నీలకంఠంగుమాస్తా గదిలో కొచ్చాడు. తనే పరిచయం చేసుకున్నాడు.

"నమస్కారం—రాజారావుగారు... మీరొచ్చినందుకు సంతోషం?"

నా పేరు మీకెట్లా తెలుసు?"

"నీలకంఠంగారు చెప్పారు. అసలువిషయం మనవి చేస్తున్నా. ఆహ్వానాలు పంపమని అడ్రెసుల జాబితా ఇచ్చారు. కొన్ని అడ్రెసులు మావాడొకడు వ్రాశాడు. ఆ రాయడంలో మీకని ఉద్దేశించిన ఆహ్వానంపై ప్రిన్సిపాల్ రాజన్ అని వ్రాసినట్టున్నాడు. అవి నీలకంఠంగారు చూసి

అమ్మగారి కిచ్చారు. ఆవిడ, ఎరుగున్న వాళ్ళకి కొన్ని పంపుతున్నారు లెండి. అడ్రెసు ఆవిడసరిగ్గారాసి, పోస్టుచేయించారన్నమాట. వొస్తా, తొందరపన్నున్నా. మధ్యాహ్నం ఫంక్షన్‌లో కలుసుకుందాం" అంటూ వెళ్ళి పోయాడు.

రాజారావు కేమీ అర్థంకాలేదు. ఆహ్వానం తీసి చూశాను. 'ప్రిన్సిపాల్' అనిలేదు. ఎవరో 'రాజన్'ని 'రాజారావు' అని దిద్దారు. అది సుమిత్ర పనే అయివుంటుంది. నీలకంఠం తనని 'రాజన్' అని ఎందు కనుకున్నాడో ఇప్పుడు తెలుస్తూంది. 'రాజన్' కన్నడ ప్రాంతీయుడైనా చాలామంది తెలుగువాడిగా భావించి, "రాజారావని" వ్రాసిన ఉత్తరాలు ఇదివరలో చాలాసార్లు "రాజారావు" అందుకుని ఆయనకి ఇచ్చివేస్తూవడం జరిగేది.

అవుతే "ప్రిన్సిపాల్" అని ఎందుకులేదో అతనికి బోధ పడలేదు. ఆ, ఇప్పుడు బోధపడింది. రాజన్‌కి పంపిన ఆహ్వానం రాజన్‌కి చేరే వుంటుంది. సుమిత్ర తనకి వేరే ఆహ్వానం పంపి ఉంటుంది. కాబట్టి, సుమిత్ర తనని ఆహ్వానించినట్లుగా భావించొచ్చు. అవుతే వొక రహస్యం ఉంది. ఈ సంగతి ఆమె భర్తకి తెలియపర్చలేదు. కారణం?

ఏమో—అతని గుండెలు దడదడ కొట్టుకున్నాయి. ఆలోచించే వ్యవధిలేదు. డిప్యూటీ సూపరింటెండెంటు ఆఫ్ పోలీసు దినకరంగారు చక్కావొచ్చాడు. నీలకంఠం రాజారావుని పరిచయంచేశాడు. ఆయన షేక్‌హాండ్ ఇచ్చాడు. రాజారావు చెయ్యి గట్టిగానొక్కి ఊపేశాడు. దెబ్బతో వేళ్ళు నలిగిపోయ్యాయి. ఉద్యోగం హోదాలోని మజాఅంతా షేక్‌హాండ్‌లోనే వుంది.

వారి సంభాషణలు రాజారావుకు అర్థంకాలేదు. ట్రాన్స్‌ఫర్లు, ప్రమోషన్లు, పార్టీలు రాజకీయాలు—ఆ వాతావరణంలో ఇతనికి స్థానంలేదు. వారంతా ఆర్థికంగా పై అంతస్థు మీదివాళ్ళు. అసలత నిక్కడికి రావడమే బుద్ధితక్కువనిపించింది.

వొచ్చేవాళ్లు, వెళ్ళేవాళ్లు, జనంగడబిడ, పూలమాలలు, 'బొకే' లు, కుర్చీలు, బెంచీలు, దవాలి బంట్రోతులు, పోలీసులు,—లారీలు, జనం – పది, పదకొండు-ఎవరో అతన్ని భోజనానికి లాక్కుని తీసుకెళ్ళారు.

భోజనం అయింది.

మళ్ళా గదిలో కొచ్చిపడ్డాడు.

ఈలలు-పెద్ద కేకలు, చట్టున అంతా నిశ్శబ్దం. అతన్ని వో లారీలో ఎక్కమన్నారు.

"ఎక్కడికి?"

"జైలుకి"

"ఎందుకు?"

నవ్వులు!

"ఫంక్షన్‌కి రారూ?"

"అవునవును"

లారీలో ఎక్కాడు. జైలు ఆవరణలో దిగాడు. ఖైదీల చేతిపరిశ్రమలను పౌరులకి చూపించే నిమిత్తమై ఏర్పాటైన సమావేశం అది. జిల్లా కలెక్టరు అధ్యక్షుడు. ఖైదీలు అల్లిన బుట్టలు చాపలు, కాళ్ళపీచులు, నవారు, కర్రసామాను, ఇవన్నీ పెద్ద హాల్లో అమర్చబడి ఉన్నాయి. సూట్లలో ఆఫీసర్లు కుర్చీలలో కూర్చున్నారు. స్త్రీజనం, పూలు, సెంట్ల పరిమళం సిల్కుచీరలు గాలిలో చేసే చప్పుడు. అల్లాచూస్తూ నిలబడగానే పెద్ద కేకలు, విజిల్సు–లారీనిల్చిన చప్పుడు. అందులోంచి ఖైదీలు దిగారు. అందరూ వరుసగా నిలబడ్డారు. కొందరు లారీలోనే ఉండిపోయారు. లారీని దూరంగా లాగేశారు. అందులో ఉన్న ఖైదీలు కూడా దిగిపోయ్యారు. ఒక్కడే మిగిలిపొయ్యాడు. అతని మొహం ఎక్కడో చూసినట్లనిపించింది రాజారావుకి· జ్ఞాపకంవొచ్చింది–చంద్రదన్న.

చంద్రదన్నడి రాజారావు అత్తవారి ఊరు. ఒకటి రెండు మార్లు అతను తోలే జట్కాబండిలో భార్యాసమేతంగా పొర్లుగూరిలో సినిమాకి

వెళ్ళాడుకూడా. చంద్రన్నని గురించి – బోలెడు కథ లున్నాయి. చాలా మొండివాడు. ధైర్యశాలి. ప్రాణాలకి తెగించి ఏపనేనా చేసిపారెయ్యగలడు. రౌడీకూడా. స్త్రీలకోలికి పోడట. పోలీసులకి అతనంటే బెదురుట. చిన్న చిన్న నేరాలకి-ఎవడిదో చెయ్యి విరగొట్టడం, మోకాలు కిందక త్తిపోటు– ఇల్లాంటివాటికి జైళ్ళల్లో ఉంచడం, వొదిలెయ్యడం జరిగింది. రెండు మూడు ఖూనీకేసులుకూడా అతని పనేనని పోలీసులు నమ్మినా, తగినంత సాక్ష్యం దొరక్క అతన్ని శిక్షించడానికి వీలుపడింది కాదు.

కొన్ని వారాలపాటు మనిషి మాయమవుతాడుట. మళ్ళా సర్దంతా మణిగింతర్వాత ఆవూళ్ళోకి సిద్ధమవుతాడుట.

రాజారావు అత్తవారింట్లో అతనికి చనువు జాస్తి. ఎన్నో మార్లు అక్కడే భోజనంచేసి పడుకునేవాడు. ఒకసారి చేలో పనిచేస్తుండగా, అతని కర్ర తగలగా త్రాచుపాము అతని మీదికి లేచిందట. అతను చేతిలోని కర్రని మట్టిలోపాతి, తన పాగా కఱ్ఱమీద తగిల్చాడుట. పాము ఆ కఱ్ఱని కాటే స్తుండగా ఇతను పరుగెత్తుకుపొయ్యాడుట. చంద్రన్న సాత్వికుడిలా కని పిస్తాడు. వైరిబాగులవాడు. డబ్బు కాపీనం బొత్తుగాలేదు. బీడీలు కాలు స్తాడు–ఎప్పుడేనా తాగుతాడు. వేరే వ్యసనాలేమీ లేవు.

రాజారావు చంద్రన్న లారీకేసి వెళ్ళాడు. గుంపులో జనం వెన్నులు లారీ వెంపుకున్నాయి. అంతా ఆ గంద్రగోళంలో పడి పోయారు. చంద్రన్న కళ్ళు మూసుకుని, కునికిపాట్లు పడుతున్నాడు.

"చంద్రన్నా !"

ఉలిక్కిపడి లేచి కళ్ళు నులుముకున్నాడు.

"మీరాండి – ఈ రొంపిలో కొచ్చారేంటి ?"

"జైలు సూపరింటెండెంటుగారు అంటే – కొంచెం వార్నెరుగుదున్లే పిలిస్తే వొచ్చాను" అన్నాడు రాజారావు.

"ఏదేనా సాక్షానికాండి ?"

"అబ్బే – ఇదిగో, ఈ ఫంక్షనే అవుతోందే, చూసి పోదామని."

"ఇదంతా ఏా తంపులెగండి. ఏదో కూతంత పొద్దోతుంది. రాము లోరి ఉడతకిమల్లే నాను ఏదో చేసినాను" అని నవ్వాడు చంద్రన్న.

"నువ్వు మళ్ళా జైల్లో కెందుకొచ్చావ్ ?"

'నే నెందుకొత్తాను. ఈడేంపని ? ఆళ్ళే బలాత్కారంగా లాక్కొచ్చిపడేశారు. నాయెదంగాళ్ళు.'

"ఏం జరిగిందేమిటి ?"

"మీ కేం తెలుత్తవండి మా మాయగొడవలు. మాయింటిది–రత్తి – అల్లదో, రెడ్డిసత్తయ్య నెరగరండీ – పుగాకు యాపారం, ఆడు దీనెంటపడినాడంట. అదంతా వుత్తదిలెగండి. ఆడది అలుసీయకపోతే ఏ మొగపక్షిగాడి మీసం లెగుత్తుందండి – ఎట్టైతేనేంలెగండి. ఆడు దానెంట పడితేనేం, ఇదాడెంట పడితేనేం. ఇద్దరూ ఆట్లు సాగించారు. నా కళ్ళ పడిందండీ. ఏంపనే కుక్కపని అని కూత్తంత కసిరానండి. రెడ్డిసత్తియ్య లగోలగు దౌడెత్తినాడు, శనిపక్షిగాడు. మా రత్తికూతరంటుందే - "నే నీడ సాపేసి తొంగున్నా. ఆడొచ్చి ఎగబడి సరసమాడబోతుంటే, ఏటిది సత్తెయ్యా, నా మొగోడు సూత్తే, నన్ను సీరెత్తాడన్నాను. ఆడు ఇనిపించుకోకుండా రగడ సాగిత్తుంటే, నువ్వొచ్చినా – వింతేనసి" అన్నదండి. నాకు మా చెడ్డ తట్టుగా లేసుకొచ్చిందండి ఎందుకంటారా! రత్తి అబద్ధమాడిందండీ - అది మరో పరాయి శనిగాడితో వుందని నాకు తెలిత్తే నేను దాన్ని సంపి సీరి ఎండేత్తానంట. నాయంత మంచివోడు భూపపంచంమీదుండా డంటారా! నే నట్టాంటివోణ్ణి కానని తెలుసు. అంటే అబద్ధమాడిందన్న మాటేగా–నూరు సెప్పండి, ఎయ్యి సెప్పండి – నాలిక పదును, మాటనిలకడ కత్తిదెబ్బ సమమండి. ఆ మట్టున నే నన్నా "ఓసెర్రిమొగమా, నువ్వేయాలుగాడితో లేసెడితే నా కెంతుకే. ఆడితో నాగురించి ఎందు కబద్ధమాడినా సెప్పు" అన్నానండి. నోరెల్లబెట్టింది గుంట. ఛూత్ అబద్ధం ముదరష్టం పిల్ల."

చంద్రన్న కాంద్రించి ఊశాడు. జనం చప్పట్లుకొడుతున్నారు. కప్పులు, సాసర్లు, చిల్లర చప్పుళ్ళు వినబడుతున్నాయి,

"తరువా తేం జరిగింది ?"

"ఏం జరుగుద్దండి – అంతే అబద్ధమాడినందుకు నాకు శివమెత్తి దవడమీద డోలు మోగించాను. లమ్మోనని పడిందండి. నాటకం తొక్కు తుంది కాబోసనుకుని బైట కెళ్ళానండి. గంటయాక, రంగమ్మ గురక వేసుకుంటూ వొచ్చి, రత్తి సచ్చింది మావో...అంటో ఏడుపు లంకించు కుంది. కరణంగోరు, పోలీసోరు, సాక్షికాలు లాక్కొచ్చి ఈడపడేశారు ఆళ్ళకేదో మిస కావాలి. ఇద్దొరికింది; పట్టండెహె అన్నారు. పట్టు కున్నారు," చంద్రన్న నవ్వు మీసంకిందనుంచి కనబడుతుంది.

"అవుతే చంపానని వొప్పేసుకున్నావా ?"

"నే నొప్పుగోనండి, నేను సంపందే. దానికి గుండెదడ జబ్బుంది. దవడ పగలేసినమాట సొయానా నిజం. తట్టుకోలేక సచ్చింది. నాకాద అబద్ధాల బతుకు సాగదండి. నాపేరేంటో తెల్సునాండీ ? అరిచెంద్రుడు. మా అమ్మ అట్టాగే పిలిసేదంపి స్వితం – మా వుళ్ళోనే గొట్టికాయలాడే వాణ్ణి. కుర్రతనం. దాసరి బసవయ్య వాళ్ళు అరిచెంద్ర నాటకం ఆడినారు నే సూశానండి. పెళ్ళాన్ని కత్తెత్తి సంపబోతాడండి, ఆ యమ్మ అబద్ధ మాడింది గనకనే. ఆకాడనుంచి, ఛీ, అబద్ధం గూడదు అని ప్రమాణం చేసుకున్నానండి."

రాజారావు ఏదో అడుగుదామనుకుంటుండగా జనం కదలడం మొదలెట్టారు. మళ్ళా విజిల్సు, కార్లు, కేకలు, గంద్రగోళం బయలు దేరింది. ఫంక్షన్ అయిపోయింది. ఖైదీలని లారీలో కెక్కించి వేశారు. జనం పల్చబడ్డారు. కుర్చీలు, బల్లలు, కప్పులు సాసర్లు చిందరవందరగా ఉన్నాయి. నేలమీద పూలు, సిగరెట్ముక్కలు, కాగితాల చెత్త, దారాలు – ఎవరో తుడవడం మొదలెట్టారు. రాజారావు హాల్లోకొచ్చి బల్లమీద నడుంవాల్చాడు. అతనికి భయమేసింది. ఎందుకో!

చివాలున లేచి హోల్డాలు, పెట్టె అతనే తీసుకొని గేటుదాకా నడిచి వెళ్ళాడు. బండిని ఆపుచేసి అందులో సామాను పెట్టించాడు. నీలకంఠం గుమాస్తా వొచ్చాడు.

"అయ్యగారు కలెక్టరుగారితో వెళ్ళారు. చెప్పకుండానే వెళ్ళి పోతారా ?"

'ఏముంది చెప్పేటందుకు? బండికి టైమయింది. మరీ మరీ అడిగానని చెప్పండి...అమ్మగారితో...కూడా.'

"అమ్మగారు రెండురోజులవరకు రామని టెలిగ్రాం ఇచ్చారండి."

రాజారావు బండిలోకి ఎక్కాడు. తనవూరికి చేరుకున్నాడు. రైల్లో ఆలోచించి ఒక నిశ్చయానికొచ్చాడు. తన బ్రతుకంతా అబద్ధాల కూర్పు. ఆ మాటకొస్తే నీలకంఠం, సుమిత్రల బ్రతుకూ అంతే. అంతా అసత్యాల అల్లిక, నటన, దగా, సంస్కారంతో బాటు నటన, దగా, అబద్ధాలు ఎదుగుతూ ఉంటాయి. తన జీవితవిధానమే మార్చివేయాలి. అబద్ధాలాడకూడదు. భార్యకి అంతా పూసగుచ్చినట్లు చెప్పివెయ్యాలి. ఏదీ దాచకూడదు. అన్నీ చెప్పివేసి భార్యఒడిలో మొహం దాచుకొని ఏడవాలి. ఆమె కరిగిపోయి, మొహాన్ని చేతుల్లోకి తీసుకుని, కళ్ళల్లోకి చూచి, క్షమించి నిజంగా అప్యాయత చూపుతుంది. అతనామె నింకెప్పుడూ మోసం చేయకూడదు.

ప్లాట్ఫారం గేట్లో పరధ్యాన్నంగా టిక్కెట్టు బదులు అగ్గిపెట్టె నిచ్చాడు, టికెట్ కలెక్టరుకి.

ఇంటికి వెళ్ళాడు. భార్యతో అనుకున్నట్లు అంతా చెప్పి ఆమె ఒడిలో మొహందాచుకొని ఏడ్చాడు.

ఆమె నవ్వుతూ అన్నది.

"మీకు పరీక్షలు లేవని, వూరెళ్ళాల్సిన పనిలేదని నాకు తెలుసు. మీ స్టూడెంటొకడు చెప్పాడు. మీ కొచ్చిన ఆహ్వానం చూశాను. మీ రెందు కెళ్ళారో నాకు తెలుసు. ఏం జరుగుతుందో చూద్దామని నేను తెలియనట్టు అబద్ధమాడాను. చంద్రదన్నగాడి వన్నీ అబద్ధాలు ఒక్కమాటా నమ్మకండే" అని నవ్వివారేసిందింది. చంద్రదన్న అబద్ధమాడడని నాకెందు కనిపించిందో ఇంత వరకూ బోధపడలేదు. నిజాన్ని నిజమే కనుక్కోవాలి.

# 'కలంపట్టని కర్తల సంఘం'

## (నివేదిక)

కలం పట్టని గ్రంథ కర్తల సంఘం అని వుండాలి, కాని కలం పట్టని వ్యక్తి ఎల్లా గ్రంథ కర్తగా పరిగణింపబడతాడో అర్థంకాక అల్లా వొదిలేశాం. ఈ సంఘం సహాయ కార్యదర్శిగా వార్షికోత్సవ సమావేశం కార్యకలాపాల నివేదిక సమర్పించే భారం నా మీద పడినందుకు చింతిస్తున్నాను. శ్రద్ధగా చూస్తే మా సంఘం సమర్పించే నివేదిక స్వరూపం ఈ క్రింది విధంగా ఉండాలి.

---

వార్షికోత్సవ నివేదిక

ఇట్లు
క. ప. గ్ర. క. సం.
సభ్యులు

కాసేపు మా ఆదర్శాలు అవతల వుంచి, పాఠక లోకానికి మా సంఘం పుట్టుపూర్వోత్తరాలు, ఆశయాలు ఈ యేడాదిలో జరిగిన కృషి వివరించడం మా విధి కాబట్టి, యీ రచనకి పూనుకుంటున్నందుకు సభ్యులు మన్నించాలని కోరుతూ వుపక్రమిస్తున్నాను.

కలం పట్టని గ్రంథకర్తల సంఘం నిర్మాత అధ్యక్షయ్య గారు. వారు అరవై సంవత్సరాల క్రితం ఎడారి పురంలో ఖాళీపేటలో

"మృగ్యం" అనే భవనంలో జన్మించారు. పదహారవ ఏట స్నేహితులకు సెలవుల్లో పెద్ద పెద్ద లేఖలు వ్రాయడంతో గ్రంథకర్తగా ఆయన జీవితం ప్రారంభమైందనవొచ్చు. వారి అరవై మూడో ఏట కళాశాల సంచికలో కొన్ని గేయాలు వెలువడ్డాయి. మొదటి ప్రపంచ సంగ్రామం గురించి, వివిధ పత్రికలలో వారి విమర్శలు "అనామకుడు" అను పేరిట ప్రచురితమై ఆంధ్ర పాఠక లోకానికి రాజకీయాలపట్ల కళా భూయిష్టమైన అభిరుచి కలగజేసి పత్రికా సంపాదకీయం కళా ఖండం కాగలదని ఋజువు చేశాయి "సాహితీ బాణం" అనే మాసపత్రికలో కవిత్రయం వారిని గూర్చిన వారి వ్యాసాలతో విమర్శకుడుగా అగ్రస్థానం సంపాదించుకున్నాడు. మరో ఇరవై ఏళ్ళ తర్వాత "ప్రళయం" "వితండవాదం" అనే వారి నాటకాలు వూరూరా ఆడడంతో సారస్వత చక్రవర్తిగా వారి కీర్తి స్థిరపడిపోయింది. వారి రచనలను గూర్చి ఆయన చెబుతూండగా విని మతిపోయిన నాబోటి కుర్రకారు అందరం, నిరుడు వారి షష్ఠిపూర్తికి పూనుకున్నాం. అతి కష్టం మీద ఆయనని వొప్పించాం. షష్ఠిపూర్తి సందర్భంలో వారి రచనలన్నీ సేకరించి ప్రముఖుల వ్యాసాలతో, విమర్శలతో చేర్చి వో గ్రంథంగా వెలువరించి వారికి సమర్పించాలని సమకట్టి, తమ రచనలన్నిటినీ మా కివ్వవలసిందిగా వారిని కోరాం.

"నేను చెప్పినవన్నీ వ్రాయలేదు. నేనింతవరకూ ఏ రచనా చెయ్యలేదు. ఆ రచనలన్నీ చేసి వుందును. చెయ్యగల ప్రతిభ నాలో వుంది. కాని దాన్ని చంపుకుని వొక తాత్విక చింతన అలవరచుకుని, అహాన్ని త్యాగం చేసి, ఈ సారస్వత అవకాశాలను యితరులకి విడిచిపెట్టి, ఏకాంతంలో నిశ్చింతగా కాలం గడపదలచాను" అన్నారు అధ్యక్షయ్యగారు. వారింకా యిల్లా అన్నారు :

"నేను చేసిన త్యాగం సామాన్యమైంది కాదు. దాని విలువ నా సమకాలికులు గ్రహించలేరు. ఈనాడు నేను ప్రారంభించినపనికి ఎందరో

పూనుకోవాలి. ఇదొక వుద్యమంగా ప్రచారంలోకి రావాలి. ఎన్నెన్నో భావాలు నా బుర్రలో మెదిలాయి. ఎన్నెన్నో మధుర స్వప్నాలు నా హృదయంలో కరిగిపోయ్యాయి. కావ్యాలు, నాటకాలు, విమర్శలు, నవలలు, కథానికలు, వేలాదిగా వ్రాసి వుందును, కాని వ్రాయలేదు. అట్లా వ్రాయకపోవడంలోనే నా త్యాగం వుంది. ఇదొక సమాజసేవ. పూర్వీకుల గ్రంథాలు, సమకాలికుల రచనలు వేలాదిగా వున్నాయి. ఇతర భాషలలో లక్షలాది గ్రంథాలు బైలుదేరుతున్నాయి. వీటిల్లో ఏదని చదవడం ? పాఠకుడికి మతిపోతుంది ఈ సారస్వత జ్వాలలో నేనూ వో గ్రంథాన్ని సమిధగా పారేసి ప్రజ్వరిల్ల చెయ్యమంటారా ? మన పూర్వులు బోధించిన దాన్ని ఆచరణలో పెట్టి జితేంద్రియుడనై స్వార్థాన్ని చంపుకుని ఆధ్యాత్మికానుభూతిని పొంది, సత్ చిత్ ఆనందాలను సాధించి పరమాత్మలో ఐక్యం కావడం గొప్ప కృషి, త్యాగం, సాధన కావంటారా ? పరమాత్మను దర్శించిన వ్యక్తికి చెప్పేటందుకు అరువైన భాషలేదు. మౌనమే అతని శరణ్యం. ఈ తత్వాన్ని అంగీకరించి, ఎందరెందరో ఈ వుద్యమానికి చేయూతనిచ్చి సారస్వత సేవకి ఉపక్రమించాలి. ఈ నా సందేశాన్ని కూడా మీరు ప్రచురింపకూడదు. నేను వ్రాయకూడదు. ఎవ్వరూ వ్రాయకుండానే ఈ మహాసత్యం ప్రచారం కావాలి. కలంపట్టని గ్రంథకర్తని నేను" అన్నా రాయన.

ఆ క్షణాన్నే ఈ సంఘం జనించిందనొచ్చు. వారినే అధ్యక్షులుగా కూడా ఏకగ్రీవంగా ఎన్నుకున్నాం. ఆ సందర్భంలో వారికి సమర్పించిన సన్మాన పత్రంలో ఇల్లా చెప్పుకున్నాము.

"మీరు రచించని "రెండు మహాసంగ్రామాలు" అనే నవల మీ కీర్తిని వేనోళ్ళ చాటుతూంది. ఆంధ్రుల మహోజ్వల జీవితం అందులో చక్కగా చిత్రితమై వుండి వుండును. ఈనాడు సమాజాన్ని కలచివేస్తున్న సమస్యలన్నింటికీ పరిష్కార మార్గాలు సూచించి వుందురు. వాటిని ఈ సమాజం అలవర్చుకొని ఉండును, అట్లయిన సంఘ సంస్కర్తలకీ,

ప్రజా సేవకులకు పేసేటందుకు ఏమీలేక నిరుద్యోగులై, రచనకి పూను కుని మరికొన్ని క్రొత్త సమస్యలు లేవదీసి వుందురు. మీ నవల యీ ప్రమాదం తప్పించింది. అంతేకాదు. ఆ నవలను చదివి ఎందరో యువ కులు నవలా రచనకు పూనుకుని, యీ నాటి సారస్వత కల్లోలాన్ని పెంచి వుందురు. ఈ విపత్తు సంభవించకుండా మీరు తలపెట్టిన నవలను వ్రాయకుండా విడిచిపెట్టినందుకు దేశం మీకు ఋణపడింది." ఇది చదవగా విని అధ్యక్షయ్యగారు ఈ సన్మాన పత్రం వ్రాతలో ఉంది గావున, వెంటనే తగులబెట్టవలసిందని ఆజ్ఞాపించారు. అప్పుడు దాన్ని ఫ్రేమునుండి విడదీసి, అప్పుడే తగులబెట్టివేశాము. ఇది చూచి విస్తుపోయిన సభికులలో కొందరు మా సంఘంలో సభ్యులుగా చేరి పొయ్యారు.

వ్రాయకుండానే గ్రంథకర్తలుగా పేరుకొట్టెయ్యడానికి సంక ల్పించిన వ్యక్తులకు కొదవేమిటి ? కొన్ని కోట్లమంది ఇందులో సభ్యు లుగా చేరిపోతారు-అనుకుంటున్నారేమో మీరు. ఇది నిజమైతే మా సంఘంలో కొన్ని కోట్లమంది సభ్యులుగా చేరి ఉందురు. కాని అట్లా కాదు. సభ్యత్వానికి కొన్ని అర్హతలున్నాయి. వాటిని పాటించగల వారు చాలా కొద్దిమందే ఉంటారు. ఈ సంఘం అవతరించినప్పుడు, వో డజనుకు మించి సభ్యులు లేరు. ఈ డజనుమందిలో కూడా సంపూర్ణ మైన అర్హత సంపాదించుకున్న వారు ఒక్కరు కూడా లేరనడంలో అతి శయోక్తి లేదు. మా "మధురాంతకం" విషయం చూడండి. లోగడ ఒకటి రెండు గేయాలు వ్రాసివున్నాడు. మా "హంగుదారు" "తుషారం" అనే గేయ సంపుటి ప్రచురించి "ముంగిస"కు అంకితం చేశాడు— ఎందుకో ఎవ్వరికి తెలీదు. "రణవీర్" రెండో ప్రపంచ సంగ్రామ సమ యంలో వాల్‌పోస్టర్ల మీద యుద్ధంలో చేరవలసిందిగా కొన్ని పాటలు— ("రణభేరి"గా తర్వాత ప్రచురించాలనుకున్నాడట)–వ్రాశాడు. మా వే.ఘో.వి. శాస్త్రి (వేదఘోష విచ్ఛిన్న శాస్త్రి) ఋగ్వేదకాలంనాటి

సోమపానాస్వాదనా ఔచిత్యాన్ని గూర్చి వ్యాఖ్య వ్రాశాడు. మా "స.కు.బ."గారు ఉద్యోగం ఇవ్వనందుకు నలుగుర్నీ తిడుతో వ్రాసిన ఉత్తరాలను "ప్రేమలేఖలు"గా అఫ్ఫ్యాఫీసులో ఏడాదిగా పడున్న వ్రాత ప్రతిని గబగబ వెళ్ళి తీసుకొచ్చి అధ్యక్షయ్యగారి పాదాలముందు పడేస్తేనే సభ్యత్వం లభించింది. దాన్ని తగులబెట్టడం గూర్చి గంటసేపు చర్చ కూడా జరిగింది. అధ్యక్షయ్యగారు దాన్ని తగులపెట్టవద్దనీ, ప్రస్తుతం పూడ్చిపెట్టవల్సిందని ఆజ్ఞాపించారు—రాసెట్టి అనే ఆంగ్ల కవి కొన్ని ప్రేమగీతాలను ఆ విధంగా ప్రేయసితోపాటు పూడ్చిపెట్టాడుట—ఎప్పుడైనా ఈ సంఘంతో అభిప్రాయభేదాలొచ్చి సభ్యుడుగా మానుకున్ననాడు, వారికి యీ వ్రాత ప్రతి తిరిగి తీసికొని ప్రచురించుకొనే అధికారం ఉండాలన్న ప్రతిపాదన ఆమోదించారు. ఏదో ఒక అపచారం చెయ్యని వారు మాలోలేరు. కృష్ణయ్యగారు ఏమీ వ్రాయలేరు గాని, ఒకరిద్దరు యువకవులు తమ గేయ సంపుటాలను వీరికి అంకితం చేశారుట. మా "మరమ్మత్" ఓ చిన్న కథల సంపుటానికి పరిచయ వాక్యాలు వ్రాశారు. ఆ గ్రంథం ఒక సినిమా నటికి అంకితం ఇవ్వడంతో వేసిన రెండువేల కాపీలు అట్టే అమ్ముడయిపోయినాయి. వాటినన్నింటినీ సేకరించి తగులబెట్టే సంకల్పం మా సంఘం వారికి ఉందిగాని, కొనసాగుతుందని మేం అనుకోడంలేదు. ఇంకెప్పుడూ ఉపోద్ఘాతాలు వ్రాయనని ఒట్టేసుకున్న మీదనే "మరమ్మత్"కి సభ్యత్వం దొరికింది. "వైవాహిత్" అనే మరో సభ్యుడున్నాడు. తనెప్పుడూ వ్రాసిన పాపాన పోలేదని ప్రమాణం చేసినా, గిట్టనివారు ఆయన రచనని ఒకదాన్ని బైటపెట్టారు. ఎవరిదో ధనిక కుటుంబంలో వివాహం జరిగిందట. ఆ సందర్భంలో వధూవరుల మంచిగుణాలన్నిటిని స్తుతి గేయమాలగా పెండ్లి పందిట్లో చదివి, ఫ్రేమ్ కట్టించి పెండ్లి కుమారునికి సమర్పిస్తూండగా తీసిన ఫోటో బైటపెట్టడంతో ఆయన బండారం బైటపడింది. పాప పరిహారంగా ఆయన కలాన్ని అధ్యక్షయ్యగారికి ఇచ్చివేశారు. అప్పుడు,

ఫౌంటెన్ కలాలు ప్రవేశపెట్టడం నిర్ణీతమైంది. ప్రతి సభ్యుడు ఓ కలం, దస్తా కాగితాలు సంవత్సరం చందాగా కట్టాలి. వారు లోగడచేసిన రచనలుంటే ఆ ప్రతులన్నింటినీ సేకరించి వార్షికోత్సవంలో వాటిని దగ్ధం చెయ్యాలని తీర్మానించారు. ఇదంత కష్టం కాదు. ఎందుకంటే అచ్చువేసిన ప్రతులన్నీ సాధారణంగా గ్రంథకర్తగారింటి బోషాణం లోనో, ప్రచురణకర్త చెత్తకాగితాల కొట్లోనో, సుళువుగా దొరుకుతాయి. వార్షికోత్సవంలో ప్రతి సభ్యుడూ ప్రసంగించి తీరాలి. ఆ ఏడాదిలో ఆయన ఊరిలో కాగిన భావాలు, తలపెట్టిన రచనలూ, వాటిని వ్రాయ కుండా ఎల్లా తప్పించుకున్నదీ వివరించాలి. గొప్పరచన తలపెట్టి వ్రాయ నందుకు అధ్యక్షులు కొన్ని బిరుదులు కూడా ఇవ్వాలని సూచించారు. "మధురాంతకం" 'కన్నీటి స్వర్గం' అనే ఖండకావ్యం వ్రాయలేదుట. వారికి 'నహికన్నీర్ కవి' అని బిరుదు ఇద్దామన్నారు. దానికి నేను తగను అని నమ్రతతో ఆయన నిరాకరించారు. 'ఏమో, ఆ కావ్యం నేను ముందె ప్పుడూ వ్రాయనూ అనలేను. ఏ వేళ ఏ బుద్ధి పుడుతుందో" అన్నాడు 'మధురాంతకం'. ఆయన నిజాయితీని అధ్యక్షులు ప్రశంసించారు. ఈ సంవత్సరం ఉపనిషత్తుల జోలికి పోలేదు అన్నాడు వే.ఫో.వి. శాస్త్రి. భానుని ఏకాంకిల విషయమై పరిశోధనచేసి కూడా వ్యాసాలు వ్రాయడం మానుకున్న ఉదంతం విని సభ్యులు సంతోషించారు. ఒకటి రెండు మార్లు బౌద్ధతత్వం గురించి వ్రాయాలని ఉబలాటపడ్డారుట. మరోమారు శంకరాచార్యుల చరిత్ర సినిమాకు పనికొచ్చేటట్లు వ్రాయాలనుకున్నారు. 'నాగానందం' తనని విమర్శించవల్సిందిగా చేసిన ఆహ్వానాన్ని పెడ చెవిని పెట్టారుట. చివరికి ముద్దుపళని మధురంగా పిల్చినా విని పించుకోనందుకు ముందు ముందు అధ్యక్షపదవిని కొట్టెయ్యడానికి ఆయన కృషి చేస్తున్నట్లు స్పష్టమైంది.

హంగుదారు "మిల్లు యజమాని" అనే సాంఘిక నాటకం ఆరం భించి, వొక రంగం పూర్తి కూడా చేశాననీ, తరువాత అతనికి మిల్లులో

పని దొరికిందనీ, అంతటితో ఆ వ్రాత ప్రతిని మిల్లులో విద్యుత్ చక్రాల మధ్య పడేసి పిండిగా చేసిన ఘట్టం విని, మేమందరం చకితులమయ్యాం. మా రణవీర్ హిందీ, వంగభాషల నుండేగాక 'సరోయన్' ప్రీస్ట్లీల రచనలు తెలుగులోనికి అనువదించడానికి పూనుకుని, కీర్తి కాంత పిలుపుని కాదని ఆమెను పంపించివేసి లోపల గొళ్ళెం పెట్టుకొని ముసుగుతన్ని పరున్న దృశ్యం వూహించుకుని సభికులు కరతాళ ధ్వనులు చేశారు. ఇక "స. కు. బ." వయస్సులో పిన్నైనా, త్యాగంలో మా అందరికంటె పెద్ద — ఎందుకంటారా — నాలుగైదు అపరాధ పరిశోధక నవలలకి కావల్సిన వస్తువు సిద్ధంగా వుండి కూడా, వాటి రచనకు పూనుకోలేదు. వొకరిద్దరు పంపిన నవలలపై అభిప్రాయం వెలిబుచ్చలేదు. ఆఖరికి ఆ రకం నవలల్ని చదవాలన్న తృష్ణని కూడా అణగద్రొక్కుకుని మానసిక ప్రశాంతతని పెంపొందించుకున్నాడట. నహిహంతక్' బిరుదుపొంది అధ్యక్షుల వారి మన్ననకు పాత్రుడయ్యాడు. మా కృష్ణయ్య పిల్లల సాహిత్యంజోలికి ఈ సంవత్సరం పోలేదు. 'వారు హాయిగా ఆడుకుంటూ పాడుకుంటూ వుండకుండా నా బాలసాహిత్యంతో తత్ఫలితంగా జనించే పోటీ తత్వంలో వారి ఆనందమయ, అమాయకపు జీవితాలను భగ్నం చెయ్యడం నా మతంకాదు. నేనే కాకుండా పెడతోవకిపట్టించే తోటి రచయితల మాటలు విని, ఆ బాలబాలికలు రచనకి పూనుకోకుండా, వారి జేబుల్లో పెన్సిళ్ళు, బలపాలు, సుద్దముక్కలూ సంగ్రహించి, చోరత్వానికి దిగవల్సి వచ్చింది అన్నాడు కృష్ణయ్య తన సారస్వతానుభవాలను వివరిస్తూ.

మా సంఘంలో మహిళలు సభ్యులుగా చేరలేదు. అందుచేత మహిళా సాహిత్య లోకానికి మేము ఏ సహాయము చేయలేకపోయామని చెప్పేటందుకు విచారిస్తున్నాను.

ఈ ఏడాదిలో మా సంఘం సభ్యుల సంఖ్య వొందకి పెరిగింది. మొన్న జరిగిన వార్షికోత్సవానికి అధ్యక్షయ్యగారు అధ్యక్షులుగా

వున్నారు. ఆ ఉత్సవం ప్రారంభించడానికి ఎవరిని పిలవాలా అన్న విషయంపై రెండు మూడు గంటలు వాదోప వాదాలు జరిగినవి. 'మనం ఎవరినో వొక ప్రముఖ వ్యక్తిని పిలుస్తాం. మనమాట తీసెయ్యలేక వారు వస్తారు. దానివల్ల వారు చెయ్యవలసిన పనులు చెయ్యనీకుండా చేస్తున్నా మన్నా మాటేగా ! దేశ క్షేమానికి, పురోగమనానికి విని యోగపర్చవలసిన వారి అమూల్యమైన కాలాన్ని మన ఉత్సవ ప్రారంభానికి ఖర్చు పెట్టించి, సమాజ శత్రువులుగా తయారవడం మన ఆదర్శాలకి విరుద్ధం. కాన మనం ఎవరినీ శ్రమపెట్టవద్దు' అన్నారు అధ్యక్షులు గారు.

* * *

మౌనంగా నిలబడి పైకి పాడని ప్రార్థన గీతంతో ఆనాటి కార్య క్రమం ప్రారంభమైంది. తరువాత 'ఆయుధ విసర్జన' జరిగింది. సభ్యులు వొక్కరొక్కరే వేదికపైకొచ్చి కలాలు, పెనసళ్ళు, తెల్లకాగితాలు అధ్య క్షుల ముందు విసర్జన చేశారు. ఆ పిమ్మట "సంతాప ప్రమాణ స్వీకా రము" తంతు జరిగింది. ఆయా సభ్యులు వారు చేసిన అపచారాలు దాచ కుండా చెప్పి వేసి, పశ్చాత్తాపం ప్రకటించి, చెంపలేసుకుని, "ఇంక చెయ్యను" అని ప్రమాణ స్వీకారం చేస్తారు.

ఈ సందర్భంలో మా "వైవాహిత్" కి "నహి గీతాచార్య" అను బిరుదు ప్రసాదించారు. ఎందుకంటారా ? అతను ఈ సంవత్సరం భగవ ద్గీత జోలికి పోలేదుట. లోగడ గీతని బుర్రకథగా, జముకులకథగా, గొల్ల సుద్దులుగా, వీధి నాటకంగా, యుగళగీతంగా, అనేక స్వరూపాలలో వ్రాసివున్న దురంతాల వృదంతాన్ని యేకరువు పెట్టి ఈ పవిత్ర గ్రంథాన్ని ముందెప్పుడూ మలినం చెయ్యనని వొట్టేసుకున్నాడు.

మూడవ హంశము అధ్యక్షుల వారి ఉపన్యాసము. దీనిని ఏ పత్రి కలూ ప్రచురించవు ప్రచురించేటందుకు నాకూ అనుమతిలేదు. అయినా, కొన్ని భాగాలు వ్రాయక తప్పదు.

మన సంఘంపట్ల కొన్ని సంస్థలు అసమ్మతి ప్రకటించాయి.

కొన్ని పత్రికలు ఇల్లాంటి సంఘమే ఉండరాదనీ, దీన్ని ప్రభుత్వం రద్దు చెయ్యాలనీ సూచించారు. సారస్వతాభివృద్ధిని మా సంఘం నిరోధిస్తుందని వీరి వాదం. మా సంఘం తలపెట్టిన కార్యక్రమం దేశమంతటా వ్యాపిస్తే ముద్రణాలయాలలో పనిచేసే వేలజనానికి, ప్రచురణ కర్తలకి, పత్రికాలయాలకి పని లేకుండాపోయి నిరుద్యోగ సమస్య తలెత్తుతుందని కూడా వీరు అంటున్నారు. ఇది కాదనలేము. దీనికిగాను వీరందరికి యథా విధిగా పని కల్పించే సూత్రాన్ని అమలు జరుపుతున్నాము. మా సంఘములో ఎవరెవరైందీ, సభ్యుల సంగ్రహ జీవిత గాథలు, వారి ఊహా జగత్తులో జరిగిన యుద్ధాలను, వారు ఏ విధంగా స్థూల ప్రపంచంలో ప్రేరణ నెదుర్కొని ఆకర్షణలని జయించి చిత్తశుద్ధిని, ఆత్మశాంతిని అలవరుచుకున్నారో తెలియజేసే వొక సంచిక యేదాది చివరలో వెలువరిస్తాము. ఆ గ్రంథంలో రచయితలను గురించిన వివరాలు పొందుపరచబడతాయి ఉదాహరణలిస్తాను.

"వైవాహిత్" — అసలు పేరు పైడూరం వామన హరి ప్రసాద రావు. చదువు – ఇంటర్ నాలుగుమార్లు ఫేలయ్యాడు. బి. ఏ. పరీక్షకు కూర్చోలేదు. వివాహం జరిగింది.

వీరి అముద్రిత గ్రంథాలు : "కొద్దో గొప్పో" "కలగని సంతానము", "ఖండ కావ్యం", "భగీరథుని తపస్సు". అసలు వ్రాయని రచనలు : "ఏదేశమేగినా", "మెక్సికోలో విప్లవం" (వ్యాసాలు)

ఈ క్రింది వారి రచనలు వారు చదవలేదు : వాల్మీకి, నన్నెచోడుడు, వీరేశలింగం, థామస్ హార్డీ.

ఈ క్రింది వారిపేర్లు కూడా వినలేదు. జీన్‌పాల్ సార్త్రే, కిర్క్‌గార్డ్.

అల్లాగే "వృశ్చికం" — అనే పేరుతో సీరియల్ నవలా రచయితను గురించి యిల్లా వెయ్యవొచ్చు. వృశ్చికం — అసలుపేరు తేలుటూరు రింగయ్య. వారు పొందని అపూర్వ అనుభవం : తేలుకుట్టడం.

వీరు వ్రాయని నవల : "ఎందుకీ తొందర సుందరాకార" బుర్రలోకూడా లేని గ్రంథం : "బాణసంచా" (కథల సంపుటి)

వీరి అభిమాన రచయితలు : ఖలీల్ జిబ్రాన్, ఫెర్దౌసి, "శాఫో" "స్టీఫాన్ జ్వీగ్".

ఈ పై వారి రచనలు వీరు చదవలేదు – వీరికి యీ పేర్లు బాగుంటాయి. అంతే.

కాలక్షేపం : పుస్తకాల కేటలాగులు పోగుచెయ్యడం. బొమ్మల పత్రికలలో బొమ్మలు చించకపోవటం.

ఒక రచయిత్రిని గురించి

"వీణతంత్రి" – యీ పేరుతో పాఠకలోకానికి పరిచయం; కాని యీమె అసలుపేరు "వరకట్నం ధనలక్ష్మి"

వివాహం , చేసుకోలేదు.

చదువు : ఇంట్లోనే.

కళాసాధన : ఊహలో.

కాలక్షేపం : తెలుగు సినిమాలు చూడకపోవడం.

ఇష్టంలేని రచయిత్రిలు : మొల్ల. జేన్, ఆస్టిన్, ముద్దుపళని, షార్లొట్ బ్రాంట్.

అముద్రితగ్రంథం : మరి మొగాళ్ళమాటేమిటి ?

(వ్యాసాలు). ఇందులో వున్న విషయాలను అన్ని పత్రికలూ వారికి కావల్సినవాటిని ఏరుకుని ప్రచురించవచ్చు.

అధ్యక్షయ్యగారి ఉపన్యాసంలో మరో ముఖ్యభాగం :

"ఏ రచనా చెయ్యకుండా, పాండిత్యంగాని, సంస్కృతిగాని భాషాపరిజ్ఞానంగాని యీషన్మాత్రమూలేకుండా గొప్ప రచయితలుగా సాహితీపరులుగా చలామణి అయి, ఉన్నత పదవులు సంపాదించుకోడానికి, ఈ సంఘం ఎత్తువేసున్నదని వొక అభియోగం చేశారు, కొందరు ప్రముఖులు. మా సంఘం చేస్తున్న కృషికి ఫలితం అది కావొచ్చు –

కాని ఉద్దేశం మట్టుకు అది కాదు. ఈనాడు సమాజంలో విభిన్న దృక్పథాలున్నాయి. సంప్రదాయాలు, సాహితీ విలువలు తారుమారవు తున్నవి. ఈ మహాగంద్రగోళంలోంచి, చెత్తలోంచి మరుగుపడిన మణు లను ఏరి చూపే విమర్శకులున్నారు. మా సంఘం ఈ చెత్తని పెంచ కుండాచేస్తుంది. చెత్త తగ్గినకొద్దీ, విమర్శకుడి పని సుళువవుతుంది. గొప్పగ్రంథాలేవో నిర్మితమవుతాయి. వాదాలు, సిద్ధాంతాలు, పోటీలు సమసిపోతాయి. ప్రపంచశాంతి ప్రబలుతుంది. ఇది సేవ కాదంటారా ?"

వ్రాయబడని రచనలను చెత్తగా పరిగణించడం సభ్యులకు నచ్చ లేదు. వ్రాసివుంటే గొప్పరచనలవును – సభ్యులందరూ వ్రాయగల గొప్ప గ్రంథకర్తలు. అట్టివారి కృషిని చెత్తకింద కట్టెయ్యడంపట్ల అసమ్మతిని తెలియచేశారు. అధ్యక్షులవారిని తమ ఉపన్యాసాన్ని నిలప మన్నారు. క్షమాపణ చెప్పమన్నారు. వారు దాని కంగీకరించలేదు. క్షమా పణ చెప్పకపోతే సభ్యులందరూ రాజీనామా యిచ్చి, వారివారి కలాలు, కాగితాలు పట్టుకపోతామన్నారు. మా "మధురాంతకం" వొక కొత్త సూత్రాన్ని ప్రతిపాదించారు. "రచనలు చెయ్యకపోవడమే కాకుండా, ప్రతిభాశాలి అయిన ప్రతి సభ్యుడూ ఉపన్యసించకూడదు. గ్రామభాష ప్రబలి, ఉపన్యాసానికీ, రచనకీ తేడా లేకుండాపోతూంది గనక యీ సంఘం యింకనుంచి ఉపన్యాసాలు మానుకోవాలి."

దీన్ని సభ్యులందరూ ఏకగ్రీవంగా ఆమోదించి, అధ్యక్షులవార్ని ఉపన్యసించడం మానుకోమన్నారు.

"మరి ప్రేక్షకజనమూ లేమిటి ?" అన్నారాయన.

"వారూ మౌనంవహించి, ఏకాంతాన్ని ఆస్వాదించి, సమాధిలో పడి దాన్నుండి జనించే శూన్యరసాన్ని ఆస్వాదించాలి" అన్నాడు మధురాంతకం.

కార్యక్రమంలో ఈ భాగాన్ని "శూన్యరసాస్వాదనా కృత్యం" అన్నారు. ప్రేక్షకజనానికి యిది నచ్చలేదు. అల్లరి సాగించారు– కేకలు,

యీలలు, అధ్యక్షయ్యగార్ని గూర్చి అపవాదుతో కూడుకున్న నినాదాలు సాగించారు.

ఈ అధ్యక్షయ్య ఏ రచనా చెయ్యలేదంటే మేం నమ్మం, "అ, ఆ" "ఇ, ఈ," అని మారుపేర్లెట్టుకుని, మూడు ఖండకావ్యసంపుటాలు ప్రచురించాడు. "రెండు రెళ్ళు మూడు" అన్న పేరుతో 'నలుగురు శత్రువులు' అన్న నవల ప్రచురించాడు. "అబద్ధాల అధ్యక్షయ్య" – అంటూ చేసిన ప్రేక్షకుల నినాదాలు మిన్ను కెగిసినవి.

అప్పుడు అధ్యక్షయ్యగారు మరొక కర్మకాండ శాసించారు. మొదటిది 'కవచ విసర్జన' – అనగా మారు పేర్లతో, (సకుబ, హంగుదార్, రణవీర్ మొదలైనవి) రహస్యంగా రచనలు సాగిస్తున్న సభ్యులు కవచాలను (మారుపేర్లను) వదిలేసి, నిజస్వరూపం (నామధేయం) బహిరంగం చెయ్యాలి. రెండోదానిపేరు అపవాద ఉపసంహార కృత్యం– అనగా ప్రేక్షకులలో వొకరు సభ్యుడు మారుపేరుతో రహస్యంగా చేసిన రచనని బైటపెట్టడం (అపవాదువెయ్యడం) – అవతల వ్యక్తిపశ్చాత్తాపం చెంది, గుంజీలు తీసి, లెంపలేసుకుని (ఉపసంహారం).

* * *

'ఏమండోయ్–లేవండి, పట్టపగలే కలలేమిటి ? ఆ లెంపలేసుకోడం ఏమిటి ? లేవండి, కాసిని మంచినీళ్ళు త్రాగండి అంటూ ఆవిడ లేపింది.

'ఏదో వ్రాసి యిస్తామన్నారుటగా – ఆయనెవరో వొచ్చాడు చూడండి' అన్నదామె.

'జ్వరంగా వుంది, రేపు రమ్మందూ' అన్నాను.

'ఇంక యివ్వనక్కర్లేదుట. వారి పత్రిక నిలచిపోయిందిట' అన్నదామె.

'అమ్మయ్య !' అనుకుని మళ్ళీ పడుకున్నాను.

# కాలచక్రం నిలిచింది

ముకుందాన్ని బెంగుళూరు పిచ్చాస్పత్రిలో పెట్టారన్నవార్త విన్నప్పుడు కాలచక్రం నిలిచిపోయినట్లనిపించింది. ఆరుగురు అన్నదమ్ముల్లో నాలుగోవాడు ముకుందం. నలభై యేళ్ళ నడివయస్కుడు, చదువుకున్నవాడు. ద్త్తతవల్ల సంక్రమించిన రెండు మేడలు, వొకతోట, యాభై ఎకరాల భూమీ గల స్థితిపరుడు. మామగారు జిల్లాకలెక్టరు. జ్ఞాపకంవొచ్చినప్పుడల్లా కాలక్షేపానికి బి.ఎల్. పరీక్షకి కడుతుంటాడుగాని, ఉద్యోగం చేసే అవసరంగాని, అభిలాషగాని అతనికిలేవు. అన్నదమ్ములందరూ మంచి పదవుల్లో వున్నారు. కుటుంబంలో వెనక ఎవరికీ పిచ్చి ఎత్తినట్లు లేదు. మనోవ్యాకులత, చీకూ—చింతా లేకుండా హాయిగా జీవితం గడిచిపోతున్నప్పుడు, ముకుందం పిచ్చాస్పత్రిలో ఎందుకు గడపవల్సివొచ్చిందో నాకర్థంకాలేదు నాకుపిచ్చెత్తినట్లయింది. కాలచక్రం కదలనట్లనిపించింది. కాలచక్రం కవిమెళకువ. రచనాశిల్పంలో అదొక విసురు. దానిగొడవ ఎవరిక్కావాలి?

రెండప ప్రపంచసంగ్రామం ప్రారంభమైందన్న వార్త తెలిసినప్పుడూ, మహాత్ముడు పరమపదించాడన్న వార్త విన్నప్పుడూ ఓ క్షణం పాటు కాలచక్రం నిలిచిపోయినట్లనిపించింది. మళ్ళా ముకుందం పిచ్చి విషయం తెలిసినప్పుడు అట్లాంటి అనుభవం కలిగింది. వైమానికుడు సహారా ఎడారనుకుని నేలమీదికి అడుగుపెట్టగానే ఎటుచూచినా మంచే జలపాతం ఒంపుదగ్గర నిలిచిపోయింది. ఇట్లాంటివి జరిగినప్పుడు వూపిరి బిగబడతాం. గుండెకొట్టుకోడంలో ఒక లయ, క్రమం వుంటాయిట. మధ్యలో ఒకసారి కొట్టుకోడం మానేసి — ఒక 'బీట్' విడిచేసి, తరవాత మళ్ళా మామూలుగా గుండె కొట్టుకోవడం అసంభవంకాదని వైద్యశాస్త్రజ్ఞులు చెబుతున్నారు. మధ్యనున్న స్థలంగుండా ప్రయాణం చెయ్యకుండానే, ఒక పదార్థం ఒకచోటునుండి మరోచోటికి చేరుకోవడం సంభవమేనని భౌతిక

శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. ఇల్లాంటివి సంభవమైనప్పుడు ముకుందానికి పిచ్చెత్తడం మాత్రం ఎందుకు సంభవంకాకూడదనుకుని సమాధాన పడినా, ఆ అనుభూతి అన్వేషణకి నన్ను పురిగొల్పింది. వ్రాసేస్తే ముకుందం వ్యక్తిత్వం విశదపడుతుందేమోనన్న ఆశతో ఈ రచనకి ఉపక్రమించాను.

ముకుందం అనేకమంది సామాన్య వ్యక్తులలో ఒకడైతే అతన్ని గురించి నేను పట్టించుకోను. ఓరకంగా అతను అపూర్వవ్యక్తి. ఆధునిక యుగంలో ఆనందాన్ని సాధించగలవ్యక్తులు అరుదు. నాతోటి మానవులలో 'నాజీవితం హాయిగా, సంతోషంగా 'గడిచిపోతోంది' అని అన్నవారు నాకు తటస్థపడలేదు. మనలో ప్రతివారికీ ఏదో లోటు. ఆరోగ్యం వుండదు, అవకాశాలుండవు, డబ్బుండదు. ప్రేమదొరక్క చెడిపోతాం. తీరిక కోసం పనిచేసి పొందిన తీరికలో ఇంకా పనిచేస్తాం. ఏకాంతంలేదు. ఇల్లొకజైలు, ఇందులోంచి తప్పించుకుని గుంపులో కలసిపోతాం. మరోవ్యక్తి సమక్షంలోగాని, మనం సజీవులమై వున్న విషయం బుజువుకాదు. కుళ్ళు, కృత్రిమం, జాడ్యం, దాస్యం, నిద్రలోకూడా విరామంలేని మనోవ్యాకులత- ఈ మహాగంద్రగోళంలో పరిభ్రమిస్తూవున్న ఈ వ్యక్తులందరికీ ఎందుకు పిచ్చెత్తలేదా అన్న సంశయం, ఒస్తుంది. పిచ్చెత్తకుండా, మామూలుగా ఉన్న వారుంటేకదా పిచ్చిమందాన్ని కొలిచి విలువకట్టడానికి!

ఆనందమయజీవి ముకుందం. ఆవిధంగా అతను అపూర్వమైన వ్యక్తి. మరోవిశేషంవుంది. ముకుందంలాంటి వ్యక్తులు మనసంఘంలో చాలామంది వున్నారు. ఆ రకం మనస్తత్వం గలవారికి అతను ప్రతినిధి. ఎప్పుడో ఒకప్పుడు ముకుందాన్ని, అతని తెగవారిని కలుసుకోక తప్పదు. వారినిమీరు ప్రేమించ వచ్చు. ద్వేషించవచ్చు, కాని వారిబారి నుండి తప్పించుకు పారిపోలేరు. ఆఫీసుల్లో, క్లబ్బుల్లో, పార్కుల్లో, సినిమా హాలుల్లో, దుకాణాలలో, రైలుప్రయాణంలో, ఎక్కడో అక్కడ అతన్ని మీరు కలుసుగునే వుంటారు. ఎవ రతను? అత నొక మాటకారి. వాగుడు కాయుడు. అతను మాట్లాడటం మొదలుపెడితే, మరిఆగడు; ఎవర్నూ

అతన్ని ఆపలేరు. పిడుగు పైనబడినప్పుడు ఎవరు తప్పించుకోగలరు? జలపాతాన్ని అరచేతిలో ఆపడం ఎంత సులువో అతని నాలుక పరిభ్రమణాన్ని ఆపడం అంత సులువు. ఈపాటికి మీరు గ్రహించేవుంటారు. ఆంగ్లంలో అతన్ని 'బోర్' అంటారు. ఎన్నో హాస్యపత్రికలు, ఎందరో హాస్యరచయితలు అతని పూసులు చెప్పుకుని, రోజులు గడుపుకుంటున్నారు.

అతని గాథలు వేనోళ్ళ వింటాం. అత నొక పురాణ పురుషుడు.

ముకుందం మంత్రజాలంలో చిక్కుకుని, గిలగిల తన్నుకుని, బైటపడినవాళ్ళల్లో నేనొకణ్ణి. అతన్ని ద్వేషించాను; విమర్శించాను; నిర్మూలం చెయ్యాలని సంకల్పించాను. ధిక్కరించాను, హేళనచేశాను. జాలిపడ్డాను; చివరికి ప్రేమించాను. అతన్ని పిచ్చాస్పత్రిలో పెట్టిన ఈ ప్రపంచానికి పిచ్చి.

ఈరకంగా ప్రపంచంపై కోపించి నేను సాధించిం దేదీ లేదు. అందుచేత తమాయించుకొని ముకుందంతో నాపరిచయాన్ని ఉద్రేక రహితమైన గృకృథంతో స్మరిస్తాను.

ముకుందాన్ని గురించి కుతూహలపడడానికి ఏ వేవో చాలా కారణాలు చెప్పాను. కాని, అసలు విషయం వదిలేశాను. అతనితో దూరపు బంధుత్వం వుంది—ఆవిడ తాలూకు దూరపుచుట్టం—నా తాలూకే అని చెప్పకోడంలో చిన్నతనం వుందని కాదుస్మాండి—అసలువిషయం అది.

ఆదివారం ఉదయం తొమ్మిదైంది.

వీధిలోకని బైలుదేరి పదిమెట్లు దిగాను. పదకొండో మెట్టుమీద ముకుందం ప్రథమంగా తటస్థపడ్డాడు. తనుఫలానా అని పరిచయం చేసుకున్నాడు.

"ఓహో అల్లానా—మిమ్మల్ని గురించి వినడమే గాని ఎప్పుడూ చూడలేదు—రండి, రండి, లోపలికెడదాం" అని ఆహ్వానించాను. భుజం మీద చెయ్యేసి నన్ను నిలిపేశా

'నన్ను గురించి విన్నారన్నమాట. చూసింతర్వాత, 'ఇదేమిట్రా ఎందుకు చూశాను?' అని అనిపించలేదుకదా! ఏ ముసిలాడినో, ముక్కాడినో అనుకున్నారా? అమ్మాయి చెప్పిందేమో లెండి నేనంత పెద్దవాణ్ని-అంటే ముసిలివాణ్ని-కానండోయ్. అసలు ముసిలాళ్ళంటూ ఉండరని నా దృఢ విశ్వాసం. ప్రతివాడూ తనకున్న వయస్సుకి పది హేనేళ్ళ తర్వాతేగాని వార్ధక్యమంటూ ఉండదనుకుంటాడు. నాకు నలభై అయితే, యాభై అయిదేళ్ళ వాళ్ళందరూ ముసిలాళ్ళన్న మాట. నా కరవై అయితే, డెభ్భై అయిదేళ్ళ వాళ్ళందరూ వృద్ధులన్నమాట. అదీ "థీరీ". మీకు ముప్పై-అవునా? మీ ఉద్దేశ్యం, నలభై అయిదు దాటిన వాళ్ళంతా ముసిలాళ్ళు. నేనిక్కడి కెందుకొచ్చాననా మీ ప్రశ్న-మీకు తెలీదేమో-అమ్మాయి చెప్పలేదేమో-ఇక్కడ బ్రిడ్జి మాచస్ ఉన్నాయి, అందుకొచ్చాను. నేను బ్రిడ్జి ఆటగాణ్ని లెండి. మీకొచ్చా? ఆంధ్రలో ఎక్కడ టోర్నమెంటయినా, మావాళ్ళు నన్ను పంపిస్తూ ఉంటారు. ఇంకెవరూ లేనట్లు. ఏంచేస్తాం, పెద్దలు మనమీద వోభారం పడేసిం తర్వాత, మనం నిర్వర్తించక తప్పదు. క్రితం నెల బెంగుళూరులో రన్నరప్-పేపర్లో చూశారుగా, అంటే, బెంగుళూరు లోకల్ పత్రికల్లో పడ్డాయిట లెండి-ఇక్కడి మన పత్రికలు యూస్‌లెస్. వీళ్ళ ఉద్దేశ్యంలో బ్రిడ్జి ఒక ఆటేగాదు. నేనే ఇంగ్లండులో పుట్టి ఉంటే, ఈ నా ఆటకి, పార్లమెంటు మెంబరుగా చేసేయ్యరూ! మావాళ్ళు వొచ్చేయేడు ఇంగ్లండు పంపుతామంటున్నారు నన్ను-భారం పడిన తర్వాత..."

"...లోపలి కెడదాం..."

"ఓడలోనే వెడతాననుకోండి. నాకీ ఎయిర్ ట్రావెల్ సుతరామూ ఇష్టం లేదుస్మండి. ఎందుకంటారా? విల్లు వ్రాసిగాని విమానం ఎక్కడం మూర్ఖత్వం. విమానం ఎక్కి నేను క్రమంగా గమ్యస్థానం చేరుకుంటాను అని ధీమాగా చెప్పగల విమాన యాత్రికుణ్ణి ఈ జగత్తులో మీరు నాకు చూపగలరా? స్వామీ? నిరుడు నిలియర్డ్స్ మాచెస్‌కి విమానంలో సిమ్లా ప్రయా

ణం తగిలింది ? ఎల్లాగో తప్పించుకున్నా వెళ్ళకుండా. ఇంతకీ మరో ఏడాదిపాటు నూకలు మనకి భూప్రపంచం మీద వ్రాసిపెట్టాడు పర మాత్మ. ఎందుకు వెళ్ళలేదని సిమ్లా—అమ్మాయి చెప్పే ఉంటుందేమో లెండి..."

"రండి—కూర్చుని, కాఫీ పుచ్చుకొని సావకాశంగా మాట్లాడు కుందాం..."

అని మెలెక్కాస్సు. ఆయన ఆరో మెట్టుమీద నిలిచిపోయాడు.

"నాకు కాఫీ అనీ, టీ అనీ పట్టింపులు లేవు. ఏదైనా పుచ్చు కుంటాను. అసలు లేకపోయినా అయ్యో లేకపోయిందే అని ఇదవను. ఒకసారి చెరుకుపల్లి జమీందారుగారు డిన్నరిచ్చారు. మజ్జిగనుకొని కాఫీ వొడ్డించారు."

నేను లోపలికెళ్ళి, ఆవిడ చెవిని యీ వార్తపడేసి, కుర్చీలు, బల్లలు కాస్త సర్ది, యివతలకొచ్చాను. ఆయన మూడో మెట్టుమీద నిల బడి మాట్లాడుతున్నాడు—మెట్ల కొంపల్ని గురించి.

"తంజావూర్లో వో చెట్టియార్ యింటికి వెళ్ళాం..."

దీర్ఘోపన్యాసానికి తావివ్వకుండా, ఎక్కడికక్కడ నిలదొక్కడం మంచిదనుకొని అడ్డుప్రశ్నల కుపక్రమించాను.

"తంజావూరా ? ఎవరెవరెళ్ళారు ?

"మామగారితో-కోయంబత్తూరు నుండి కార్లో వెళ్ళాం. ఆ చెట్టియారింటికి నాలుగుచోట్ల మెట్లున్నాయి. మధ్య హాల్లో మామగారూ నేనూ విడిపోయ్యాం. నేను వరండా మెట్ల మీదుగా వెళ్ళాను. వాళ్ళు ముందు అరుగులమీద మెట్లగుండా వెళ్ళినట్లున్నారు. ఈ రెండు మెట్ల వరుసల్లూ పైన బాల్కనీలో కలిసినట్లున్నాయి—టపీమని ఆ చెట్టియారూ నేనూ గుద్దుకున్నాం."—నవ్వడం సాగించాడు.

చెట్టియార్ ఘట్టం ముగిసినందుకు నిట్టూర్చాను. ఇంతలో ఆవిడా

లోపల్నుంచివొచ్చింది. చిరునవ్వుతో "ఎప్పుడు రావడం ?" అని అడిగింది.

అవొక అర్థంలేని ప్రశ్న.

"సామాన్లేవి ?"

అంత బొత్తుగా అర్థంలేని ప్రశ్న కాదేమో! "నేనొచ్చి నాలుగు రోజులైంది-సరిగ్గా చెప్పాలంటే మూడున్నర రోజులు. క్లబ్బుగదుల్లో విడిది. టెన్నిస్ మాచెస్ అవుతున్నాయిగా. మా పినమామగారు పెద్ద టెన్నిస్ ఆటగాడులే-నాతో ఆడితే వో సెట్టుకి రెండు గేములు కూడా గెలవలేడు-అయినా మామగార్ల ఆట మెచ్చుకోడం తప్ప యీ అల్లుళ్ళు ఏం చేయగలరు ? మీరు టెన్నిస్ ఆడతారా ?"

"అబ్బే లేదండి"

"సాయంత్రం ఉభయులూ రండి, నా ఆట కూడా చూద్దురుగాని, మొన్న విజయనగరంలో మన వాళ్ళంతా వచ్చారు. నాకు తెలుసులే ఎందుకు నవ్వుతున్నావో. చిన్నప్పుడు ఆటలూ పాటలూ ఏవీ రావు, ఈ ఆట ఎట్లాగొచ్చిందా అని. ఇల్వపురం జమీందారు తమ్ముడూ నేనూ స్నేహితులం. వాళ్ళు జర్మనీ నుంచి వో కోచ్‌ని తెప్పించారు. రాత్రిళ్ళు గ్యాస్‌లైట్లు పెట్టుకుని ఆడేవాళ్ళం."

"కాఫీ పుచ్చుకోండి——" కాస్త చప్పరించాడు.

"సామాన్లు క్లబ్బులో పెట్టాను. మీ రిక్కడున్నారని మొన్న తెలిసింది. సరే—చూసిపోదామని-చుట్టాల్ని చూడకపోతే మా ఆవిడ వూరుకోదు. మా మరదలు వోసారి నెల్లూర్లో వొక స్నేహితురాలింటి దగ్గర దిగిందట. నేనేమో గురవయ్యనాయుడుగారి చైర్మన్ ఎలక్షన్స్ సందర్భంలో నెల్లూరెళ్ళాను. మరదలుపిల్ల అక్కడుందని నాకేం తెలుసు ? అమెను చూడకుండా వొచ్చినందుకు మా ఆవిడ వారం రోజులు నాతో మాట్లాడలేదు-అంటే నేడయింట్లో ఆవిడతో ఉన్న పది నిమిషాలూనూ, నాకు ఏకాంతంగా ఇంట్లో ఉండే ప్రాప్తి లేదంటే నమ్మండి. పనీ లేదు, తీరుబడీలేదన్న సామ్యంగా ఉంది."

'మరదలుకి పెళ్ళి సంబంధాలు చూస్తున్నారా ?" అని అడిగింది ఆవిడ.

"ఆవిడ పెళ్ళి చేసుకుంటుంవీ ? నాకు నమ్మకం లేదు. ఆయన కట్నం దమ్మిడీ ఇవ్వనంటాడు. ఆ గడింపంతా ఏం చేస్తాడో, కర్మ! పీనాసని కాదు. అదొక ఆదర్శంట. మరి నాకెల్లా ఇచ్చాడు-కటికసొమ్ము పదివేలు. డిన్నర్‌కి నాలుగు వేలయిందిట-గవర్నర్‌గారి ఆంతరంగిక కార్యదర్శి అతిథిగా విచ్చేశాడులే. బాణాసంచాకి వెయ్యి, ఊరేగింపు, విమానానికి ఐదొందలు-ఆ రోజుల్లో-ఇప్పుడైతే, ఖర్చంతా వో యాభై వేలవును. మా కొచ్చిన పెళ్ళిబహుమతులు, వో ఐదారు వేలుంటాయి. కట్నాలద్వారా, సగంఖర్చు రాబట్టాడనుకో – నువ్వొచ్చావుగా – నీ కింకా అప్పటికి పెళ్ళికాలేదుగా. కట్నాలు పుచ్చుగోడం మనబోటి చదువుకున్న వాళ్ళది పొరబాటే-కాదన్ను. కాని సంఘంలో ఓ ఆచారం వున్న తర్వాత పాటించక తప్పుతుందా ? సరే-సరోజకి ఎంతసేపూ, చదువూ, సంగీతం– సినిమాలు, షికార్లు–పిక్‌నిక్‌లు. పెళ్ళి చేసుకోవాలన్న ఉద్దేశమేలేదు. ఏమాటకామాటే చెప్పాలి-మా ఆవిడ ఎంత చదువుకున్నదైనా, పూర్వ కాలపు మనిషే అనాలి. కాస్తంత దైవభక్తి, పూజ, పునస్కారం, యాత్ర, కొలువు–కలెక్టర్‌గారు వారిహయాంలో చేసిన దుండగాలు దురంతాలకి పరిహారార్థం పురాణకాలక్షేపం, గీతాపారాయణం ఆదివారం జరిపించి, పండితుల్ని సత్కరించే ఆచారం వుండబట్టే, అమ్మాయికి యిదంతా అబ్బిందనుకో. మనం తప్పించుకున్నాం. సరోజ కివి గిట్టవు, నాకుమల్లే. అందుకనే లోలోపల నే నంటే యిష్టం అనుకుంటా.'

'నువ్వు వంట విషయం చూడు' అన్నాను ఆవిడ నుద్దేశించి.

'నాకోసం వంటచెయ్యకండి. క్లబ్బులో డిన్నరుంది. కబుర్లు చెప్పు కుందాం. మీరువొంట కెవర్నేనా పెట్టుకోండి లేకపోతే ఇదేచిక్కు. ఇంటి కెవరైనా వస్తే, వారితో మాట్లాడే అవకాశం వుండదు. ఓసారి సేలం సబ్‌కలెక్టర్ – మళయాళి - భార్యాసమేతంగా గుంటూరొచ్చాడు. అత్తగారు

వొంటకనీ, అమ్మాయి కాఫీకనీ లోపలికెళ్ళారు పనిమనిషి పేరమ్మనిఒప్ప జెప్పి! ఆవిడకి కాలక్షేపం ఎల్లా జరుగుతుంది. పేరమ్మ ఏంమాట్లాడుతుంది? బుచ్చమ్మలా గుడ్లప్పగించి అల్లా నిలబడి చూస్తూ వుంది. పేరమ్మ ఫాషన్‌గా వుంటుందిలే. ఇదిగో ఈ సినిమాలొచ్చింతర్వాత అది మరీ సినిమాస్టార్‌లా తయారైంది. మాఆవిడా, సరోజ ఇచ్చిన జాకెట్లేవుంటాయి ఓ డజను. వీళ్ళకిసైజుకుదరక దానికి బహూకరిస్తూంటారులే. దాన్ని చూసి సరోజ అనుకుంది కాబోలు-ఇంగ్లీషులో సంభాషణ సాగించింది ఆవిడ. ఇదేమో నవ్విందట. మళ్ళా ఆవిడ ఇంగ్లీషులో ఏదో అడిగిందట. పేరమ్మ లోపలి కెళ్ళి చీపురు తీసుకొచ్చిందట వూడుద్దామనుకుని ఆవిడ కోపంతో చరచరా నడుచుకుంటూ బైటకెళ్ళి, మామగారి డ్రైవర్ని పిలిచింది. కార్లో ట్రావెలర్స్ బంగళా కెళ్ళిపోవడం-మామగారు పేరమ్మని మానిపిస్తానని బెదిరించడం, అది లబోదిబోమని ఏడవడం, నే వెళ్ళి సర్దుబాటుచేసి ఓ వంటలక్కని కుదర్చడం, వచ్చిన అతిథుల్ని ఎల్లా వినోద పరచాలో తెలియచెప్పడం – వారి కుటుంబచరిత్రలో ఒక అపూర్వఘట్టం.'

'కాసేపు నే అల్లా వెళ్ళొస్తాను. మీరు పత్రికచూస్తూ వుండండి' అన్నాను. ప్రశ్నార్థకంగా చూశాడు ముకుందం.

'సినిమాకా ?'

ఎట్లా కనుక్కున్నాడో చిత్రం! అసలు నిజంగా సినిమాకనే బైలు దేరాను. కాస్తంత అబద్ధంఆడాను.

'డాక్టర్ మాధవయ్యగారింట్లోంచి టెలిఫోన్‌చేసి, రాత్రికి ఏం ఆటాడుతున్నారో కనుక్కొందామని బైలు దేరాను' అన్నాను.

'అయినా, అమ్మాయిలేకుండా మీరొక్కరూ సినిమాకెళ్ళడం భావ్యమా చెప్పండి? మా కళ్యాణి వూరుకోదు. నేను వాళ్ళింట్లోవుంటే ఎక్కడికెళ్ళినా ఇద్దరం కలిసెళ్ళాల్సిందే'

'ఆమెను కూడా ఇప్పుడు మీతో తీసుకురాలే దేం?' అన్నాను.

'ఆవిడకి ఆటలుచూడ్డ మంటే విసుగు. లెక్చర్లు, క్లబ్బులు, పార్టీలు,

ఇవేవీ గిట్టవు. నాకివి లేకపోతే గడవదు. మళ్ళా సరోజ అల్లా కాదు...'

ఆయ నింకా మాట్లాడుతూనే వున్నాడు. నేను బైటికి నడిచాను. వెడుతూ మా పనివాడు ముసలయ్యని అయ్యగారికి ఏం కావాలో కను క్కుంటూవుండమని చెప్పి వెళ్ళాను. ఓగంటలో తిరిగొచ్చాను. ఆయన ముసలయ్యతో మాట్లాడు తున్నాడు. ముసలయ్య వింటూన్నట్లు లేదు. గోడకి జేర్లబడి కునికిపాట్లుపడుతున్నాడు.

'పోరంబోకుపొలం ఓఎకరం నాకప్పజెప్పు. రెండేళ్ళల్లో బంగారం పండిస్తాను. మామగారి దో రెండెకరం బీడుంది. జిల్లావ్యవసాయశాఖాధికారి స్నేహితుడులే. అతని సలహామీద కావల్సిన ఎరువు అదీ వేశాను. ఇవాళ పదివేలిచ్చి కళ్ళుమూసుకు కొంటామని ఎగబడుతున్నారు. నువ్వు రాత్రి పొలంకాపుంటావా?'

'మాట్లాడవేం ముసలయ్యా—నిన్నే అయ్యగా రేదో అడుగు తున్నారు'

'అంతే నెగండి' అని దూరంగా వెళ్ళి చుట్టముట్టించే తతంగం జరుపుతున్నాడు.

'ముసలయ్య మా మామగారి పొలం కాపు. కాస్తసాయంగా వుంటాడు. ఇప్పుడు పొలంపను లేమీ లేవని ఇక్కడికి పంపించారు' అన్నాను.

పొలంలో పామునిచూసి జడుసుకునే ఘటంలా వున్నాడు. పాముని పట్టడం నేరిస్తేగాని, ఎవరికీ పొలంలో పనిచేసే అధికారం లేదంటాను. ఓసారి రావులపాడులో సాయంత్ర చేలల్లోంచి వస్తున్నాం. కాలికేదో మెత్తగా తగిలింది. నేను గమనించలా.

రాత్రివెన్నెట్లో భోజనానికి కూర్చున్నాం. రెయ్యిమని నా విస్తరి ముందుగా వొచ్చి పడగెత్తింది. అందరూ అదిరి పొయ్యారు. 'మీరెవ్వరు భయపడకండి, నాకోసం వొచ్చింది' అన్నాను కిమిన్నాస్తి. కరణంగారి భుజంపైన సిల్కుకండువా తీసిచటుక్కున గిరవాటెట్టా. దాన్ని కరిచేసి

అందులో ఇరుక్కుపోయి, లుంగచుట్టుకుపోయింది. మరోసారి మైలవరం రాజాగారింట్లో...'

"విను ముసలయ్యా!" అని ఓ కేకేసి, స్నానాని కెళ్ళాను. వొచ్చాను. ఆయన ముసలయ్యతో ఏదో చెప్పుగుంటూ పోతున్నాడు, పులివేట విషయం.

"చెప్పండి. చెప్పండి" అంటూ కుర్చీలో కూర్చుని పత్రిక చదువు కుంటున్నాను.

'నాకెన్నాళ్ళనుంచో పులిని దగ్గరగా ఓఫోటో తియ్యాలని మనసు. అయ్యాపురం జమీందారుబావగా రొకాయన వొచ్చాడు. నలుగురైదుగురం అడవిలోకి ప్రయాణంకట్టాం. మేకని ఎరగాకట్టి చెట్లెక్కాం.

రెండుగంటలవరకూ నిశ్శబ్దం. తరువాత కోతులు కిచకిచలాడాయి. దూరంగా గర్జింపు వినబడింది. నే కూర్చున్న చోటునుండి మేక కనబడ టంలేదు. ఎప్పుడొచ్చిందో ఎప్పుడెళ్ళిందో—మేక అరుపు నిలిచిపోయింది. మరోగంటకి దిగిమెల్లిగా నడచిపొయ్యాం. ఒకమైలు వెళ్ళింతర్వాత మేక కళేబరంలోతినగా మిగిలిన భాగాలు ఆకులతో కప్పబడివున్నాయి. దాని చుట్టూ ఒక వల అల్లి, అల్లిక తాళ్ళని కెమెరాక్లిక్‌కి ముడేసి, కెమెరా దూరంగా పొదలోవుంచాం. పులివొస్తుంది. వలమీద కాలుపెడుతుంది. క్లిక్ మంటుంది. ఫోటో పడిపోతుంది. అదీ ఏర్పాటు. ఇంతలో ఏదో చప్పుడైంది. నాతో వున్నవాళ్ళు చెట్లెక్కేశారు. వెనక్కి తిరిగితినికదా, అరఫర్లాంగుదూరంలో నాకేసి వొస్తోంది. పెద్దపులి..."

"భోజనానికి లేవండి..."

అంది మా ఆవిడ. ముకుందం కథలో లీనమైపోయి, వినిపించు కున్నట్లు లేదు.

"అప్పుడేం చేశానని మీ వూహ? కదలకుండా వూపిరిబిగబట్టి, పులికళ్ళల్లోకి చూస్తూ స్తంభించిపొయ్యాను. అదికూడా అల్లానే నిర్ఘాంత పడి నా మొహంలోకి చూస్తూ నిలబడిపోయింది. చూపు తప్పించకుండా,

మెల్లగా ఒక్కొక్క అడుగే వెనక్కి వేసుగుంటూ, వో ఫర్లాంగు వచ్చే శాను. అది విసుగెత్తి పారిపోయింది..."

"భోజనానికి..."

"ఆనాడు నేను కదలివుంటే, పులికి భోజనం దొరికి వుండును. నువ్వీనాడు నాకు భోజనం పెట్టే అవకాశమే లేకపోను..."

ఒహొ హొ! హో! అంటూ ముకుందం దీర్ఘంగా నవ్వి, ఆ కుర్చీ లోంచి లేచి పడక్కుర్చీలో కాళ్ళుజాచి విశాలంగా పడుకున్నాడు.

పన్నెండున్నర దాటింది; నా కాకలిగావుంది. పుట్టంతా మునిగి పోయినట్లు ఆయన్ని వో ప్రశ్న అడిగాను.

"ఏమండీ-వేటకి వెళ్ళినప్పుడు, తుపాకులూ అవీ తీసుకెడతారు గదా, మరి పెద్దపులి మీదికివొస్తున్నప్పుడు తుపాకీ పేల్చలేకపోయారా?"

ముకుందంగారికి చాలా కోపం వచ్చింది ఆయన దగ్గర తుపాకీ వుండివుంటే ఆ క్షణంలో నన్ను పేల్చేసి ఉండును, ఆ ప్రశ్న అడిగి నందుకు.

"ఇంకా నయం-మీకు ప్రతివిషయం, తుపాకీ విషయం బొత్తిగా తెలీదనుకుంటూ తుపాకీ సరైన పొజిషన్‌లోకి తీసుకురావడానికి కొంత చేతులకదలిక అవసరం. ఏ మాత్రం కదలిక జరిగినా, వెంటనేవొచ్చి మీదపడి చంపేస్తుంది పులి. అంచేత దాని కళ్ళల్లోకి చూస్తే అది భయపడి పారిపోతుంది. అట్లాంటి సందర్భాలలో మన తెలివి పనిచెయ్యదు. శరీరం బుద్ధికి తెలీకుండా, తనజాగ్రత్త అది పడుతుంది. ఓసారి అరవిందుని ఆశ్రమానికెళ్ళాం-కళేబరస్వామితో.

రాత్రివిడిదిలో మంచాలున్నాయి, పక్కలేసి సిద్ధంగా. స్వామీజీ వట్టికింద సంచీ దిండుగా పెట్టుగుని పరున్నాడు. మంచంమీదికిరండి అన్నాను. వద్దు, అందరం కిందే పడుకుందాం అన్నాడు. ఆయనమాట తీసెయ్యలేక, అట్లాగే పడుకున్నాం. ప్రొద్దున్నే అక్కడవాళ్ళొచ్చి మంచం సర్దారు. జానెడు పొడుగు జెర్రి, దిండుకింద విశ్రమిస్తోంది.

అంటే ఏం జరిగిందన్నమాట. మంచంమీద అపాయం వుందిస్మో అని ఆయన శరీరం పసికట్టిందన్నమాట – పంచేంద్రియాలు కాక, ఆరోశక్తి అన్నమాట. అరవిందుడు వ్రాశాడు కూడాను–ఒక యోగి హిమాలయ పర్వతాలలో తపస్సుచేసి ఆత్మశుద్ధి సాధించినందువల్ల లోకాని కేం ఉపయోగం అనివొక దొరగారు ప్రశ్నించారట. అప్పుడు ఆయన అన్నాడుట..."

"చాలా పొద్దోయింది. మీకోసం క్లబ్బులో అందరూ కనిపెట్టుకుంటారేమో" అన్నాను.

"నాకోసం ఎవ్వరూ కనిపెట్టుకోరు. ఓ ఐదునిమిషాలు చూస్తారు - హాయిగా తింటారు. ఎవరాకలి వారిది..."

"మరి మీ కాకలిగా లేదా ?"

"ఆ ప్రశ్నకి సమాధానం మా కళ్యాణే చెప్పాలి. ఓసారి ఆమె నేనూ వాళ్ళ చుట్టాలింటికి పెళ్ళి కెళ్ళాం..."

"నా కాకలేస్తోందండి – మీరు లేవండి – భోజనాల దగ్గర మాట్లాడుకుందాం" అన్నాను. ముకుందం మాట్లాడుతూనే వున్నాడు. నేను భోజనానికి లేచి ఆయన్ని కుర్చీలోంచి లేవదీయబొయ్యాను.

"కొందరిలా నాకు వేళకు భోజనం అనే పట్టింపులేదు. అప్పుడప్పుడూ భోజనం మానేయ్యడం మామూలే–మీరు కూర్చువి కానివ్వండి. ఏం? ఎంతవరకూ చెప్పాను! ఆ–కళ్యాణి నేనూ పెళ్ళాం. వడ్డించారు..."

"వొడ్డించాను. లేవండి–" అన్నది ఆవిడ.

"మీరిద్దరు కూర్చుని తింటుంటే చూడాలని వుంది. కూర్చోండి."

వంటిగంటన్నరైంది. మేం లేచాం. తాంబూలం వేసుగున్నా. ఆయనకాస్త మజ్జిగమాత్రం పుచ్చుకున్నాడు. మైసూరులో తాంబూలాన్ని గురించి చెప్పడం మొదలెట్టాడు. నాకు నిద్రొస్తోంది. ఆదివారం వోగంట నిద్రించడం నా కలవాటు. ఆవులించాను. కాసేపు విశ్రమిస్తారా – అని స్వగతంగా అడిగి, గదిలో పక్కనద్దాను. మైసూరు దసరా ఉత్సవాలని వర్ణిస్తున్నాడు.

"ఇల్లా ఉపవాసాలుంచే మీరు నీరసించిపోరు? ఆకలితో కబుర్లేం చెప్పగలరు? అని తెగించి అడిగేశాను.

"ఆ ప్రశ్నే మా కల్యాణి అడుగుతుంది. చాలా మందికి నిద్ర, తిండి, అవసరం. నా కవంత ముఖ్యంకావు. ఓసారి రాజారావుగా-ంట్లో పేకాటకి రూర్చున్నాం..."

ఇంతలో నీళ్ళల్లో మునిగిపోతున్నవాడికి తాడు దొరికినట్లు, పక్కింటి కుటుంబరావు, పత్రిక తీసుకెడదామని వచ్చాడు. ఒకర్ని ఒకరికి పరిచయంచేశాను. కుటుంబరావు స్కూలు మేస్టరు. ముకుందం గారు ఆయన చదువు, మేస్టర్లు, పరీక్ష అనుభవాలు చెప్పడం లంకించు కున్నాడు. అమాయకుడు కుటుంబరావు ఆ యింద్రజాలంలో చిక్కు కున్నాడు. నేవెళ్ళి వెన్ను వాల్చాను.

లేచేటప్పటికి మూడు కావొస్తోంది. కుటుంబరావు లేడు. మా ఆవిడుంది. సరోజ చదువు విషయం చెబుతున్నాడు.

"స్త్రీల ముందు అనకూడదుగాని, పురుషుణ్ణి ఘనకార్యాలకి ప్రేరేపించేది స్త్రీలే. ఆ స్త్రీలే ఘనకార్యం కాస్తా సాధించనీయకుండా ఆటంక పరుసారు. లా కాలేజీలో సుశీల అని ఉండేది. ఆమె మెప్పుకోసం మలయప్పన్ అనే మలయాళీ సోదరుడు బాగా చదివి యూనివర్సిటీ వస్టుగా ప్యాసయ్యాడు. ఎమ్.ఎల్. డిగ్రీ తెచ్చుకున్నాడు. వారిద్దరూ వివాహం చేసుకున్నారు. అంతే—అతన్ని కోర్టు కెళ్ళనివ్వదు—ఇరవై నాలుగ్గంటలూ తననిచూస్తూ, మెచ్చుకుంటూ, వినోదించమంటుంద. ఏమైందని మీ ఊహ—ఆరునెలల్లో ఆమెని విడచిపెట్టాడు..."

నవ్వడం సాగించాడు. ఆవిడను కాఫీ విషయం చూడు లోపలికి పంపించాను.

"మీరు మొహం కడుక్కోండి. కాఫీ తాగి, అల్లా బైలుదేరం మీ క్లబ్బులో ఆటకి టైమవుతుందేమో..." అన్నాను.

"నేను మాచెస్‌లో ఆడటం అనేది దైవాధీనం. వాళ్ళకీ తెలుసు. అందుచేత నాకు ప్రతిగా మరో ఆటగాడు లేకుండా నన్ను పంపించరు. ఓసారల్లాగే ఊటీ వెళ్ళాం..."

నా గుండెలో రాయి పడింది. ఈ లెక్కని బైటకెళ్ళడానికైనా, మరోపని చూసుకోవడానికైనా వీల్లేదు. ఏం చెయ్యను.

"వారి నావిధంగా భంగపర్చడం భావ్యంకాదు. పదండి నేనూ వస్తాను. మీ ఆట చూశ్చేదు..." అన్నాను.

"నా ఆట ఇప్పుడేముంది ? ఈ పూట చూడకపోవడమే మంచిది. నే ఆడకపోవడం నాకూ మంచిదే. అదుగో ఆ రాజమండ్రిలో చెయ్యి, కాలూ, రెండూ ఒకేసారి బెణికాయి. డాక్టర్ నెలవరకూ కదల్చక పోవడం మంచిదన్నాడు-నాకు వీలుపడుతుందా. వీళ్ళు నువ్వొస్తేకాని వల్లకాదని చంపుకుతింటారు. కాళ్ళూ చేతులూ మెదణ్ని పనిచెయ్య నివ్వవు. ఆఖరికి బ్రిడ్జి కూడా యివాళ ఆడలేను."

"పోనీ, మనం వెళ్ళిచూస్తూ వాళ్ళకి హుషారిద్దాం-"

లాభం లేకపోయింది. పరమశివన్ అనే తమిళ సోదరుడి వృత్తాంతం చెబుతున్నాడు. నే నిప్పుడంతా ఏకరువు పెడతానని భయపడ కండి. అది నా తరంకాదు. ఆ పూట ఆయన మా యింట్లో ఉండగా మాట్లాడినవన్నీ పూరాగా వ్రాయాలంటే సవాలక్ష గ్రంథం అవుతుంది. నేనేకాదు-ఎవ్వరికీ అది సాధ్యం కాదు. ఆయన ఒక ఏడాదిలో మాట్లా డినవాటిని వ్రాయాలంటే, ఓ డజనుమంది చిత్రగుప్తులు, తమ అసి స్టెంట్లతో ఐదారు సంవత్సరాలు కృషిచేస్తే సాధ్యపడుతుందేమో-అదేనా షార్టుహాండులో వ్రాయడం వారికి వచ్చుంటే మాట. ముకుందం పొట్టిగా, సన్నగా ఉంటాడు. గిరజాల జుట్టు, చామనచాయ, గడ్డం కింద మచ్చ, కళైన మొహం, కంఠం సన్నంగా ఉంటుంది. స్ఫుటంగా ప్రతి అక్షరం సాగదీస్తూ నోరారా ఉచ్చరిస్తాడు. అతనొక ధ్వని ప్రచారక యంత్రం. ఒక భాషా సంస్థ. కాలం నిర్జీవోనట్లు, గోళాల

పరిభ్రమణం ఆగిపోనట్లు, ఆయనలో ఉద్భవమయ్యే ధ్వనివరంపరలకి విరామం లేదు. అడ్డు ప్రశ్నలు, ఊకొట్టడాలు ఆయనకక్కరలేదు. వింటున్నట్టు తల పంకించడంతో నిమిత్తంలేదు. మనం చూస్తున్నప్పుడే సూర్యుడు కాంతికిరణాలను ప్రసారం చేస్తున్నాడా? మనం కోరినప్పుడే నిండు చంద్రుడు దర్శనమిస్తున్నాడా? ప్రియురాలొచ్చే వరకూ ఆగమంటే పువ్వు పరిమళించడం మానుకుంటుందా? నిద్ర పోయిన కాసేపు మౌనంగా ఉంటాడనుకుంటున్నారా? అది భ్రమ. మేఘం వెనకాల సూర్యుడు వెలుగుతూ ఉంటాడు. మనకి కనబడదు శిఖరం వెనుక చందమామ మనకి కనబడకపోవచ్చు. అంతమాత్రంచేత లేదంటామా! ఎడారిలో వాడిన పువ్వు, సంద్రాల లోతుల్లో ధగధగ మెరసే వజ్రం-మనకేం తెల్సు? మనం ఎంత అల్పులం! ఎక్స్‌రే యంత్రాన్ని ప్రయోగించి నిద్రిస్తుండగా ఆయన మెదడును పరికించిన ఒక మహాకావ్యం అల్లుతూ ఉంటుంది ఆ మెదడు. మెదడులో ధ్వని కదలికని వ్రాసే పరికరాన్ని యే శాస్త్రజ్ఞుడో ముందుముందు తయారు చేసి తీరతాడు. అప్పుడింక ఆధునిక యుగంలో మహాకావ్యాల లోపం ఉండదు.

ఆరు కావొస్తోంది. ముకుందంగారు స్వీయగాథలో పడ్డాడు. అతని భార్య కళ్యాణి ఏ విధంగా ప్రేమించి పెళ్ళిచేసుకున్నదీ—పొరబాటు—ఏ విధంగా పెళ్ళి చేసుకున్న తర్వాత, ప్రేమించడం మొదలెట్టిందీ. అదే శాశ్వతమైన ప్రేమ—ప్రేమంటే ఏమిటి? ఒక అర గంట లెక్చరిచ్చాడు, సొమ్మసిల్లిపొయ్యాను. ప్రేమలో వైరాగ్యానికి తావుందా? పవిత్రమైన ఈ యంత్రయుగంలో సాధ్యమా? మార్క్సు సిద్ధాంతాలకి ప్రేమకి ఉన్న సంబంధం ఏమిటి? ప్లేటో ఏమన్నాడు? వేమన్న పద్యం చూడండి. వాల్మీకి రామాయణం తీసుకోండి. పోతన్న భాగవతం తియ్యండి. అమెరికా విడాకుల తఖిసీళ్ళు—మాస్కోలో విడాకుల సంఖ్య—సంతాన నిరోధం ఆవశ్యకత—పెరిగిపోతున్న జనాభా—మన దేశంలో మూఢాచారాలు.

"నాకు పిల్లలు లేరు. వుండరు కూడా. ఉంటే నా జీవితంలో ఉన్న ఆనందం వారికి సాధ్యం కాదు. ఆస్తి పంచుకుంటారు. ప్రేమ పంచుకుంటారు, సంతోషం పంచుకుంటారు. వారికి సంతానం కలుగుతుందిగా! నేను తాత నవుతాను. కళ్యాణి అమ్మమ్మవుతుంది. వారి సంతానం బలహీను లవుతారు. ఆస్తి సన్నగిల్లిపోతోంది. వారి సంతానానికి తినేటందుకు ఉండదు. సంఘ పతనం..."

ఆయన సంతానం కూడా ఆయనలాగే తయారవుతే, ఇంకేమన్నా ఉందీ? ఊహించలేకపొయ్యాను.

"నా సంతానం మూగవాళ్ళవుతారు—అమ్మ పోలికే ఐతే—ఎందుకంటారా? కళ్యాణి అంత నాలా మాటకారి కాదు. ఆవిడ కంఠ మాధుర్యం ఒక అపూర్వ అనుభవం..."

ఏడు కావస్తోంది. ఏమిటీ చెయ్యడం? ఆవిడ కాస్తంత టీ, దోసెలు తెచ్చింది. ఆయన దోసెలు తిన్నాడు. నా పళ్ళెంలోనివి కూడా దగ్గరకు లాక్కొని కబుర్లు చెబుతూ తినేశాడు. టీ త్రాగాం. ఇంతలో దైవం కటాక్షించాడు. ఫైరింజన్ మా గుమ్మం ముందునుంచి చప్పుడు చేస్తూ వెళ్ళింది. ఎక్కడో ఇళ్ళు తగలడుతున్నాయంటూ ముసలయ్య వచ్చాడు. రండి చూసొద్దాం" అంటూ ఆయన్ని లేవదీసి మెట్ల కిందికి నడిపించాను. వెనక అహోబలరావుగారిల్లు తగులడిన చరిత్ర చెబుతున్నాడు. నడుచుకుంటూ వెళ్ళాం. క్లబ్బుకి కొంచెం దగ్గరలో గుడిసెలు తగలడుతున్నాయి. క్లబ్బులో వాళ్ళు కూడా చూడ్డానికొచ్చారు. ఆ ఎరుగున్నవాళ్ళ గుంపులో కలిసిపొయ్యాడు. మళ్ళా రాత్రి కనిపిస్తానన్నాడు. తప్పకుండా అన్నాను. ఆ క్లబ్బు మిత్రుల్ని పట్టుకున్నాడు. అంతా ఆ ప్రవాహంలో కొట్టుకుపొయ్యారు. నే యింటి కొచ్చేశాను.

ముకుందాన్ని మళ్ళా మూడేళ్ళ తర్వాత కలుసుకున్నాను. ఆ రోజుల్లో పెద్ద గాలివానొచ్చి రైళ్ళు నిలిచిపోవడం జరిగింది. రైళ్లు తిన్నగా లేవని మా ఆవిడ పుట్టింట్లో ఉండిపోయింది. కారియర్ భోజనం తప్పింది కాదు.

సాయంత్రం ఆరైంది. రైళ్ళ విషయం కనుక్కుందామని రైలు దేరుతుండగా మెట్ల మధ్యలో ముకుందం ఢీకొన్నాడు. ఏడాది క్రితం ముకుందం భార్య టైఫాయిడ్ జ్వరం వచ్చి చనిపోయింది. సానుభూతి జాబు వ్రాశాను. కలుసుకోడం ఇదే మొదటిసారి. పరామర్శకి వాక్యాలు కూరుస్తుండగా ముకుందం వాటిని ఉచ్చరించే అవకాశం యివ్వకుండా తనే సాగించాడు.

"ఈ రోజుల్లో రైళ్ళు మరీ అధ్వాన్నమయ్యాయనుకో. ఆలస్యంగా రావడానికి, నిలిచిపోవడానికి యీ తుఫాను ఓ సాకు. ఉత్తప్పుడు ప్రతి రైలు ఓ రోజు ఆలస్యం. తుఫానొస్తే ఓ వారం అంతే తేడా. గుంటూరు నుంచి బండి దిగాను. ఎక్స్‌ప్రెస్ పది గంటలు లేటు. సరే ఆ ప్లాట్‌ఫారంలో యిరుక్కుని ఏ జబ్బో తగిలించుకోడం ఎందుకని, మిమ్మల్ని చూసిపోదామని వచ్చాను. అర్జంటుగా ఢిల్లీ కెళ్ళాలి.

"మా ఊళ్ళో రైతులంతా–భూముల్ని గురించి ఓ కొత్త శాసనం వస్తోందిగా–దానిలో తికమకలు చాలా ఉన్నాయిలే. వారికున్న అభ్యంతరాలని ఓ పిటీషన్ ద్వారా, ఢిల్లీలో కేంద్ర ప్రభుత్వానికి విన్నవించమని, ఆ పిటీషన్ వ్రాయించి, ఆ నాయకత్వం నా మీద పడేశారు. ఇల్లాంటివి చాలా చేశానులే. వెనక గుర్నాధంగారి ఇంటి తగాదా–ఢిల్లీకి తీసుకెళ్ళాను. ఇళ్ళశాఖవారు నే ఎత్తిన లా పాయింట్లకి ఖిన్నులై, సుప్రీమ్ కోర్టులో ప్రథమస్థానం వహించనందుకు ఆశ్చర్యపడ్డారు. మన కెక్కడ తీరుతుంది. అయినా, కళ్యాణి పోయింతర్వాత, నా పాత వ్యాపకాలన్నీ మానుకున్నాను. జీవితం పట్ల నా దృష్టే మారిపోయింది. నే నిప్పుడేవీ పట్టించుకోడంలేదు. ఇప్పుడు గూడా ఆ రైతులంతా చంపుకుతింటే, సరే పరోపకారార్థం ఈ శరీరం అన్న సామ్యంగా, ఊఁ అన్నాను. ఇంక ఓ విషయం నెత్తిన వేసుకున్న తర్వాత, దానంతు తేల్చేవరకూ ఊరుకోనని నీకు తెలుసుగా!"

"పాపం కళ్యాణి..."

"ఏం పాపం పుట్టింతర్వాత చావు తప్పదు కదా. అన్ని మంచి లక్షణాలుండి, ఒక ఆదర్శప్రాయమైన వ్యక్తిగా, నలుగురికీ కన్నెర్రగా ఉన్న కళ్యాణి చాలాకాలం బ్రతకదని లోలోపల అనిపించేదిస్మా! అంత మంచిగా ఉండకూడదనుకో—ఈ ప్రపంచంలో దేవుళ్లు ఓర్చలేరుట. గ్రీకు పురాణ గాథలు..."

"రండి లోపలి కెడదాం..."

"ఎవ్వళ్ళం టైఫాయిడ్ అనుకోలేదు. అరడజనుమంది స్పెష లిస్టులు పూనుకున్న రోగి ఆయువు మూడినట్లే. ఇరవైరోజు లయ్యాక ఫలానా అని నిర్ణయించారు. కాంప్లికేషన్ ఉందేమో చూడండన్నా—నా మాట పెడచెవినపెట్టారు. ఆమెకు తెలుసు బ్రతకనని. నన్ను దగ్గరకు రమ్మంది. మంచం బద్దీమీద కూర్చున్నాను. నా రెండు చేతులూ పట్టుకుంది. ఆమె కళ్ళు చాలా పెద్దవిలే. నీరసించిందేమో, మరీ పెద్దవిగా కనిపించాయి. కన్నీరుతో, "మీరు సరోజను చేసుకోండి" అంది. నాకు ఏడుపులో నవ్వొచ్చింది.

"చనిపొయ్యేవారికి బ్రతికున్నవారంటే అంత తాపత్రయం ఉంటుంది కాబోలు!"

"రండి..."

"లోపలికెందుకు-బైటకెళ్ళి టీ తాగొద్దాం. ఈ ఆడాళ్ళున్నారే—భలే అసాధ్యులబ్బాయ్. వాళ్ళకి కొన్ని విషయాల్లో దూరదృష్టి ఉంది. ఏకాంతంగా మొగాడు పొయ్యే పోకళ్ళు వేసే వేషాలు, ఇట్టే పసిగట్టేస్తారు. వాళ్ళింటి పక్కన మోహనరావని ఉండేవాడు. గౌరవమైన కుటుంబీకుడు. వాళ్ళింట్లో పనిచేసే పిల్ల ఓసారి కళ్యాణితో అన్నదిట ఏదో మాటల సందర్భంలో "అమ్మగోరు చాలా మంచివారండి" అమ్మగోరంటే మోహనరావు సతీమణి అన్నమాట. ఆ రాత్రి కళ్యాణి నాతో అంది—ఏమందో తెలుసా ? "ఆ పసిపిల్లకి ఆరోమాసం—తండ్రి మోహనరావు ఆ పసిపిల్లని తీసుకెళ్ళిపొయ్యాడు. ఎందుకు చెప్పొచ్చానంటే, కళ్యాణి విషయం యిట్లే గ్రహించింది."

ఇటు రండి—రోడ్డు నష్టంగా లారీలు అపేసు" అని అయన్ని లాగాను. హోటలు కెళ్ళాం.

"సరోజ పెళ్ళంటే ఇష్టంలేనట్లు, మొగాడంటే గిట్టనట్లు నిర్ల క్ష్యంగా ప్రవర్తిస్తుందా—అదంతా నటనే ననుకో. నన్ను తెగ వేళా కోళం చేసేదిలే. సరోజ వాళ్ళక్కంత చక్కందికాదు. కాని అంత కంటె గడసరి—నేనో—ఉత్త అమాయకుణ్ణి. మా ఆవిడన్నట్లు, సరోజని గురించి నాకే యితర అభిప్రాయం, అప్పుడూలేదు. ఇప్పుడూ లేదు. కళ్యాణిని తృప్తిపరచడం కోసం సరేలే, అని వాగ్దానపూర్వకంగా అన్నాను. కాని నాకు నిజంగా ఆమెను చేసుకోవాలన్న ఉద్దేశం లేదు. ఎందుకంటావా, మనది బిజీలైఫ్—పెండ్లికి ప్రేమకి టైంలేదు. ఈ ఆడాళ్ళున్నారే, మన జీవితం అంతా వారి సమక్షానా, వారి ఆరాధనలో గడపమంటారు. నా కది సాధ్యం కాదు. సరోజ తల్లి కూడా ఆమెను చేసుకోమని చాలామందిచేత చెప్పించింది. ఆఖరికి ఏమైందో తెలుసా?"

టీ త్రాగి మళ్ళీ ఇంటివేపు బైలుదేరాం. అతను మాట్లాడుతూనే ఉన్నాడు. నా ఆలోచనలు నేను వేరే సాగిస్తున్నాను. ముకుందానికి వస్తు సేకరణలో పక్షపాతం లేదు. అతని కన్ని వస్తువులూ, ఉదంతాలూ, వ్యక్తులూ సమానమే. అన్నీ అతని వాగ్దేవిని సమంగా పురికొల్పి, సమమైన తీవితో ధ్వనులను ప్రసారం చేస్తాయి. భార్య మరణం, సరోజ పెళ్ళి, గుర్నాథంగారి ఇల్లు, హాకీ ఆటలో రంగయ్యనాయుడు ఓటమి, కిళ్ళీలో సున్నం ఎక్కువవడం ఇవన్నీ అతనికి మహాకావ్యాలే. ఎక్కువతక్కువలు లేకుండా వేదాంతిలా నిశ్చల మనస్కుడై వితర్కి స్తాడు. మౌనం యోగి తపస్సు; భాష, ధ్వని ఇతని తపస్సు, ఊహ ద్వారా ఒక ప్రపంచాన్ని శాసించాడు. ఆ జగత్తుకి అతను చక్రవర్తి. మనం అంతా అతని ప్రజలం. రాజుగారు మాట్లాడేటప్పుడు అందరూ నిశ్శబ్దంగా ఉండాలి.

అతను చవిచూడని అనుభవం లేదు – లోనుగాని ఉద్రేకంలేదు.

జయించని తృష్ణలేదు; తరచిచూడని రహస్యానుభవం లేదు, కనని కలలేదు. ఆడని అబద్ధంలేదు. తెలియని సత్యంలేదు. రాజ్యవిస్తీర్ణము, సరిహద్దులు తెలియని చక్రవర్తిలాగా, భార్యమరణంతో అతను మానసికంగా పెత్రేగి పోయ్యాడు. జీవితగమనం వేగం తగ్గి నిదానంగా జరుగుతోంది–కాని, అతని ఆరాటం, ఆవేదన వేగిరపడుతున్నాయి. ఏదో సిద్ధాంతం, సందేశం, జీవితదృక్పథం అల్లి మనల్నందర్నీ అందులో చిక్కించుకుని స్థిమితపడ దామని అతనికి తెలియని సంకల్పం లాగుంది. ఏదో భార్యపట్ల చిన్న అపచారంచేశాడు. దాన్ని తనకుతాను సమర్థించుకుని, పోయినవ్యక్తి క్షమాపణ పొంది, సమాధానపడటంకోసం, ఈ వేగిరపాటు–ఈ భాషా ప్రయుక్త వ్యక్తి స్వైరవిహారం, యీ నాదబ్రహ్మ స్మశాననృత్యం, ఈ వాగ్గేయకారుని చివరి ముక్తాయింపు.

"ఏమైందని అడగవేం?" అంటున్నాడు పెర్రివాడు. అతన్ని గూర్చిన ఆలోచనలు నన్ను వేదాంతశిఖరానికి చేరేశాయి. ఏది ఏమైతే ఎవరిక్కావాలి. అనంతవిశ్వంలోని ప్రపంచనిశ్శబ్దాన్ని ఒక్కమాటతో, ఒక్క అర్థశూన్యమైన ధ్వనితో ప్రాచీన ప్రశాంత గాంభీర్యాన్ని భంగ పరుస్తున్నాడా ఈ వెర్రి మానవుడు!

పైకి మాత్రం 'చెప్పండి' అన్నాను.

"సరోజ నన్ను చేసుకోనని కచ్చితంగా చెప్పేసింది. ఎందుకనీ? ఆమెకు నామీదవుండబట్టేగా. తనకు నామీద వున్న ప్రేమని మరోలా ప్రకటించలేకపోయింది. అక్క బ్రతికివున్నప్పుడు ఎంత గారం, ఆప్యా యత, ఆదరణ, స్నేహం చూపించిందనుకున్నావ్! అది వెన్నెలరాత్రి. కళ్యాణి రంగమ్మగారితో గుళ్ళోకెళ్ళింది. అప్పుడే క్లబ్ నుంచి వొచ్చి స్నానంచేసి, డ్రెస్ చేసుకుంటున్నా. గదిలో కొచ్చింది సరోజ. అద్దంలో నా మొహంకేసి చూసింది.

"నువ్వు ఆలయానికి వెళ్ళలేదా?" అని అడిగా.

"ఆ ప్రశ్న నేనే అడుగుదా మనుకుంటున్నా-నా కేం కోర్కెలు లేవు" అన్నది. "అంటే?" అన్నాను.

"పిల్లలు కావాలని ఏొక్క భార్యమాత్రం ప్రదక్షణాలు చేస్తే లదు. నువ్వూచేయాలి" అంది. "మంచి భర్తని ప్రసాదించమని నువ్వూ కోరుకోవచ్చుగా" అన్నాను దెప్పుతూ. "నాకల్లాంటికోర్కెలూలేవు, నమ్మకాలూలేవు" అంది. "అంతా మానవ ప్రయత్నమేగాని దేముడి ప్రమేయం లేదంటావు. నీనమ్మకాలు, ఆదర్శాలు, ప్రయత్నాలు వాటి ఫలితాలు కాస్తంత ఈ అల్పుడి చెవిని పడెయ్యి" అన్నా వేళాకోళంగా.

"ప్రయత్నం చెయ్యటిదే నాకు పెళ్ళికాదంటావ్?"

"పిల్లలకోసం మా ప్రయత్నంలాంటిదే అనుకోకూడదూ?" అని, తువ్వాలు బుజాన వేసుకుని డాబామీదికి నడిచాను. నా సంభాషణంతా అద్దంలో సరోజతోనే. నాకేసి అదోలా చూసింది – అట్లాగనిపించింది పదినిమిషాల్లో డాబామీదికి తనూవొచ్చింది.

"కోపం వచ్చిందా?"

"ఎవరిమీద?"

"నామీద"

"ఎందుకు?"

"మొగాళ్ళకెందుకు కోపమొస్తుందో నాకేం తెలుసు?"

"ఇంకా నీకే వచ్చింది కోపం, అవునా?"

"ఎందుకో?"

"స్త్రీ మనస్సు తెలియ బ్రహ్మతరంబా?"

"పోనీ తెలిసినంత వరకూ చెప్పు–భయంలేదు. రోడ్డు వెంపు చూస్తున్నాలే. అక్కయ్య రావడం లేదు" అన్నది. నాకు నిజంగా కోపం వచ్చింది. "అక్కయ్యంటే నువ్వుభయపడాలి–నిమనస్సులో ఏదోవుం " అన్నాను. సరోజకి కోపం వచ్చినట్టుంది. అక్కయ్య ముందు ని

అమాయకపు అవతారం నాకు తెలియదనా-అక్కయ్యకి తెలీదనుకోకేం-నా మనస్సులో ఏదో వుందిట. మహాకనిపెట్టావులే-నామనస్సులో ఎవరున్నా లేకపోయినా, నువ్వుమాత్రం లేవు" అని కిందకివెళ్ళిపోయింది. అది ప్రేమ కాకపోతే, ఏమిటంటావ్?"

ఇంటికి చేరుకొని వరండాలోకి కుర్చీలు లాక్కుని కూర్చున్నాం. భోజనానికి హోటలికి వెళ్ళడమా, కారియార్ తెప్పించడమా అన్న ఆలోచన సాగనియ్యకుండా మళ్ళీ మొదలెట్టాడు. ఇంక రాత్రంతా జాగారమే. ఏ పరమాత్మకి నాపైన కటాక్షం కలగదూ! నేను మాట్లాడడం మొదలెడితే!-ఒక యత్నం చేశా.

"చూడండి-మీరు సరోజపై మరికొంత అప్యాయత కనబరిస్తే..."

"చాల్లెండి; సరోజవిషయం మీ రెరుగరు కొందరు స్త్రీలంతే. వాళ్ళని తిట్టి, హింసించి, బాధపెట్టినవారిని గాని కనికరించరు. ఓసారి..."

ఇంక లాభంలేదు. ఆ యత్నం విరమించి, చంద్రుడికేసి చూస్తూ నా పగటికలలు కంటూ కూర్చున్నాను. పగటి కలలు మానవహృదయానికి స్వర్గంలాంటివి. నాకుక్రాస్‌వర్డ్ ఫజిల్‌లో ఇరవైవేలొస్తే ఎల్లా ఖర్చుపెట్టేదీ వూహించుకుంటాను. సరోజను- నే చూళ్ళేదనుకోండి - వివాహమాడి వుంటే నా జీవితమెల్లా వుండేదీ వూహించుకుంటాను. ముకుందం కబుర్లని కళ్యాణి ఎల్లా భరించగలిగిందో? ఆమె దగ్గరకూడా యిల్లాగే మాట్లాడతాడా - ఆవిడ వింటుందా? ఇప్పుడు ముకుందం ఏమంటున్నాడో విందామని పగటికలని తుడిచేసి, అతనికేసి చూశాను.

"మా ఆవిడంటుంది-నేను తనదగ్గర వున్నప్పుడుకంటే దూరంగా వున్నప్పుడు తనకి దగ్గరగా వున్నట్లు వుంటుందిట. అల్లాగంటుందిగాని, దూరంగా వుంటే "ఎప్పుడొస్తారు?" అని టెలిగ్రాంమీద టెలిగ్రాం లిస్తుంది. దగ్గరగావుంటే ఎప్పుడు వెడతాడురా బాబూ - అన్నట్లుగా ప్రవర్తిస్తుంది - మీకూ అల్లాగే అనిపిస్తోంది కదూ?"

ఒక్కసారి ఉలిక్కిపడి కుర్చీలోంచి లేచాను.

"ఇంకా నయం—ఎంతమాట!" అన్నాను. ఇంక నాకు ఆ రాత్రికి మోక్షం లేదు. హాయిగా ఆయనకి లొంగిపోయి, ఆ ధ్వని సాగరంలో పూర్తిగా మునగడం మంచిదనుకుంటూండగా, దైవం నా భక్తికి మెచ్చి పరంధామయ్యని పంపించాడు. తుపానులో రైలు దొరక యిరుక్కుపోయిన వ్యక్తులలో పరంధామయ్యే ఒకడు. నాకు స్నేహితుడు. ప్రసిద్ధ రచయిత. ఆయన్ని ముకుందానికి వప్పగించి నేను కాస్తంత స్వేచ్ఛ పొందవచ్చు.

"పరంధామయ్యగారని— 'హాయిగొల్పే హానొలులు' అనే యాత్రా గ్రంథం వ్రాశారు. అమెరికా, జపాను దేశాలు తిరిగొచ్చారు" అని ముకుందానికి పరిచయము చేశాను.

"అయ్యో! ఆయన్ని ఎరక్కేం... వెనకటికి ఓసారి చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారికి సజ్జాపురంలో సన్మానం తలపెట్టారు. మా మావ గారి తండ్రి అధ్యక్షులుట......"

పరంధామయ్యే హతం అనుకుని కారియర్ విషయం చూస్తానని బైటకొచ్చి, నిశ్శబ్దంగా గాలి పీల్చానని రహస్యంగా ఒప్పుకుంటున్న స్వార్థపరుణ్ణి.

బస్‌స్టాండు దగ్గర గాని ముసలయ్యకి చుట్ట కాల్చుకునేటందుకు సరైన స్థలం దొరకలేదు. అక్కడ దొరికాడు. తీసుకొచ్చి, కారియర్ యిచ్చి హోటల్‌కి పంపించాను. ఎనిమిది కావొస్తుంది. పరంధామయ్య— ఆ సాహిత్య సభల్లో గంటలు గంటలు ఉపన్యసించే పరంధామయ్య— ఆ ప్రవాహంలో వుక్కిరి బిక్కిరవుతున్నాడు. నన్ను చూడగానే లేచాడు.

"యింతకి యీయనెవరో పరిచయం చేశావు కాదు" అన్నాడు కాస్త కోపంగా. సమాధానం చెప్పే ప్రాప్తి నాకు లేదు. ముకుందం దొరక పుచ్చుకున్నాడు.

"నేనూ రచయితనే — ఓ వెయ్యి పేజీల గ్రంథం వ్రాశాను"

"ఎప్పుడూ చెప్పారు కారేం. అచ్చయిందా?" అన్నాను ఎల్లాగో సందుచేసుకుని.

"అంటే బుర్రలో వ్రాశాను. కాగితం మీద వ్రాయడం ప్రారంభించాలి. చాలా పెద్దగ్రంథం, రెండు వేల పేజీలు పట్టొచ్చు. ఇంకా పేరు పెట్టలేదనుకో-"

"ఏం పేరుపెడితే బాగుంటుందంటారు?"

"విషయమేమిటో తెలిస్తే—" పరంధామయ్య వాక్యం మరో లోకంలో పూర్తవుతుంది.

"అదే చెబుదా మనుకుంటున్నా, మొన్న వ్యవసాయశాఖ వారికి పిటిషన్ పెట్టానా – నేనూ లాయర్నే – ఐనా లా పదాలు వాడకుండా, అతిసులువైన సరళమైన భాషలో వ్రాశానేమో–ఎందుకంటే మా మామగారి యింట్లో వంటాయన శరభయ్యకి కూడా ఇట్టే అర్థమైంది. విషయము బోధపడగానే ముక్కుమీద వేలేసుకున్నాడు."

పరంధామయ్య దగ్గరుండడం వల్ల కాబోలు, కొంచెం ధైర్యంచిక్కి సందేహ నివృత్తి కుపక్రమించాను.

"మీ మామగారింట్లో వున్నది వంటలక్కగా" అన్నాను. ముకుందాన్ని పట్టి వేయించ గలిగానని గర్వపడుతూ.

"సరేలే – ఆవిడెప్పుడో వెళ్ళిపోయింది, వెండి ముక్కు పొడుం డబ్బీ, అరడజను యింగువపొట్టాలూ తీసుకొని. నేనారా తీశాను. అత్తగారూ వాళ్ళూ ఆడదాన్ని యాగీ చేయడమెందుకని వూరుకోమన్నారు. శరభయ్యని కుదిర్చి పెట్టింది నేనే. వాడున్నాడే, వంట చెయ్యడంలో భీముడు. అతని చేతి భోజనం ఒక్కసారి తిన్నట్లయితే, పొట్టి శ్రీరాములు ఈనాటికి జీవించే వుండును. నా గ్రంథంలో ఒక అధ్యాయము అతన్ని గురించే."

"మీరు వ్రాసే చరిత్ర స్వీయ చరిత్రన్న మాట—"

"అసలు విషయం చెప్పనివ్వండి–చాలమంది చంపుకు తింటు

న్నారు, మీ చరిత్ర వ్రాయండని-నాకు తీరికేది? జీవించదల్చుకున్న వారికి గ్రంథ రచన పడదేమో! ఓసారి—"

భూకంపం ఏ ప్రాంతంలో ఏ సమయంలో చెలరేగుతుందో ఎవరు చెప్పగలరు? పెద్ద ఓటలు తీసింది. పరంధామయ్యా నేనూ అందులో పడిపొయ్యాం - ఓ పావుగంట. తెప్పరిల్లి "దాహం" అన్నాడు పరంధామయ్య. అని తనే లోపలి కెళ్ళాడు.

శరభయ్య మా కక్కర్లేదంటే నా దగ్గరే అట్టేపెట్టేసుకున్నాను. పేరమ్మని నా దగ్గిరే వుంచుకున్నాను! ఏంచెయ్యను-తెలుగు భాషలోపం—వుంచుగోక తప్పదు. చురుకైనపిల్ల. మొగుణ్ణి వదిలేసింది. వాడే వదిలేశాడనుకో – రంగం వెళ్ళాడు. రాజకీయాలు వదులుకున్నాను. ఆటలు, పాటలు వదులుకున్నాను. కృష్ణా రామా అనుకుంటూ, పొలం, తోట చూసుకుంటూ కడుపులోచల్ల—"

ఇంతలో బాబోయ్" అని లోపల్నుంచి పరంధామయ్య గావు కేక వేశాడు. తొందరగా వెళ్ళాం. ఆయనకి తేలుకుట్టిందట. కాలు గట్టిగా అదిమిపట్టి, "మంత్రగత్తెమోకాస్త చూడండి. ఇది మామూలు తేలుకాదు" అని బాధపడుతున్నాడు. నేను నాలుగు మూలలూ చూస్తున్నాను "కనబడదేం?" అన్నాను. "నీకు స్వాగతం యిస్తూ ఎదురుగా వస్తుంది. మరీ మందేంలేదూ? డాక్టరేవడూ లేడూ?" అంటున్నాడు.

ముకుందం మళ్ళా మొదలెట్టాడు. "ఓ సారి పేరమ్మ కిల్లాగే తేలుకుట్టింది. దాని కెంత బాధకలిగిందంటే, "చూడి తేలుకుట్టెంద్రోయ్" అని కేక వేసింది. కాదు, చీమన్నాను నేను. వెదకడం మొదలెట్టారు—"

"డాక్టర్ని తీసుకురండి – మంత్రం వెయ్యలేరూ—"

"మీ రిక్కడే వుండండి, డాక్టర్ని తీసుకొస్తాను" అని బైలుదేరాను. "నువ్వు తిరిగొచ్చేటప్పటికి నా ప్రాణమే పోతుంది. ఉండు నేనే వస్తాను"

నేను పరంధామయ్యను తీసుకుని బైటకొచ్చి ఓ రిక్షా మాట్లాడి అందులో ఎక్కాం.

"మీకు మంచిటైమ్‌లో, అలారమ్ మోగినట్టు – తేలు కుట్టిందండి లేకపోతే నా రైలు తప్పును ప్రొద్దున పదింటికి దిగాను. పది గంటలు లేటన్నారు. అంటే, ఎనిమిదింటికన్న మాట. ఇప్పుడు పావుతక్కువ ఎనిమిది. కాబట్టి నాకు రైలందుతుంది. మనకు ఢిల్లీ ప్రయాణము తప్పదు. ఓసారి నేను, లేబర్ కమీషనర్ రంగనాథం ఢిల్లీ ప్రయాణం కట్టాం. నాగపూర్ చేరేటప్పటికి—" రిక్షా మలుపు తిరిగింది. ఓ జట్కా ఆపుచేయించి, ముకుందాన్ని అందులో ఎక్కమని, సెలవు తీసుకున్నాం. మమ్మల్ని తనవూరు ఆహ్వానించాడు. అల్లాగే అన్నాం. ఏదో చెబుతున్నాడు – జట్కా దూరంగా వెళ్ళింది. రిక్షావాణ్ని తిన్నగా హోటల్‌కి పట్టమన్నాడు పరంధామయ్య. కారియర్ యింటికొస్తుందిగా అన్నాను. ఇంటికెడితే యీసారి నిజంగా తేలుకుడుతుందన్నాడు పరంధామయ్య.

ఇది జరిగిం తర్వాత ముకుందాన్ని నేను కలుసుకోలేదు. అటు వెడుతూ ఓసారి పరంధామయ్య, ముకుందం బంగళాని, తోటని చూచి, ఓపూట భోజనంచేసి వొచ్చినట్లు, వివరాలన్నీ వుత్తరం ద్వారా తెలియ బరిచాడు. శరభయ్య వొంట అద్భుతంట. పేరమ్మ బ్యూటీట. రోజూ పది మందికి తక్కువుండరట భోజనానికి. ఆయనకున్న పలుకుబడి, పేరు, అంతా శరభయ్య వొంట మూలంగానేట. అతని స్వీయచరిత్ర క్లుప్తంగా నాలుగు గంటలు చెప్పాడుట. అది వినగానే తిన్నదంతా అరిగిపోయిం దిట. "నా సంభాషణ వల్ల జీర్ణం కాని పదార్థంలేదు." అని ముకుందం నిర్వచనం చేశాడుట.

అట్లాంటి ముకుందానికి ఎందుకు మతిభ్రమించి, పిచ్చాస్పత్రిలో వుండాల్సి వచ్చిందో నాకు బోధపడలేదు. కొద్దిగా మానసిక శాస్త్రం నేనూ చదివాను. సంసార సుఖం లేకపోవడం అతి వాగుడికి వో కారణంగా చెప్తారు. ప్రేమ తృష్ణ మాటల ద్వారా తీర్చుకుని తృప్తి పడటం చిహ్నం.

నాకిది సరైన కారణంగా తోచలేదు కృత్రిమంగా వూహిస్తే ఏవేవో చిత్రమైన కారణాలు కల్పించవచ్చు. జాడ్యం ఎంత కృత్రిమమైందో, దానికి మందు కూడా అంత అపూర్వంగా వుంటుంది. గుడ్డివాడు విసిరిన బెడ్డ లాంటిది మానసిక శాస్త్రంలో మందు. తగులుతే తగులుతుంది, లేకపోతే లేదు. నే మొదట్లో అనుకున్న కారణమే నా కిప్పటికీ సమంజసంగా కనబడుతోంది. ముకుందం మంచివాడు, స్వార్థరహితుడు. జీవితంలో ఏదీ కోరకుండా, అన్నీ లెచ్చుకొని సర్వమూ వదులుకున్న యోగి. విలువలు కట్టని విమర్శకుడు, సిద్ధాంతాలు అమాయక ప్రజ నెత్తిన రుద్దని వేదాంతి. అయినా అతని బారి నుండి పారిపోడానికి నేనూ ప్రయత్నం చేశాను. భార్య విసుగెత్తి ఇకచాలు బాబు అనుకుని పరమపదించింది సరోజ పెళ్ళి చేసుకోనంది. అందరూ అతన్నుండి పారిపోయి అతన్ని ఏ కాకిని చేశారు. నా కళ్ళంట అప్రయత్నంగా నీళ్ళు తిరిగినై. పాపం, అతనేం అపచారం చేశాడు ? రెండు రూపాయలిచ్చి – కర్నాటక సంగీత విద్వాంసుడు, వయొలిన్, మృదంగం కలిసి మూడు గంటలు నుమ్మోన యుద్ధం సాగిసే చూసి, విని 'ఆహా, ఎంత అద్భుతంగా వుందండీ' అని చెప్పగోడంలేదు ? మనం ఖర్చుపెట్టిన రెండు రూపాయలనీ సమర్థించేటందుకు కాక, మరెందుకు, మనం మెచ్చుకోడం ? కానీ ఖర్చు లేకుండా ముకుందం మనకి వినోదం కలిగిస్తే ఏవగింపా ? అతనికి పేర్లెట్టి హేళన చెయ్యడమా ?

నీతిలో మెళకువలు తెలిసున్నవాడు ముకుందం. ఏనాడో భార్యకి అపచారం చేశాడు. దాన్ని ఎదుర్కొన్నాడు. తను సమాధానం పడలేక పోయాడు. సంఘానికి చెప్పేసి, పాప పరిహారాని కుపక్రమించాడు. మాటల ద్వారా అదీ నాకు తోచిన కారణం. అతను జీవితంలో దేన్నీ కోరడు. ప్రతిఫలం కోరని సంభాషణ – అతని మాట పడిపోయిందంటే నాకీ ప్రపంచంలో ఏదో తీరని లోటు కనబడింది. అతని భార్య కళ్యాణి

అన్నట్లు అతను దూరంగా వున్న కొద్దీ దగ్గరగా వొచ్చినట్లుంటాడు. దగ్గరగా వుంటే తప్పించుకు తిరుగుతాను నాకు ఓపిక లేదు.

అతని జీవితంలో ఏదో లోటుంది. దాన్ని శోధించి ఎవ్వరూ బైట పెట్టకుండా అతను "మాటలు" అనే వల అల్లుకున్నాడు. అతన్ని కదిపి మాట్లాడిస్తే అదేమిటో బైటపడును. కాని ఇప్పుడు ఆ అవకాశం లేదు. అతనికి మాటపోయింది. దిగులుగా కూర్చున్నాను. "పోనీ, ఓసారి వెళ్ళి చూసి రాకూడదూ ?" అంది మా ఆవిడ.

ఆ రాత్రే బెంగుళూరు ప్రయాణం అయ్యాను. హాస్పిటల్ కి వెళ్ళే ప్పటికి సాయంత్రం నాలుగైంది. బైట ముకుందం తమ్ముణ్ణి కలుసు కున్నాను. అతను చెప్పాడు కొన్ని సంగతులు. పనిపిల్ల పేరమ్మ, వంటా యన శరబయ్యతో లేచిపోయిందిట. వాళ్ళని వెదుక్కుంటూ తిరిగాడుట ముకుండం. పేరమ్మని స్టేషన్ లో పట్టుకున్నాడుట. ఇద్దరినీ యింటికి రమ్మనమని బ్రతిమలాడాట్ట. జీతం ఎక్కువ చేస్తానన్నాడుట. రానందిట. ఏదో వాగిందిట. అతని మామగార్ని, భార్యని, సరోజని – వాళ్ళ కుటుం బాన్ని చులకన చేస్తూ మాట్లాడిందట. లెంపకాయ కొట్టాడుట. మళ్ళా ఏదో అందట. "నేనందుకు కావాల్సి వొచ్చానా ? ఇప్పుడనండి ఏమం టారో ?" అని సవాల్ చేసినట్లు మాట్లాడిందిట. పళ్ళు బిగబట్టి మొహం ఎర్రగా అయి, చేతులతో రక్కేటట్లుగా అభినయం చేశాట్ట. కాని నోటంట మాటరాలేదుట. ఇవన్నీ పేరమ్మ చెప్పిందిట.

జీవితంలో ఏదీ ఆసించని వాడికి అసంతృప్తి వుండదు. కోరింది లభించలేదన్నప్పుడు వొచ్చే కోపంరాదు. ముకుందం ఉద్రేకాలకి అతీ తుడు. కార్యకూరులు కోపానికి గురవుతారు. అతను ఏ కార్యం తల పెట్టడుచెయ్యడు. కోపం అంటే ఏమిటో ఎరగని అమాయకుడు. అట్లాంటి ముకుందాన్ని పేరమ్మ రెచ్చగొట్టింది. కోపం తెప్పించింది. దాని తీవ్రతకి అతని శరీరం తట్టుకోలేకపోయింది. వ్యక్తిత్వానికి "షాక్" తగిలింది. తేరుకోలేక పొయ్యాడు. "మాట" అతని ఆయుధం, అతని ఆయువుపట్టు.

దాన్నే సవాల్ చేసింది పేరమ్మ. ఆయువుపట్టు మీద దెబ్బ కొట్టింది. ఊహా జగత్తు పేలి పోయింది. మానసిక గోళాలు ఢీ కొన్నాయి. వాటి మధ్య నలిగి ధ్వని యంత్రం నిలిచిపోయింది.

లోపలి కెళ్ళి చూశాను. దిగులుగా కూర్చున్నాడు. పెరిగిన గడ్డములో తెల్లవెంట్రుక లున్నాయి. కళ్ళ కింద గీత లున్నాయి. జుట్టంతా చిందరవందరగా వుంది. పిచ్చివాడులా వున్నాడు. నన్ను చూశాడు. నా కళ్ళల్లోకి లోతుగా చూశాడు. ఏమీ మార్పు లేదు అతని ముఖంలో. మందహాసం లేదు. నేను ఫలానా అన్న చైతన్యం లేదు. నాకు జాలేసింది ఇల్లాగన్నాను :

"ముకుందం గారూ – మీరు జీవితంలో అన్నీ సాధించారు, వొక్కటి తప్ప – మౌనంగా, నిశ్శబ్దంగా వుండటం తప్ప అన్నీ సాధించారు. మీరు నిండైన, పరిపూర్ణులైన ధన్య జీవులు."

ఏదో చప్పుడైంది – సంకెళ్ళు వూడిపడ్డట్లు, సముద్రం వెనక్కి వెళ్ళి ఎండినట్లు, భూకంపం నోటలు మూసుకుని లోలోన అణగారినట్లు, కాలచక్రం వొక్కసారి కదిలినట్లు.

"ఆ, నేను మాట్లాడలేనంటారా ? నేను మూగనా – నిశ్శబ్దమా – మౌనమా ... ఎందుకు మాట్లాడలేను. వినడం చేతకాని వారికి మాట్లాడ్డం చేతకాదు. వారే మూగ వారు. ఓసారి విజయనగరంలో అష్టావధానం జరిగింది. పదిమందీ పది ప్రశ్న లడుగుతారు. వారికి సమాధానాలు, గంట తర్వాత క్రమంలో చెప్పాలి. నే నో ప్రశ్న అడిగాను. తికమకగా – కాకిగూటిలో చిలుకపిల్ల వుంటే, తోడేలు చెట్టుకింద వున్నప్పుడు, పెద్ద పులి అరుస్తే భయపడేది చిలుకపిల్లా, కాకా, తోడేలా - క్రమంలో చెప్పాలి ..."

అల్లా ముకుందం గారు యధావిధిగా తన ధోరణి సాగించారు. ఆయన మాట్లాడిన వాక్యానికి ప్రతి ధ్వని లేదు. వాక్యం ముగించినప్పుడు కదా ప్రతిధ్వని వినబడేది ? ఆ ముగింపు లేదు – ఆ ప్రతిధ్వని లేదు. నాకీ లోకంతో ఇంక పేచీలేదు.

ఈ కథలో ముకుందానికి అన్యాయం చేశానా ఎక్కడేనా అని తిరిగి చూశాను. ఒకచోట చేశాను. రైళ్ళాగిపోయి, రెండోసారి నన్ను కలుసుకున్నప్పుడు "రండి టీ తాగొద్దాం" అని ముకుందం అన్నట్లుగా వ్రాశాను. అది పొరబాటు. అలా ముకుందం అనలేదు, అనడు. టీకి భోజనానికీ, స్థూల జగత్తులో శారీరకావసరాలకీ అతనికి టైము లేదు. వీటితో ఆ ఊహా సామ్రాజ్య చక్రవర్తికి నిమిత్తం లేదు. అతను హాస్పిటల్‌లో వున్న ఆ వారం రోజులే కాలచక్రానికి విరామం.

# దిగజారిన మాలిన్యం

పైకెన్ని చెప్పినా ధనికులంటే నాకిష్టం. సామాన్య మానవుడి శ్రేయస్సు కోరతాను. అతనికి మేలుకలిగే యత్నం ఏదైనా జరుగుతూంటే, చేతనైన సహాయం చేస్తాను. ధనిక వర్గాలతో పోల్చిచూస్తే నేనూ సామాన్య మానవుణ్ణే. అయినా సామాన్య మానవుడుగా ఉండడం కంటే, అతని శ్రేయస్కామిగా ఉండడమే నాకిష్టం. ధనికులంటే యిష్టమే అయినా వారితో చనువుగా, స్నేహంగా, అంతా ఒకటిగా మాత్రం ఉండలేను. పరదేశీలపట్ల సాధ్యమయ్యే గౌరవభావం, దూర ప్రాంతాలను గూర్చి "ఎప్పుడో మీ దగ్గరికి వస్తానులే" అని అనిపించే న్యూనత డబ్బున్నవార్ని చూస్తే కలుగుతాయి నాలో. వారి జీవితం గురించి నాకేమీ తెలియదు. ఆ డబ్బంతా ఏమవుతుందో ? వారెల్లా అనుభవిస్తారో ? వారి దైనందిన జీవితం, చేష్టలు, మాటలు అనుక్షణమూ ఆశ్చర్యం కలగచేస్తూండడమే ఆకర్షణకి కారణం అనుకుంటాను. సాధారణంగా మన ఆధిక్యతని ప్రకటిస్తే హర్షించే వ్యక్తులే మనకి సన్నిహితులవుతారు. కాని ఆ స్నేహం, సాంగత్యం ఎల్లప్పుడూ ఆనందాన్నివ్వదు. అది లోయలో నడవడం లాంటిది. నడవగా నడవగా ఒక పర్వతం దగ్గరికి చేరుకుంటాం. పైకి చూస్తే ఎత్తుగా శిఖరం కనిపిస్తుంది. మన అల్పత్వం అప్పుడు మనకు తెలిసొస్తుంది. స్వార్థం దిగజారుతుంది. నమ్రతతో చేతులు జోడిస్తాం. ధనికులతో గడిపిన క్షణాలు యిట్లాంటి అనుభవాన్ని కలగచేస్తాయి.

అందుచేత కాంతారావు రమ్మని వ్రాయగానే, గంతేసి బైలుదేరాను. దూరపు చుట్టరికం ఉన్నా అతనిని నేను బాగా ఎరగను. కులూ లోయలో నాకో నాలుగెకరాల భూమి ఉందనుకుంటే ఎంత తృప్తో, అతను చుట్టమని చెప్పుకున్నా అంతే తృప్తి. మావాళ్ళందరిలోనూ

అంత చిన్నతనంలో అంత పైకొచ్చినవారు మరొకరు లేరు. చాలామంది సంస్కారం, చదువు, హోదా, ఆస్తులు, తెలివి మొదలైన వాటితో నిచ్చెన వేయించుకొని, ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ పైకెడతారు. కాంతారావు అట్లా కాదు. వేటితో నిచ్చెన వేయించాడో మాకు తెలవదు. కింద నిలబడ్డాడు. ఆరేళ్ళ తర్వాత అమాంతం పైన కూర్చున్నాడు. ఎక్కిన నిచ్చెన తన్ని పారేశాడంటారు, గిట్టనివాళ్ళు. ఇందులోని నిజా నిజాలు నాకు తెలవ్వు. ఒక వ్యాపార సంస్థకి అతను అధిపతి. దాని యజమానులు, పెట్టుబడిదారులు పాశ్చాత్యులు. రెండువేలదాకా జీతం. బంగళా, నౌకర్లు, పెద్ద తోట, ఒక కారు, పిల్లలకి ఉచిత విద్యా వైద్య సౌకర్యాలు, ఏడాదికోసారి విమానంలో కుటుంబంతో సహా ఉచిత దేశ యాత్ర. రెండు నెలల "బోనస్"—ఉద్యోగాలిచ్చే కమిటీకి సలహా దారుడు, నెలకిన్ని డబ్బాలు సిగరెట్లు, యిన్ని సీసాలు మద్య పానీయం పుచ్చుకునేందుకు లైసెన్సు; అంతటి ఉద్యోగం.

ఈ కథకోసం అతన్ని స్నేహితుడుగా చెప్పాలన్నా, అదో రక మైన స్నేహం. అతను ఏ బొంబాయో వెడుతుంటే ఏ ఫస్టుక్లాస్‌లోనో పేపర్ చదువుతూ కూర్చుండగానో ఓ చిన్ని చూపు, కుశల ప్రశ్న—గార్డు విజిల్—రైలు కదలడం. వాళ్ళ యింట్లో శుభకార్యం జరిగితే, ఒక ఆహ్వానపత్రం రావడం, నేను సమయానికి డబ్బుంటే శుభాకాంక్షలు పంపడం. అంతే, మా స్నేహం.

వారి సంస్థకి ఆ యేడు పెద్ద లాభాలొచ్చాయట. ఏదో వినోదం జరుపుకుంటున్నారు. నాదో నాటిక ఆడడానికి అతని సలహాపై నిశ్చ యించి నాకు వ్రాశారు. నా నాటికలు ఆడేవాళ్ళు ఎవ్వరూ లేరు. వీళ్ళు ఆడడానికి నిశ్చయించారంటే, వీరి అభిరుచి, సంస్కృతుల పట్ల శంకలు రాసాగినా, వాటిని దిగమింగేసి, నాటకం రేపనగా—యివాళ సాయంత్రా నికి ఆ ఊరు చేరుకున్నాను. స్టేషన్‌కి కాంతారావు రాలేదు కాని, కారు పంపించాడు. నన్ను, సామాను ఓ పెద్దగదిలో దింపారు; ఒక నౌకరు

అన్నీ కనుక్కుంటున్నాడు. టిఫిన్, స్నానం, అలంకారం అన్నీ అయ్యాయి. తోటలో పచార్లు చేస్తున్నాను.

"అయ్యగారు సాయంత్రం ఏడుగంటలకి వస్తారండి. మిమ్మల్ని యిక్కడే సిద్ధంగా ఉండమన్నారండి" అన్నాడు నౌకరు.

"అమ్మగారేరీ ?"

"సిమ్లా వెళ్ళారండి"

సిమ్లా ఎందుకో! నేనెప్పుడైనా హిమాలయ పర్వత ప్రాంతానికి వెడతానా ? ఆ మంచుకొండలు, ఆ విశాలమైన ఒంపుల బయళ్ళు, ఆప్యాయతకి కరిగి యువక హృదయంలా సూర్యరశ్మికి విడిన పుష్పాలు, జారిన సెలయేళ్ళు, వృద్ధుని ఒంటి పస్నులా, తీగని పట్టుకున్న ద్రాక్ష గుత్తులు—పుస్తకాల్లో, సినిమాల్లో చూసిన హిమాలయ పర్వత దృశ్యాలను వెనకటిజన్మలో జ్ఞాపకాలలా స్మరించుకుంటూ ఉండగా ఏదైంది. దూరంగా కారాగిన చప్పుడైంది. అయ్యగారొచ్చారంటూ ఇద్దరు నౌకర్లు, తోటమాలి హడావుడిగా నడుస్తున్నారు. కాంతారావొచ్చాడు. రెండు మూడు కుర్చీలు చెట్ల మధ్య వేశారు. ఓ బల్లమీద కూల్‌డ్రింక్స్ పెట్టారు.

"డ్రైవ్ యివాళ లైమ్‌కొచ్చినట్లుందే ? ఇక్కడ బాగుందా, స్నానం, టిఫిన్ ?"

"ఓ చాలా బాగుంది"

"షవర్ బాత్ చేశావా ?"

"అదేదో అట్లాంటిదే అనుకున్నాను. అదీ యిదీ తిప్పి చూశాను. నీళ్లు మాత్రం రాలేదు" అన్నాను.

"కొత్త మోడల్‌ది. మొన్ననే బిగించారు. హాండిల్ పైకి తీసి, హుక్‌లో బిగించాలి. అయినా నువ్వు కవివి. నీ కేవన్నా అర్థమవుతాయా ?" అంటూ కాంతారావు నవ్వడం సాగించాడు.

సంఘంలో పైకొచ్చిన ప్రతి వ్యక్తీ వీలు చిక్కినప్పుడల్లా కవుల

మీద ఛలోక్తులు విసరటం కొత్త కాదు. అయినా నేను కవిని గాను. ఏ రచన చేసినా సరే ఆ వ్యక్తిని "కవీశ్వరుడు"గా వ్యవహరించే సంప్రదాయం ఇంకా పోలేదు కాబోలునని లోపల అనుకున్నాను.

"ఆమె సిమ్లా వెళ్ళారట" అన్నాను.

"మా డైరెక్టర్ ఓ దొరలే. ఆయన భార్య పుట్టినరోజు సిమ్లాలో జరుపుకుంటూందిట. నా కెల్లానూ తీరదు గనక ఆమే, అబ్బాయీ వెళ్ళారు. స్త్రీల పుట్టినరోజు పార్టీలకి మొగాళ్ళు వెళ్ళకూడదు. వారి పుట్టినరోజు జ్ఞాపకం ఉంచుకుని వయస్సుని మాత్రం మర్చిపోవాలి. ఇది మొగాడికి సాధ్యం కాదేమో" అన్నాడు కాంతారావు. ఇద్దరం నవ్వుకున్నాం.

"రిహార్సల్స్ సాగుతున్నాయా ?" అని అడిగాను.

"ఏం రిహార్సల్స్ ?"

"అదే, రేపటి నాటకం తాలూకు..."

"ఓ, అదా! నీ నాటకమా! రేపటి మాట కదా. చూద్దాంలే" అన్నాడు.

అంత పెద్ద అధికారిని రిహార్సల్స్‌లాంటి స్వల్ప విషయం గూర్చి అడగడం పొరపాటని గ్రహించి, పెదవి కొరుక్కున్నాను అతను చూడకుండా.

"నువ్వొస్తున్నావని తెలిసి, కొందరు స్నేహితుల్ని పిలిచాను. చిన్న పార్టీలాంటిది జరుపుదాం. ఏం ?"

"ఎవర్ని ?"

"నువ్వెవర్నీ ఎరగవేమో. దీనదయాళ్ అని మా సంస్థ వినోదాల కార్యదర్శి; డాక్టర్ హరికృష్ణ, ఇక్కడ డాక్టర్. అతనే సంక్షేమాధికారి కూడా; అతని భార్య "వసుధమయి"-అందరం 'సుధా' అంటాం; సూపరిండెంటు శ్రీనివాసులు; అతను రానని కబురంపాడు; మనం; అంతే. "సుధ"ని చూసి గాభరాపడకేం ?" అని కొంటెగా చూసి నవ్వాడు.

"ఏం కథ ?"

"నువ్వే చూస్తావుగా. విపరీతంగా ఆగేస్తుంది. శృంగార చేష్టలు సాగిస్తుంది. అన్నట్లు నువ్వు కవివిగా, కాస్తంత రుచి చూస్తావుగా, శృంగార చేష్టల్ని కాదు సుమా!' అన్నాడు. రచయితకి అన్ని రకాల అనుభవాలు కావాలి. ఈ అవకాశం పోగొట్టుకోవాలని లేదు. ఇట్లా వదిలేసుకున్న అవకాశాలను స్మరించుకుని తరవాత పశ్చాత్తాపపడటం జరుగుతుందనినాకు అనుభవమే.

కాంతారావుకేసి పరీక్షగా చూశాను. వెంటనే అతనిలో కనబడేది ఎత్తైన విగ్రహం. ఎత్తైయినవార్నేగాని చెప్పుకోదగ్గ వ్యక్తులుగా చూడరు పాశ్చాత్యులు. అసలది చూసే ఈ ఉద్యోగం ఇచ్చారేమోకూడా! పొట్టి నిక్కరు, సాక్సు, కాన్వాస్ జోళ్ళు, బెల్టు, మణికట్టంతా ఆక్రమించిన రిస్టు వాచి, చదరంగా మెలికలుతిరిగిన కండలు కనిపించే-బుజాలు, మెడ, వంకీలు తిరిగి పైకిదువ్విన పల్చటి క్రాప్, కళ్ళకింద కోణంగా తేలిన చెంప ఎముకమీద బిగిసిన చర్మం, క్రమం తప్పిన ఒకటి రెండు మినహా- వరుసగా స్ఫుటంగా వున్న పళ్ళు, విరగబడి నవ్వినప్పుడు చిగుళ్ళు ఎర్రగా కనిపించి, సంధ్యాసమయంలో మేఘాల చివర అలుముకున్న ఎరుపులా- ఈ కథ కాంతారావును గూర్చి కాదు గనుక, నే నతన్ని వర్ణించను.

స్నానంచేసి వస్తానని లోపలి కెళ్ళాడు. నేను లేచి మొక్కల మధ్య పచార్లు చేస్తున్నాను. స్వేచ్ఛగా ప్రకృతిలో వాటంతట అవి పెరిగిన చెట్లని, మొక్కలని చూసి ఆనందించినట్లుగా, మనిషి సృష్టించిన తోటని చూసి ఆనందించలేను.

మనిషి వేసిన తోటలో క్రమం, వో వరుస, వైవిధ్యం వుంటాయి నిజమే. తాత్కాలికమైన ఆహ్లాదాన్ని కలుగజేస్తాయి ఈ తోటలు. ఇంద్రియాల వత్తిడిపై వాటి అరాజకమైన చీకటినీడల శక్తితో విప్లవంచేసి, ఓడించి, పద్మాశింపజేసి, నిశ్చలమైన వైరాగ్యాన్ని ఇవ్వవేమో, మనిషి

వేసినతోటలు! నే స్వంతంగా వేసుకున్న తోట అంతటి ఆనందాన్ని కలుగ చేస్తుందేమో నా కింకా అనుభవంలేదు.

గేటు చప్పుడైంది. చప్పుడుచేస్తూ ఇద్దరువ్యక్తులు నా ముందుగా నడిచి, వరండాలో కుర్చీలమీద చతికిల పడ్డారు. ఒకాయన ఎత్తుగా సన్నంగావున్నాడు. మరోఆయన పొట్టిగా, లావుగా వున్నాడు. లావా టాయన మాటలు లేని పాట బిగ్గరగా పాడటం సాగించాడు. నా కేసి చూసి నిల్చిపోయాడు.

"మీరేనా వచ్చింది మధ్యాహ్నం?"

"అవునండీ"

"కాంతంగా రొచ్చి చాలా సేపై వుండాలి. లోప లేం చేస్తున్నాడు? భార్య వూళ్ళో లేదుగా" అని నవ్వుతున్నాడు.

"స్నానం చేస్తున్నాడు" అన్నాను.

"పరిచయం చేసుకుందాం పట్టండి, స్పృహలో వున్నప్పుడే. ఈయన దీనదయాళ్, మా క్లబ్ సెక్రటరీ. నేనేమో డాక్టర్ హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణహరే అనే ప్రార్థనుంది చూశారూ! అది-అంటే పేషంట్లు ఆ విధంగా తమవద్దనుండి వెళ్ళిపొమ్మని ప్రార్థిస్తూంటారన్న మాట!"

దీపంవెలుగులో ఆయన్ని పరిశీలించాను. ఎర్రగా, కందగడ్డలా వున్నాడు. నెత్తిన వెంట్రుకలు అక్కడక్కడ వుండికూడా, ఏమీ లేనట్లుగా, చదునుగా వుంది బుర్ర. కళ్ళకింద అర్ధచంద్రాకారంలో ముడతలు, గడ్డంకింద సృష్టికి ప్రతిసృష్టిలా మరోగడ్డం, శరీరంలో కండలు పట్టుజారి, స్వేచ్ఛగా వింతవింత ఆకృతులలో దిగజారి ఏ భాగం ఎక్కడ ప్రారంభమై, ఎక్కడ అంతం అవుతుందో తెలీకుండా, సర్రీలిస్ట్ చిత్రంలా తయారైంది ఆయన శరీరం.

సెక్రటరీని, నాటకం రిహార్సల్సు గురించి అడుగుదామని గొంతు సవరించుకుని వాక్యనిర్మాణం చేస్తుండగా కాంతారావు వచ్చాడు.

నౌకర్లు కుర్చీలూ, బల్లలూ తోట మధ్యగా అమర్చారు. ఆ ముగ్గురూ

ఏవో పాడుకుంటూ, మాట్లాడుతూ, నవ్వుకుంటూ, కుర్చీలదగ్గర కొచ్చారు. నన్ను రమ్మన్నారు.

"ఈయనదే రేపటి నాటకం" అని కాంతారావు నన్ను పరిచయం చేశాడు.

"చాలా బాగుందంటి"

"మీరు చదివారా?"

అదికాదు, మిమ్మల్ని కలుసుకోవడం అన్నాడు హరికృష్ణ.

చదవడం ఎందుకు? రేపు చూస్తున్నాంగా. అన్నట్లు, రేపురాత్రి కార్యక్రమం ఏమిటి దయాళ్?"

"చూశారి. సాయంత్రం ఫొటో, పార్టీ. ఆ తర్వాత లాజరస్‌గారి ఉపన్యాసం. తరువాతది మన అప్పటిపరిస్థితిసిబట్టి వుంటుంది, కుర్చీల్లో కూర్చునే చైతన్యం వుంటే." హరికృష్ణ సంగీతంలో వాక్యం పూర్తవలేదు. నౌకర్లు గబగబ గ్లాసులు, ప్లేట్లు బల్లమీద అమరుస్తున్నారు. నేనీలోగా గొంతుసవరించుకొని నాటకం ఎంతవరకూ తయారైందో అడగాలని నిశ్చ యించుకున్నా.

"అవుతే మీరు కవులన్నమాట! మాకు ఈ కవిత్వాలతో కుదర దండి. మన వృత్తేమిటి బ్రదర్! డాక్టర్‌గా పిల్లల్ని పుట్టించడం—కాంతా రావు పనివాళ్ళని పెంచడం — చివరలో నేనే వారిని చంపెయ్యడం, ఈ లోగా ఆ పని కాస్తా మా సుధానైటింగేల్ చెయ్యకుండావిడిచిపెడితే! హా, హా హ, హ" అని మొదలెట్టిన నవ్వుని పాటలో దించేశాడు. నౌకరు గ్లాసుల్లో ఐస్‌వుంచి, సోడాలుకొట్టి పోశాడు. రెండు పెద్దసీసాలు రిఫ్రీజి రేటర్ లోంచి తీశాడు. కాంతారావు మూతలుతీసి ద్రావకం గ్లాసుల్లో నర్దాడు. నాచేతుల్లో ఓ గ్లాసు పెట్టాడు.

నాకు భయమేసింది. దగ్గరదగ్గరగా అనుగెత్తు గ్లాసు నాకు కొత్త

జోయస్ బోధలు ప్రతిఫలించాయి. ఈ వాదాన్ని తాత్విక దృష్ట్యా యువకావేశం ఆమోదించడం ఒకటీ. వృద్ధుడైన తర్వాత ఆచరణలో పెట్టి సమాజాన్ని రెచ్చగొట్టడం మరొక్కటీ.

"కాని ఆనాడు నా భార్య ఒక సంస్థలాగ కనుపించలేదు. అది నాది, నా సొత్తు; దానిమీద హక్కు నా ఒక్కడికే వుంది. అది సంఘానికి చెందకూడదు. గోడల మధ్య, తలుపు వెనక, కర్టెన్ల మధ్య, దోమతెర మధ్య, దుప్పటి కింద మరుగుపరుస్తాను. కాని ఎప్పుడో ఈ సంఘం దాన్ని తీసుకుపోయి సంస్థగా చేసేస్తుందన్న భయమూ, తీవ్రమైన అసూయా నన్ను పీడించి శాంతిని భంగం చేసేవి.

ఆ సాయంత్రం మూడో కాన్పు నెప్పులు పడడం చూసేటప్పటికి నా గుండె గుభేలుమంది. తెల్లవారితే ఆఫీసు. కారణం చెప్పకుండా శెలవడిగితే యివ్వడు తాసిల్దారు. చెపితే కనుక్కోవడం వంకని ఇంటి కొచ్చి తీరతాడు. అది నేను సహించలేను. చేతిలో కానీ లేదు. నా స్నేహితుడు మొగ డాక్టరు ఒకడున్నాడు. ఆయన్ని పిలిపించడం నాకు సుతరామూ యిష్టంలేదు. పైగా నాకు పిల్లలంటే పరమ అసహ్యం. ఎందుకంటావ్ ? దాని సౌందర్యాన్ని, నా అల్పగణింపుని సమంగా పంచుకుంటారని పిల్లలంటే గిట్టదు. నా యిరువురు సంతానం దాన్నప్పుడే పంచుకుంటున్నారు. మళ్ళా మూడోదా! పిల్లలకి తప్ప అది నాకు చెందదని ఏదో వెర్రి భయం. సంతానం దాన్ని తినేసి పీల్చి, పిప్పిచేసి అస్థిపంజరం నాకు మిగిలిస్తే దాన్ని తగలేసి వాళ్ళు చేసిన ఘనకార్యానికి ఆస్తంతా వాళ్ళకి అప్పచెప్పడమా ? వివాహం అన్న సంస్థలో స్వార్థం వుందంటారు కాని, అది నిజం కాదు. అది శాసించి కోరే స్వార్థత్యాగంలో నాలుగోవంతు దేశ సేవలో వినియోగిస్తే భారత దేశం ఒక సంవత్సరంలో పురోగమించి, ప్రాచీన ఔన్నత్య శిఖరాన్ని అందుకుంటుంది. సౌందర్యమనే స్త్రీని పోషించలేని నాబోటి అల్పుడికి కట్టడం ఎంత పాపమో ప్రతిభాశాలిని వివాహం పేరిట భార్యకి కట్టి

పడెయ్యడం అంతే పాపం. పోషించే శక్తి లేకుండా ఈ లోకంలోకి పిల్లల్ని తీసుకురావడం ఈ రెంటినీ మించిన అపచారం.

ఈ ఆలోచనలు దానికి ఒక్కటీ అర్థం కావు. దాని కసలు ఆలోచనే లేదు. పుష్పం పరిమళించినట్లు, సముద్రం రోదించినట్లు, చంద్రుడు చల్లదనాన్ని చిమ్మినట్లు పిల్లల్ని కనడం తప్ప దానికి వేరే సహజ నైజం లేదు. ఆ రాత్రి నాకు భయంకరమైన కల వచ్చింది. ఆ కలలో నాతో నా భార్య యిలా మాట్లాడింది.

— నే మోసి, కన్న సంతానాన్ని నా కలలు సృష్టించాయి. నా అందమే వాళ్ళ చక్కదనము. వారి ఆకలికి నా హృదయాన్నీ, వారి దాహానికి నా రక్తాన్నీ అర్పించాను. అమాయకంగా నా రొమ్ముల మీద పడుండి, నా ఆత్మలో నిద్రపోయి, జీవించి, శపించి, చివరకి చచ్చిపోతాను. నా కుటుంబం పెద్దవాడయ్యాడు. అప్పుడొక దుర్మార్గురాలు నరకాన్నించి వొచ్చి పాపని వొంగలించింది. దాని పెదవులూ క్రూరమైన కళ్లూ మత్తుతో ఎర్రగావున్నాయి. నన్ను తగలబెట్టేందుకు దాచుకున్న కాస్త బంగారాన్నీ దాని ముద్దుకోసం కరిగించి వేశాడు నా పుత్రుడు నా తలకింద దాచుకున్న బంగారం కోసం నిద్రపోతూన్నప్పుడు దొంగతనానికి వొచ్చాడు కుటుంబం. దురితంగా వస్తూన్న అతని అడుగులు నా హృదయంలో ప్రతి ధ్వనించాయి. తన మొహాన్ని వొంచి మెరుపు లాంటి కత్తిని నా గుండెలో త్రిప్పి నన్ను హత్యచేసిన ధ్వని. స్మశాన వాటికలో యితర కళేబరాల విధ్వంసక యజ్ఞాల ఆర్భాటంలో వినిపించ లేదు — మరణించినవాళ్లు మళ్ళా మరణించరు" అన్నవారు అసత్య వాదులు......

భయంతో మంచం మీద నుండి త్రుళ్ళిపడ్డాను. పక్క గదిలో దాని నొప్పులూ, మూల్గులూ వినిపిస్తూనేవున్నాయి. జనించబోయే శిశువుని ఎట్లా చంపను? వొడ్డుమీదికి విరిగి పడుతూన్న నల్లపిల్ల కెర

టాన్ని సముద్రం నడుమకి ఎట్లానెట్టను? ఉదయించబోయే సూర్యుణ్ని ఎట్లా ఆపను? నెట్టాలి, ఆపాలి, చంపాలి. చంపాలని లేచాను. అప్పుడే ఆకాశంలో సూర్యుడు ఒంటికాలివాడులా కుంటుకుంటూ లేస్తున్నాడు. చెరచెరా పరుగెట్టి, కాలుజారి మంచంకోడుకి నా మొహాన్ని కొట్టుకున్నాను. గాయంపడింది పెద్దగాయం, లోతుగాయం. కాని, కాని రక్తం రాదే! వున్మాదానికి రక్తం గడ్డగట్టింది కాబోలు: మంత్రసాని ఎదురుగా వచ్చి మొగశిశువు అని చెప్పి నవ్వుతూ నాకేసిచూసి, కెవ్వున కేకేసి చేతులో బెడ్ పాన్ వదిలేసి పరుగెట్టింది. పసివాడు ఏడుపు వినిపిస్తూనే వుంది, మహాసముద్రం జబ్బుతో మూలిగినట్లు. దాన్ని చూసి సాను భూతితో దాని ప్రియమైన మేఘాలు ఏడ్చి ధారగా వర్షించినట్లు. కాని ఆ యేడ్పు ఏ దిక్కునో తెలియడంలేదు. దాన్ని వెదుక్కుంటూ అటూ యిటూ పరుగులెట్టాను. వీధిలోకి వచ్చినట్లున్నాను. మంగలి నన్నుచూసి పొది వొదిలేసి బాబో అని పరుగెత్తడం మొదలెట్టాడు. వీధిగదిలో నిలబడి నుదురు తుడుచుకున్నాను. నుదుటిమీద గాయం. రక్తం మాత్రం లేదు.

ఎట్లా తెలిసిందో తాసిల్దారుకూడా చక్కావచ్చాడు. నన్నుచూసి గుమ్మంలో నిలబడిపోయాడు. కుర్చీ సర్ది "దయ చెయ్యండీ" అన్నాను. ఆయన మాట్లాడడు.

"మొగపిల్లాడుట. మరేం వొడుదుడుకు లేదు. రండి రండి."

ఆయన కొయ్యబారి నాకేసి అదేపనిగా చూడ్డం మొదలెట్టాడు. నాకాయనమీద కోపంవచ్చింది. దానికి పిల్లాడు పుట్టడంలో ఆయనకికూడా ఏమైనా వాటావుందా ? లేకపోతే, ఆయన కెందుకూ అంత కుతూహలం? అంత ఆశ్చర్యం ?

'శాస్త్రీ' నీ నుదుటిమీద ఏమిటదీ ? కన్నులాగ వుంది! అన్నాడు నా నుదుటికేసి తనవేలుతో చూపుతూ. తొందరలో నెట్టుతూంటె దెబ్బ తగిలింది.

"దెబ్బలాగలేదు. అద్దంలో చూసుకో. సరిగ్గా కన్నులాగ వుంది... మూడోకన్ను."

అద్దంలో చూసుకున్నా. ఏమీలేదు, మామూలుదెబ్బే! నల్లగా గొయ్యిలాపడింది. రక్తం కారకపోవడం వక్కటే విశేషం. భయపడుతూ దగ్గరగావచ్చి నా గాయాన్ని పరీక్షగా చూశాడు తాసిల్దారు.

"నిస్సందేహంగా మూడో నేత్రమే. అదేమిటి, దివ్యంగా మెరిసి పోతుంటేనే! నువ్వు ధన్యుడవు శాస్త్రీ! అవతార పురుషుడవు. యిప్పుడు నీ భార్యకి పుట్టిన పిల్లాడు కేవలం భగవంతుడే. అందుకు నిదర్శనం నీ మూడోకన్ను. నువ్వు త్రినేత్రుడవు" అంటూ చేతులు జోడించి నా కాళ్ళ మీద పడ్డాడు తహశిల్దారు.

ఈ పరిహాసానికి నా కోపం మరింత ఎక్కువయింది. ఈ తహశిల్దార్‌కి కొత్తగా పుట్టినపిల్లాడికి ఏదో సంబంధముందన్న నా అనుమానం బలపడుతోంది. అసలు విషయం కప్పిపుచ్చేటందుకు యిదేదో పన్నాగం కాని ఆ మంత్రసాని, ఆ మంగలీ యిలాగే ఆశ్చర్యం ప్రకటించి చకితులై పారిపొయ్యారే!

"తమరు పెద్ద అధికారులు. నే నేదో సామాన్యుడిని. నన్నిల్లా పరిహాసంచేస్తే ఎట్లా ?"

"పరిహాసం కాదు శాస్త్రిగారూ. నేటితో మీ జన్మ తరించింది. సృష్టి మీలో కొత్తరూపాన్ని తీసుకొచ్చింది. పాపాలన్నీ పూర్తిగా తొలిగి జన్మరాహిత్యానికి సిద్ధం కమ్మని దైవం మూడోనేత్రం ప్రసాదించింది మీకు. మిమ్మల్ని మేము పూజించాలి" అంటూ ఎన్నోమార్లు నమస్కారాలుచేసి తొందరగా నిష్క్రమించాడు తాశిల్దారు.

మానవుడి అనుభవాలు రెండువిధాలు - యింద్రియాల ద్వారా బాహ్యజగత్తు పరామర్శ; అంతరంగికంలో ఊహాజగత్తు. ఆనాటి నా అనుభవం ఈ రెంటికి అతీతమైనది. ఒక కాలు స్థూలజగత్తులో మరోకాలు అదోలోకంలో పెట్టినట్టుగా వుండి చూసి జీర్ణించుకోనానికి స్థిరంగావున్న

వస్తువు లేక ఆందోళనతో ఉక్కిరిబిక్కిరిచేసే ఘడియను వేగంగా గది లోకి పరిగెత్తాను. తలుపుసందులోంచి చూశాను. "అమ్మో నిజమేనే" అన్నది నా భార్య పక్క నుండింది నాకు. గదిలోకి ప్రవేశించాను.

"ఏమిటి నిజం ?" అని గర్జించ

"అమ్మో" మూడోకన్ను!

'దెబ్బ."

"అబ్బో ! కాదు, కాదు. అందరూ అంటే యేదో అనుకొన్నాను. మీరు నిజంగా భగవంతుడే అని చేతులు జోడించి నీరసంగా యేడ్చింది. పసిపాపను చూశాను. రాశిల్దారు జ్ఞాపకం వచ్చాడు. కొన్ని కోట్ల సంవత్స రాల క్రితం మానవుడింకా భూమి మీద ప్రవేశించని కాలంలో అతని పూర్వులైన పెద్ద పెద్ద మృగాలు సముద్రం నుండి నేలమీదికి ఎగబ్రాకి భూమిని స్వంతం చేసుకోడానికి సాగించిన ఘోర సమరంలో ఖర్చు పెట్టిన శక్తులన్నీ నాలో ఆ క్షణాన్న చెలరేగాయి నా చుట్టూ జగత్తుని నిర్మూలం చెయ్యాలి. లేకపోతే నా బ్రతుకు వెక్కిరింపై పోతుంది. రెండు కళ్ళుండి కూడా చూడలేకపోతున్నా యీ గుడ్డి ప్రపంచం నా మూడో కన్నుని క్షమిస్తుందా ? నేను చూడలేని మూడో కన్ను నా కెందుకు ? సృష్టి అవయవాలని మానవుడి ఆనందానికి, ఉనికికి సమ కూర్చింది. ఏ అవయవాన్ని సద్వినియోగం చెయ్యక విడిచేసినప్పుడు మానవుడికి నశింపు తప్పదు. ఉపయోగంలేని అవయవం కంటె మానవు డికి వేరే శత్రువు లేదు. భూమి నా కాళ్ళ క్రింద కదలడం మొదలెట్టింది. రంగులు కరిగి చీకటిగా మారుతుంది. సున్నాలు చదరాలుగాను, చదరాలు వంపులుగాను మంచిచెడ్డలు మట్టిగా, దైవం దెయ్యంగా, రాజకీయం రాళ్ళ కుప్పగా, అన్నీ వక దానిలో వకటి నిజరూపాలు చాలించుకొని క్రొత్త అవతారాలుగా రూపొంది కదిలిపోతూ వున్న జిజ్ఞాస నాలో వున్నా, నా కంటికేమీ అగపడక, నా వునికి రాహిత్యాన్ని మూడో కన్ను చాటుతోంది. ఆత్మహత్య తప్ప మరి మార్గంలేదు. లేదా, లోకాన్ని చంపడం, ఎవర్ని

చంపను ? పసిపాపనా ? భార్యనా ? తాసిల్దారునా ? పసిపాప ఏడుపు విని పీక నొక్కాలని వుంది. ఎట్లా చంపను ? వీధి గుమ్మంలోకి వెట్టిగా పరిగెత్తాను. మళ్ళీ ఎదురుగా వస్తున్న మంత్రసాని బాబో అని గెంతి పరిగెత్తింది. వీధిలో జనం గుంపులు గుంపులుగా మూగారు. సన్నాయి, డప్పులు, డోళ్ళు, తాళాలు, పోలీసులు, ప్లీడరు గుమాస్తా పరమ సింహము, పాలమ్మి, నాగులు, డాక్టరు నర్సింహులు, వీళ్ళ నాయకుడు తాశీల్దారు పూలమాల మెళ్ళో వేసి నమస్కరించి భజన చేయడం మొదలు పెట్టారు. పాటలు, పొగడ్తలు, హారతులు, మంత్ర పఠనం. నాకు పిచ్చెత్తి పోతోంది ?

'నేను పిచ్చి వాణ్ణి. దయచేసి మీరు వెళ్ళండి.' జనం గుస గుసలు. పెద్దగోల. పూర్వసువాసినుల బృందం వచ్చి కొబ్బరికాయలు కొట్టడం మొదలెట్టారు. ఏం చెయ్యను.

"నేను పిచ్చివాణ్ణి వెళ్ళండి."

"ఓ పరమాత్మా ! నువ్వు యీ రూపంగా మాకు దర్శనం యిచ్చావా ? మమ్మల్ని పరీక్ష చెయ్యవద్దు. మాకు నీలో చేరుకునే మార్గం బోధించండి" అన్నా రందరూ.

ఒకటే మార్గం. నా కన్ను పోగొట్టడం, తాశీల్దారు ఉద్యోగం తీసెయ్యడం — ఈ రెండూ చేస్తిరా మీకీ క్షణాన్న మోక్షం వస్తుంది.

"హే ప్రభూ ! నా ఉద్యోగానికి ఈ క్షణమే రాజీనామాయిస్తాను ఈ పాపిని మీ పాదసేవ చెయ్యనివ్వండి" అన్నాడు తాశీల్దారు.

ఎట్లా చావను ?

"మీ రంతా పిచ్చివాళ్ళు పొండి" అన్నా వళ్ళు మండి. అందరూ చెంపలేసుకొన్నారు. మళ్ళా గంటలూ, డప్పులూ, శంఖాలు, బాకాలు ప్రారంభం.

'నిజం, ఓ మహా పురుషుడా — ఓ త్రినేత్రుడా ! మేము పిచ్చి వాళ్ళం. శుంఠలం, పశువులం, మహా పాపులం. మమ్మల్ని శిక్షించు, దండించు, చంపు కాని మోక్షం మాత్రం ప్రసాదించు'.

వారు నన్ను తోసేసి లోపలపడి తలుపులు గడియ పెట్టారు. బయిట భజనలు సాగుతున్నాయి నన్ను చూసి నేను భయపడ్డాను. అంతా కలగా వుంది. కాని కలకాదు. యధార్థం ఇంత మందికి అగుపడు తూవున్న మూడో కన్ను నా కెందుకు కనపడదు? వీళ్ళంతా గుడ్డి వాళ్ళా లేక నేనే గుడ్డివాడ్నా ? సమాజానికి మతం అంటే యింత పిచ్చా ? దానికి ఆత్మవికాసంతో నిమిత్తంలేదు. ప్రతిదానికి బహిర్గతచిహ్నం కావాలి. ఆంజనే యులువాళ్ళదగ్గరకొచ్చి నేనే దైవాన్నంటే తోక చూపమంటారు. బహిర్గత చిహ్నాలు లేకుండా సంఘం జీవితపు విలువల్ని అర్థం చేసుకోలేదు. ఒక మోటారు, రేడియో గ్రామ్, బ్యాంక్ అక్కౌంటు వుంటే ధనికుడు. నలుగురు బంట్రోతులు సలాం చేస్తే హోదా. ఇతరుల కర్థం కాని వేదాలను పఠిస్తే పండితుడు. తనకి అర్థంకాని భాషలో సృష్టిని గురించి వితర్కిస్తే వేదాంతి. తిండిలేక మాడడం ఆధ్యాత్మికం. దేవుడుకూడా భక్తులకు బానిస కాబట్టి నా మూడో నేత్రం నా బానిసత్వానికి చిహ్నం.

నేను దైవాన్నని నిశ్చయం చేసుకున్నా, తలుపుతీసి దర్శనం యిచ్చా. మళ్ళా హారతులు, కొబ్బరికాయలు, అర్చనలు, ఆరాధనలు — నా కిదంతా బాగానే వుంది. తాసిల్దారుని కసితీరా బుజాల మీద తన్నాను. పరమ శివానికి నేను పది రూపాయలు బాకీ — ఇంక చస్తే అడగడు నన్ను. పైపెచ్చు పెళ్ళాం పుస్తెలేనా అమ్మి నా కేదో కానుక యిచ్చుకుంటాడు. హెడ్ క్లర్క్ ఆఫీసుకి అరు నిమిషా లాలస్యంగా వెళ్ళానని అరగంట లెక్చరిచ్చాడు మొన్న. రానీ చెబుతా వాడి పని. మానవ ప్రపంచంలో దేవుడికున్నంత పలుకుబడి ఏ ప్రతిభాశాలికీ లేదు. ఏమిటి కారణము ? బలహీనుడు బలవంతుణ్ణి చూసి "నీ కంటె బలం గల దేవుడున్నాడు పోవోయ్' అనొచ్చు. లేని వాడు వున్నవాణ్ణి చూసి 'నీ కందతా దేవుడిచ్చాడు, నీ గొప్పే మేడిసింది' అనొచ్చు. పైగా అన్ని పాపాలూ, అసత్యాలూ, పశుత్వాలూ దేవుడి మీద తోసెయ్యవచ్చు. మానవుడి పశుత్వానికి 'మతం' వొక బహిర్గత చిహ్నం కాబోలు ! పశువుగా వుండడం మానుకుని, మానవత్వం సంపాదించినప్పుడు మతం మాయమౌతుంధి,

'ఆ మొన్నాడు రాజాగారి వద్ద నుండి ఏనుగుని తీసుకొచ్చారు రాజాగారికీ రాణీగారికీ దర్శనం యిచ్చాను. ధన్యులయ్యారు. నన్ను వాళ్ళ భవనంలో వుంచేసుకుంటా మన్నారు. ఆనాడు జనం చేసిన కల్లోలము చూస్తే నన్నక్కడే చంపేసి నా చుట్టూ గుడి కట్టేస్తారేమోనని భయం వేసింది. ఏనుగు మీద రాత్రంతా ఊరేగించారు. అంబారీ మీద పాలు త్రాగి హాయిగా పడుకున్నా. మధ్యలో తాసీల్దారు ఊరేగింపులో వున్నాడా లేడా అని లేచి చూసేవాణ్ణి. ఇంకా ఆయన నా యింటి కెళ్ళి యే మన్నా చేస్తాడన్న భయం, అనుమానం పూర్తిగా వదలందే ! పాపం తాసీల్దారు రాత్రంతా ఊరేగింపులోనే వున్నాడు. ఆయనకేసి చూసినప్పుడల్లా, తను నా అభిమానభక్తుడైనట్లు మొహం కొండంత చేసుకుని గర్వముగా తన్మయత చెందేవాడు.

మూడోనాడు పొరుగూళ్ళ నుంచి జనం నన్ను చూడడానికి ఎగబడ్డారు. ఆనాడు ఉదయమే నన్ను ఊరేగింపుకు తీసుకుపొయ్యారు. ఆ వొచ్చిన వారిలో ఇద్దరు దొరలు కూడా వున్నారు. నన్ను చూసి టోపీలు తీసి, చేత్తో రెండు భుజాలూ ముట్టు కున్నారు. నాకు ఆ అనుభవం చిత్రంగా వున్నా మనస్సంతా యింటి మీదే వుండేది. నా భార్య, నా పిల్లాడు ఎట్లా వున్నారోనని. నే నెంత బ్రతిమలాడినా, వొక్కళ్ళూ నా యింటి దగ్గరుండి, నా భార్యకి సహాయం చేసిన వాళ్ళు లేరు. ఇదేం మనుషులో, వీళ్ళకి బ్రతికివున్న వాళ్ళంటేపొత్తిగా గౌరవంలేదు. వీళ్ళదృష్టిలో మనిషి, మనిషి కావాలంటే చావాలి.

నన్ను ఇంటికి పోనివ్వండి అని మొరెట్టుకున్నాను. వినిపించుకోలేదు కోప్పడ్డాను. మూడో నేత్రంమూసేస్తానన్నాను. సాయంత్రానికి ఇంటికి జేరేశారు. ఈ మార్పుకీ, యీ పిచ్చికి కారణం పసిపిల్లాడు—వాడు నాకు పుట్టలేదని అనుమానం. పీకనొక్కి చంపేస్తే? చరచరా గదిలో ్కను.

తొందర్లో కాలు జారి మంచంకోడుకి నా మొహాన్ని కొట్టుకున్నాను. ఇదివరకు లాగానే నుదుటిపైన మూడో నేత్రానికి తగిలింది. లేచి చూశా. ఎదురుగా మంత్రసాని నిలబడి, తల వొంచుకొని 'పాప చచ్చిపొయ్యాడు' అని రెండు చేతుల్లో తన మొహాన్ని దాచుకొని గోడవెంపుకు నడిచింది. దెబ్బచోట సుదురు మండుతోంది. చెమట్లుపోశాయి. చేత్తో తుడుచుకున్నాను; రక్తం బొటబొటా కారుతోంది.

నా భార్య మూలుగూ, ఏడుపూ మొదలెట్టింది. నన్ను చూసి భయపడింది, 'అయ్యో! కన్ను పోయింది. రక్తం, రక్తం. తడిగుడ్డ కట్టండి.

ఓదార్చడం మొదలెట్టాను వాన కురిసి వెలిసినట్లుగా నాహృదయం చల్లబడి ప్రశాంతంగా మారింది. అసూయ లేదు; కోపం లేదు; విచారం అసలేలేదు. నా మూడో నేత్రంతోపాటు నా ఉద్రేకాలన్నీ పొయ్యాయి.

'లే, లే, ఏడవకు. కుటుంబం నాకు; కుముదం నీకు; పసిపాప దైవానికి. ఇక నన్ను చూసి నువ్వుభయపడనక్కర్లేదు. మూడోకన్ను లేదు. నేను మామూలు మనిషినే...'

కథ ముగిసింది కాబోలు శాస్త్రిగారు మాట్లాడడం మానేసి నిశ్శబ్దంలో పడ్డారు. అప్పటికి మేం ఊరుబైటికివచ్చినట్లు గ్రహించుకున్నాను. దూరంగా అదిస్మశానం. సూర్యుడు కిందికి పోతూ ఒక్కసారి మాకేసి చూసి కన్నుగీటాడు. శాస్త్రిగారు కథ చెప్పినప్పుడు నాకెన్నో సందేహాలు తోచినా, ఇప్పుడు అడగడానికి ఒక్క ప్రశ్నకూడా కనబడలేదు. ఆ కథ నిజమా, అబద్ధమా అన్న సమస్యే రాలేదు. మానవుడి అనుభవానికి 'సంభవం' అన్నది సరిహద్దు కాదు కాబోలు.

'అదిగో, ఆ చెట్టుకిందే యీ చేతులతో ఆ పసిపాపని పారేశాను' అన్నారు శాస్త్రిగారు పెర్రిగా నవ్వుతూ. నా కళ్ళు అప్రయత్నంగా తడిశాయి.

'వాడు పంటరిగా వున్నా డనుకోవద్దు. వాడి తల్లి కూడా ముంచుకు పోయినట్లు పదేళ్ళలో వాడిపక్కనే పడుకుంది. నా మూడోకన్ను తెరిచానంటే వాళ్ళిద్దర్నీ చూడగలను - అదిగో...'

నే నాయనకేసి చూడలేకపొయ్యాను. నా కంటతడి నాకే సిగ్గేగింది. ఆయన ప్రాకృతిశక్తులలో ఒక శక్తిలా గోచరించాడు. ఆ గుట్టలు, ఆ చెట్లు, ఆయన - అందరూ సృష్టిలో లీనమయిపోయి గిరగిరా తిరిగిపోతున్నారు.

ఆయనచెయ్యి గట్టిగా పట్టుకున్నా. ఇద్దరం ఇంటివేపు నడవడం మొదలెట్టాం. ఊరుదగ్గరకి రాగానే ధైర్యం తెచ్చుకుని - "మీ మూడో నేత్రం దేనికి బహిర్గతచిహ్నమో చెప్పారు కారు" అన్నాను.

"అసత్యానికీ, అంధత్వానికీ"

నా కర్థంకాలేదు.

# మీరూ, నేనూ, మాఘమ్

ఏదో ఒక కథ అల్లేటందుకు కావల్సిన అనుభవాన్ని లాగకుండా ఏ వ్యక్తితోనూ గంట ప్రసంగించలేదు—అన్నాడు ప్రసిద్ధ కథా రచయిత సామర్సెట్ మాఘం. అంతటి పరిశీలనాబలం, సూక్ష్మబుద్ధీ ఆయనలో వున్నాయన్న విషయం ఆయన కథలు చాలా చదివాకాబట్టి నేను సంశయించను కాని, పైవాక్యం ప్రగల్భంలా తోస్తుంది. ఆయన ప్రపంచం అంతా తిరిగి వచ్చాడు. వయస్సు దాదాపు యెనభైయేడేళ్ళు. జీవితకాలంలో రోజుకి ఒక కొత్తవ్యక్తి చొప్పున కలుసుకున్నా, షుమారు ఇరవైఏడు వేలమంది వ్యక్తులతో ఒక గంటేనా ప్రసంగించివుండాలి. రోజల్లా పరిచయం ఇచ్చినవారి సంఖ్య కనీసం వెయ్యి అనుకున్నా, ఆయన వ్రాసిన కథల సంఖ్య వెయ్యి కాదు.

"నేను, గంట పరిచయంగల వ్యక్తు లెందరుంటే అన్ని కథలూ వ్రాయగలను కాని, దానికి నాజీవితం చాలదు" అని మాఘమ్ సమాధానం ఇవ్వొచ్చు. విలువగల ఐదొందల కథలు వ్రాయడానికి జీవితకాలం సరి పడుతుంది. "నేను విలువ గల గథలు వ్రాస్తానని హామీ ఇవ్వలేదు" అని మాఘమ్ అంటే మనం బహాయి ప్రకర్షపై దాడిచెయ్యక్కర్లేదు.

మాఘమ్ ప్రశంస తేవడానికి మరేం కారణం లేదు. ఒక సంవత్సరంపాటు పరిశీలించే అవకాశంవున్నా మాఘమ్ పద్మావతిని గురించి ఏ కథని అల్లేటందుకు తగినంత వస్తువును సేకరించలేదని ధాటీగా చెప్పగలదు. "ఏదో అసాధారణమైన వక్రచూపు, వకచేష్ట, మాటలో మార్దవం, అప్రయత్నంగా వెలువడిన వాక్యంలో పదజాలం, విచారంతో ఒదిగిన పెదవులసొంపు, నవ్వుస్ఫురింజేసే కనురెప్పల తళ తళ—వీటిని గ్రహించడానికి గంట చాలు. వీటిల్లోంచే కథని అల్లగలను, అంటాడు మాఘమ్. ఇంతటి నిస్సారమైన, అస్పష్టమైన తాత్కాలిక సూచనల

నాధారంచేసుకుని అల్లిన కథ పేకడ, పొగమంచుని పటాపంచలుచేసే యత్నంగా పరిణమించి చివరికి రచయిత మన స్తత్వమే కథకి వస్తువుగా తయారవచ్చు. నిర్ణయించిన కథా వస్తువు పరిణామం సరైనదని ఒప్పుకున్నా ఏది అసాధారణమైనచూపో, ఏది అప్రయత్నంగా వెలువడిన వాక్యమో గంటలో నిర్ణయించడం అసాధ్యమనుకుంటాను. అది పదేళ్ళ పాటు కాపరంచేసిన భర్తకి సాధ్యం కావచ్చునేమో! అప్పుడుకూడా, తన విజ్ఞానాన్ని భార్యముందు ప్రకటించ కూడదు. ప్రకటించిన పక్షంలో దాంపత్యంలో తికమకలు రాకమానవు ఆ తికమకల ప్రాబల్యం నిత్య వాతావరణంలో బహిర్గతమైనప్పుడే, మాఘమ్‌లాంటి రచయితలకు కథా వస్తువు దొరకొచ్చు. ఆ భాగ్యం గంటలో లభిస్తుందనుకోను.

దగ్గరదగ్గరగా మూడేళ్ళు పద్మావతిసంసారాన్ని పరిశీలించే అవకాశం నాకుగల్గినా మచ్చుకి ముచ్చటించేటందుకు ఒక్క తికమక కూడా నా దృష్టిలోకి రాలేదు. నేను పద్మావతిని గురించి వ్రాయడానికి కూడా ఈ రకం సాధారణత్వమే. కనీసం వ్రాసినప్పుడేనా, వోరకం అల్లిక, స్ఫుటమైన పొందిక అసాధారణత్వాన్ని అలవర్చుకుంటాయేమో చూద్దామనే వ్రాయడానికి సంకల్పించాను. ఈ సంకల్పంలో నాకు చదువరి తోడ్పాటు ఎంతో అవసరం. చదువరి అభిప్రాయాలనీ, అనుభవాలనీ నాతో పంచుకోమనడంలేదు. కాని నాకూ, చదువరికీ సంఘాన్ని గురించి—నిర్వివాదమైన ముఖ్య విషయాలపై ఏకీభావం ఉండాలి. ఉభయులం సాంప్రదాయాన్ని ఆమోదించాలి. ఆచారాన్ని, సాంఘిక ప్రయోజనాన్ని తృణీకరించినప్పుడు, ఆ తృణీకారం చేష్టలో కాని, మాటలో కాని వ్యక్తమై, ఏదో రకమైన ఒత్తిడి, అలజడి కలిగించినప్పుడు, అసాధారణ పరిస్థితి ఏర్పడి, వ్యక్తిగత జీవితంలో వోరకం సమస్య బైలుదేరి మాఘమ్‌లాంటి రచయితలు విలువగల కథలు వ్రాసే అవకాశాలు సిద్ధిస్తాయని ఉభయులం అంగీకరించాలి. కుటుంబ సాంప్రదాయానికి విరుద్ధమైన ప్రవర్తన అసాధారణమైనదని వొప్పుకుంటే నేనూ, చదువరీ

ఆ ప్రవర్తనకి విలువలు కట్టడంలో ఏకీభవించనక్కర్లేదు. అట్టి ప్రవర్త నకి కారకులైన వ్యక్తులపై ద్వేషం గాని, సానుభూతి గాని ప్రబలంగా వుండొచ్చు. చదువరిలో నాలోవున్న సానుభూతిని రేకెత్తించ గల్గితే, యిప్పుడు సాగుతున్న రచన నిష్ప్రయోజనం కాదని తృప్తిపడతాను.

కారణం ఏమిటంటే, సామాన్యంగా మనలో చాలామంది ముఖ్య సమస్యలని స్వతంత్రించి ఎదుర్కోము. వాటి పరిష్కారం యితరులకి వొదిలేస్తాము. అల్లాగే వ్యక్తులను గురించి మనకి స్పష్టమైన అభిప్రాయం గాని, 'అనుభూతి'గాని ఉండదు. ద్వేషించం; సానుభూతి ప్రకటించం; అసలు వారిని గుర్తించం.

గుర్తించి, విలువకట్టేవాళ్ళు ఎవరేనా ఉంటే వారిని మెచ్చుకుంటాం. అందుకనే కథలకి యీ రోజుల్లో అంత ప్రచారం వుంది. కథలలో విలువలు కట్టే యత్నం కాస్తో, కూస్తో జరుగుతుంది. సమస్యలను ఎదు ర్కొనే 'యితరులు', విలువలు కట్టే రచయితలు లేనప్పుడు సంప్ర దాయం వేళ్ళుపాతుకుంటుంది. సంస్కృతి, కళ లోపల కుళ్ళి, పైకి ప్రమాదకరంగా ఘనీభవిస్తాయి. అంతటితో ఆ నాగరికత చస్తుంది.

వ్యక్తులంతా నాగరికతని రక్షించడానికీ, సంస్కృతినీ కళలనీ పెంపొందించడానికీ, సాంప్రదాయంపై విప్లవంచేసి, అసాధారణ వ్యక్తులై స్థిరత్వాన్ని నిర్మూలంచేసే విధ్వంసక శక్తులుగా మారాలని వాదించడం లేదు నేను.

ప్రతియుగంలోనూ కొందరు అట్లాంటివారు వుంటూనే వుంటారు. మిగతా వారందరూ సంఘాన్ని, సంప్రదాయాన్నీ నిలబెడతారు.

పద్మావతి యిట్లాంటివారిలోకి చేరుతుందనుకుంటాను.

నే ఎరుగున్నప్పుడు, పద్మావతికి వయస్సు యించుమించు నలభై. భర్త డాక్టరు. ఏడెనిమిదేళ్ళు ఆమెకంటె పెద్ద. వారికి ముగ్గురు ఆడపిల్లలు, యిద్దరు మొగపిల్లలు. పెద్దమ్మాయికి పదహారోయేడు, చివరివాడికి రెండో యేడు. భర్త నాగభూషణం ప్రాక్టీస్ కూడా మరీ మంచిది కాకపోయినా

మంచిదే. అతనికి వో పదెకరాల భూమికూడా ఉంది. వార్ని గురించి చెప్పేటందుకు నా కింకేమీ కనబడలేదు.

సామాన్య వ్యక్తులను గురించి వ్రాద్దామని సంకల్పించిన రచయితలు తమ కథలలో నాయికా నాయకులను అసాధారణ వ్యక్తులుగా చూపేటందుకు వింతయత్నాలు చేస్తుంటారు. మాఘమ్ కథలన్నింటిలోనూ, నాయిక చాలా అందమైనది. పూర్వపు రచయితలు, వ్యక్తి వర్ణనంతా తైలచిత్రం క్రింద, వొకేసారి కొన్ని పుటలలో గుచ్చెత్తి వ్రాసేస్తారు. మాఘమ్ అల్లాకాదు; చమత్కారంగా ఓ పుటలో కళ్ళని, మరోచోట ముక్కుని, ఒకప్పుడు చలాకిని, మరొకప్పుడు కంఠాన్ని, మెరపుల్లా ప్రదర్శించి, చివరికి అతను, మనం, యింతటి అందమైన స్త్రీని కలుసుకునే భాగ్యం ఈ కథ మూలంగా కలిగించుకునే భ్రమని కలగచేస్తాడు. ఈ చమత్కారాన్ని మెచ్చుకుందాం. కాని యిది అన్యాయమని ఒప్పుకోవాలి. అంత అందమైన స్త్రీగనకైతే సామాన్య స్త్రీ కాలేదు ఉన్నత సమాజానికి చెందిన అపూర్వవ్యక్తి అవుతుంది. అట్లాంటి వారి పరిచయం రచయితకి సాధ్యమే కాదంటాను. ఇక పురుషులూ అంతే, నాయకులు బలశాలులో, ప్రతిభాశాలులో, కళావేత్తలో, రచయితలో, ఎందుకూ పనికిరాని అందమైన వాజమ్మలో అయివుండాలి. సామాన్య వ్యక్తుల అసాధారణత్వానికి రచయిత అసాధారణత్వమే శరణ్యం కాబోలు. రచయితలూ, చదువరులూ ప్రజాస్వామ్యంలో అధిక సంఖ్యాకులు సామాన్యులవడం మూలాన యీ ఆత్మవంచన పరస్పరం— అందుచేత విమర్శనీయం కాదు.

పద్మావతి అనాకారి అనను. మనం రైళ్ళల్లో, ట్రాముల్లో, రోడ్ల మీద, నిత్యమూ చూస్తున్న అనేకమంది స్త్రీలలో ఆమె ఒకతి. ఆమెని చూస్తాం — మనదృష్టిలో పడినప్పుడు, వెళ్ళింతర్వాత, వెనక్కి తిరిగి చూడడం. కళ్ళున్నాయికనక చూస్తాయి. చూసినట్టు మనం గుర్తించక పోవడంకూడా అసంభవం కాదు. యౌవనం గడిచిపోయిన స్త్రీని వర్ణించే

టిందుకు మాఘమ్ ఒక చమత్కారం చూపుతాడు. అది, ఆమె యిరవై యేండ్లకింద ఎట్లా ఉండేదో వూహించడం, లేకపోతే అట్లా చూసిన వ్యక్తిని నాయకుణ్ణిగా మన నెత్తిన రుద్దటం.

మరెవ్వరూ లేరు గనుక, మనకి నాయకుడు నాగభూషణమే. అతని డిస్పెన్సరీ యింట్లో లేదు. ఆ వీధిలోనే మరో యింట్లో.

సూటు వేస్తుంటాడు; పంచి, లాచ్చీ వేస్తుంటాడు. ఇంట్లో పైజామా వేస్తుంటాడు. వయస్సు మళ్ళినవారు లావుగా వుంటే ఆ లావుని గురించి చెప్పకోము. భార్యకూడా అంతలావుగా ఉంటే, అసలే చెప్పకోము. పద్మావతీ, నాగభూషణం అట్లాంటివారే. జుట్టు ఇద్దరికీ సమంగా నెరుస్తోంది, సమంగా పల్చబడుతోందన్నాకూడా తప్పులేదు. ఇద్దరూ అనాకారులుగారు. ఇట్లా చెప్పడంవల్ల పాఠకులకి ఈ వ్యక్తులు వర్ణిత మయ్యారనుకోడంలేదు. ఊహించుకుని, సహకరించమని ప్రథమంలోనే కోరాను.

ఆ యింట్లో మరోవ్యక్తి వున్నాడు. అతనిపేరు వేలాయుధం. మొదట డిస్పెన్సరీలో ఉంటూ, తరువాత యింటి నౌకరుగా కుదురు కున్నాడు. అతని సంసారం చట్టుబండలూ ఉండేమో నాకు తెలవదు. అతని వయస్సు యాభై పైన.

ఇహ నేను మిగిలాను. మాఘమ్ కథలలో 'నేను' అని వ్రాసినవి చాలా వున్నాయి. అందులో 'నేను' ఎంత వరకూ అసలు మాఘమో, కల్పిత వ్యక్తో, ఎవరికీ, తుదకు మాఘమ్‌కి కూడా తెలియదు. ఇందులో నేనూ అంతే. ఆ రోజుల్లో మెడికల్ కాలేజీలో చదువుకుంటున్నా. నాగ భూషణం గారింటి రెండో వాటాలో కాపరం వుండేవాణ్ణి. ఒక సంవ త్సరం హోటల్లో తింటూ వొంటిగా వున్నాను. మరో సంవత్సరం, మా పిన్నమ్మతో వంట తతంగం పెట్టుకొని చదువుకునే వాణ్ణి.

నాగభూషణం గారు డాక్టరవడమే ఆయనకీ నాకూ కొంత అన్యో న్యము ఏర్పడ్డానికి కారణమేమో అనిపిస్తుంది. ఆయన మనస్తత్వం నాకు

పూర్తిగా బోధపడినట్లనిపించేది ఎందుకో. కాని పద్మావతి గార్ని గురించి నాకేమీ తెలీనట్లుండేది. లేకపోతే ఆవిడలో కొంత చీకటి, మసగ, వుందను కుంటే, నాకు తృప్తిగా ఉండేదో తెలీదు. ఆవిడ అర్థంకాకపోవడంలో అసాధారణత్వంవుందని యితరులు అనుకోవాలని, ఆమె అనుకునేదా ? లేక అట్లా అనుకుంటే ఆవిడ తృప్తిపడి, మరింత అర్థం కాకుండావుంటూ అర్థం చేసుకోండని సవాలుచేస్తూ మసగని మరింత చీకటిచేసి, దగాలో తన వ్యక్తిత్వాన్ని సాధించిందా ? ఏమో — నా కిదంతా గంద్రగోళంగా వుంది. పాఠకుడి స్వానుభవానికి విడిచిపెడతా.

కాని, ఒక్క విషయం. యిప్పుడిప్పుడు జ్ఞప్తికొస్తుంది. పద్మావతి హృదయంలో వెలుగు సోకని రహస్య మందిరాలు, ఇంద్రియాలు శోధించని కోణాలున్నాయనీ అనుకున్నది. నేనొక్కణ్ణే కాదు. నాగభూషణం గారు కూడా యీ విధమైన ఆంతర్యం, భార్యని గురించి వుందన్నట్లుగా వుంటారు.

మా అన్యోన్యానికి యిదొక కారణం కావొచ్చు.

అన్యోన్యం మాటల్లో ప్రదర్శిత మౌతుంది.

కాని మా స్నేహంలో మాటలకి ఎక్కువ తావులేదు. ఎప్పుడేనా వారి ముందుగదిలో కెళ్ళి పేపరు చదివి ముచ్చటించడం. ఆయన ఏదేనా విచిత్రమైన కేసు గురించి చెప్తుంటే వినడం — అంతే. అదే నా శనాది వారాల్లో. మిగతా రోజుల్లో ఆయన డిస్పెన్సరీలో, నేను కాలేజీలో.

వారింటికి అప్పుడప్పుడు ఆయన తాలూకు బంధువులో, ఆవిడ తాలూకు బంధువులో వొచ్చి పోతుండేవారు. ఆ సందర్భాలలో వారిలో కుర్రకారుతో నాకు పరిచయం కలిగేది.

పై గదిలో చోటుచాలక వారు నా గదిలోనే వుంటుండేవారు. వాళ్ళలో రాఘవరావుతో – పద్మావతి తమ్ముడు – నాకు ఎక్కువ పరిచయం కూడా కలిగింది. అతను అక్కయ్య, బావలని గురించి ప్రస్తావిస్తుండే వాడు — మామూలు గొడవలే. నాకు ఒక్కటీ విశేషం కనిపించ లేదు.

శనాదివారాల్లో పద్మావతి గారు, నన్ను హోటలికి వెళ్ళనిచ్చేది కాదు. వారింట్లోనే భోజనం, కాఫీలు. నాగభూషణం గారు కేసులు చూచుకొని, వొక్కొక్క రోజున యింటికి రావడం ఆలస్యమయ్యేది. పిల్లలందరూ పడుకునే వారు. పద్మావతి గారూ, నేనూ చాలా సేపు కబుర్లు చెప్పుకొనే వాళ్ళం.

ఒకటి రెండు విషయాలు నాకు జ్ఞాపకం వున్నాయి. ఆవిడ తరచు, తన పుట్టింటి వారి స్తోత్రం సాగించేది. పెద్దక్క కోయంబత్తూర్‌లో వుంటూంది. ఆవిడ భర్త పెద్ద ఇంజనీరు, ఎనిమిదొందలు జీతం, కారూ అదీ వుంది. అన్నగారు పెంపకం - సాలుకి పదివేలు తెచ్చే ఆస్తికి ఆసామీ. రెండో అప్పగారి భర్త జడ్జి. మూడో తమ్ముడికి బర్మాలో వుద్యోగం. చెల్లెలు మొగుడు డి. యి. వో. ఒకప్పగారి భర్త యిటీవలనే చనిపొయ్యాడు. పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా వుండే వారుట. మొత్తంమ్మీద ఆవిడ బంధుకోటి అంతా పెద్ద హోదాలో వుంటున్న వారే, మనస్సుకి నొప్పి కలగకపోతే, ఆంధ్రదేశం అంతా, బొమ్మజెముడు కంపలా, ఆవిడ బంధుకోటి వ్యాప్తి చెందారా అనబుద్ధేస్తుంది.

రెండో సంవత్సరం - నేను కాపరం పెట్టిన ఏడు — కూడా వారిని గురించి చెప్పుకోదగ్గ విశేషం వొక్కటీ నా దృష్టిలో పడలేదు. రెండో అమ్మాయి రజస్వల కావడం, నాలుగోవాడి వొడుగు, రెండో అమ్మాయికి టైఫాయిడొచ్చి, నిమ్మిళించడం - అవే విశేషాలు. అప్పుడప్పుడు, పద్మావతికి వాళ్ళ పెద్దమ్మాయిని నాకిచ్చి వివాహం చేద్దామని వుండేదా అని, క్షణం స్ఫురించేది. కాని పద్మావతి గారి సంభాషణవల్ల నా అపోహలకి తావు లేకుండా పోయింది. అసలు 'మా అమ్మాయి పెండ్లే చేసుకోదు' అంది ఖచ్చితంగా — తనని మళ్ళా జీవించమంటే పెండ్లి చేసుకోకుండా వుండి వుందునన్న 'ధ్వని' ఆ వాక్యంలో వుందని నా అనుమానం.

ఓసారి ఏదో మాట సందర్భంలో నేను యీ విషయం నాగభూషణం గారితో అనేశాను. ఆయన యిల్లా అన్నారు.

'అవునవును, చేసుకోదు..."

'మీ అభిప్రాయం కూడా అదేనా? అన్నాను.

"చేసుకోక పోవడం అమ్మాయి హక్కు" చెయ్యడం నా బాధ్యత."

"నా కర్థం కావడంలేదు"

"పద్మావతి చలాయించిన హక్కునీ, అమ్మాయి విషయంలో బాధ్యత క్రింద మారుస్తోంది."

"అసలర్థం కావడం లేదండో" అన్నాను.

"నీ విషయం చెబుదూ. నువ్వింకా ఎందుకు చేసుకోలేదు ?"

ఆలయన ధోరణి తప్పించడానికి యత్నిస్తున్నట్లనిపించి, నేనూ మరో విషయంలోకి సంభాషణ దింపేశాను.

నాగభూషణంగారు, పిల్లలూ, నేనూ – అందరం అప్పుడప్పుడు సినిమాకి వెడుతుండే వాళ్ళం. మాతో ఎప్పుడూ పద్మావతి గారు వొచ్చే వారు కారు. ఎందుకో నాకు తెలీదు. ఒక రోజున అడిగేశాను. ఆవిడ నవ్వింది. నా క్కోపం వొచ్చింది. ఆవిడ సినిమా చూడకపోతే, ఆంధ్ర దేశాని కేదో ముప్పు ఘాటిల్లినట్లు ! శిఖరంపై నవ్వితే ప్రతిధ్వని వినిపించదుగా !

"కాలక్షేపానికి సినిమాలూ, నాటకాలూ అంటూ లేకపోతే, జీవితంపై మొహం మొత్తుతుందంటారు కదా, మీరు సినిమాల కెందుకెళ్ళ ?" అని అడిగాను.

"ఇంట్లో సినిమా చాలకనా ?" అంది ఇంట్లో సినిమా ఏమిటో నా కప్పుడూ అర్థం కాలేదు. యిప్పుడూ కాలేదు.

"అంటే"

"ఏం చెప్పను ? ఇదంతా వొక సిమాలాగుంది నాకు" అన్నది. పద్మావతి గారికి సంసారంపై కలిగిన విముఖత్వానికి తగిన ఆధా

రపు కనబళ్ళేదు. పరిస్థితులకు మించిన వుద్రేకం, ఎప్పటికీ వోటిదే అని నా నమ్మకం.

మరోసారి మూడోవాడికి జబ్బుచేసింది. నేను, నాగభూషణంగారు, కాంపౌండర్లు కుర్రాడిని కనిపెట్టుకునే ఉండేవాళ్ళం. పద్మావతిగారికి మాత్రం రోజల్లా వంటింట్లోనే సరిపొయ్యేది. అబ్బాయి, ఎల్లా ఉన్నాడో చూడ్డానికి ఆవిడకి తీరెదేకాదు. నేను, ఆ నాలుగురోజులూ అయ్యర్ని వంటకి పిలిపిస్తానంటే ఆవిడ ఒప్పుకోలేదు. అబ్బాయి విషయంలో ఆవిడ ఆదుర్దా చూపకపోవడం కాస్త ఆశ్చర్యం వేసింది.

"పిల్లలన్నా తర్వాత జబ్బులు చెయ్యకుండా వుంటయ్యా-డాక్టరు గారి పిల్లలకి జబ్బులకేం కొదవ!" అంది నవ్వుతూనే. నే నప్పట్లో లోలోన విసుక్కున్నాను కూడా. ఈ సంతానం తనకి పుట్టనట్లు మాట్లాడు తుందేం మహా! అబ్బాయికి కొంచెం తగ్గింతర్వాత, నే నన్నాను.

"మీరు చాలా పాటుపడుతున్నారు."

"ఏ పాటు తప్పినా నా పాటు తప్పదుగా!" అంటూ నవ్వింది.

సాధారణంగా తల్లులు, అబ్బాయికి కాస్తంత నలతగా వుంటే కంట నీరెట్టుకుంటారు. పద్మావతి విముఖత్వం ఆలోచిస్తే, ఇప్పుడు అసాధారణంగా కనిపిస్తోంది. కథలు వ్రాసేవారికీ, చదివేవారికీ, వ్యక్తులపై గురి, నమ్మకం కలగవు. అందరూ పాత్రలుగా నటిస్తున్నట్లు కనిపిస్తారు. వాళ్ళ మాటలు నమ్మలేం. మనమీద మనకే గురితప్పి నప్పుడు, ఇతరుల మీద తప్పడంలో ఆశ్చర్యం ఏముంది! ఓ వేళ ఆవిడ ఆవేదన చూసి, రాగాలెట్టినా, అదంతా నటనేనని, నేనూ, మీరూ, సామర్‌సెట్ మాఘం కూడా అనెయ్యడానికి జంకం.

స్ఫురణకొచ్చే సంభాషణలు నాకింకేమీ కనబడటంలేదు. ఓ వేసంగిలో నాగభూషణంగారు భార్యా, పిల్లలతో వాళ్ళ వూరెళ్ళారు. నేనూ, వేలాయుధం పట్నంలోనే వుండిపొయ్యాం. అతని దగ్గరనుంచి కొత్త విషయాలని గుంజుదామనుకునేవాణ్ణి. ఆవిడ చాలా మంచిదని,

అంత ఓర్పు, ఓపిక, దయ దాక్షిణ్యం ఇంకెవ్వరికీ ఉండవనీ అతని మాటల వల్ల తేలింది. పెట్టుపోతల విషయంలో ఆవిడ అన్నపూర్ణే. భార్య, భర్త ఒక్కసారి తమాషాకైనా తగవులాడుకున్నట్లు లేదు. అంతటి అన్యోన్యం వుంది వారి దాంపత్యంలో. నిజానికి అంత మంచి తనం నమ్మడం కష్టమే ననుకుంటా.

అతి మంచివాళ్ళు నాకు గిట్టరు. మరీ అందమైన స్త్రీలంటే నాకు భయం. చాలా తెలివైనవాడన్నా, అతిబలశాలన్నా, ఎక్కువ ఆరోగ్య వంతులన్నా, మరీ ధనికులన్నా నాకు తలనొప్పి. దీనికి కారణం నాకివేవీ లేవు గనక, ఉన్నవారంటే ఈర్ష్య అని మీరూ, సామర్‌సెట్ మాఘం ఏకమై అంటే నే కాదనను, అనుకూల దాంపత్యాన్ని భంగం చెయ్య డానికి సంఘం సదా యత్నాలు ఎందుకు చేస్తుందో నా కర్థమవుతుంది.

పద్మావతి నాగభూషణం—వారి జీవితంలో, ఏదో తిరకాసుందని నాకు తెలుసు. అదేవిటో మట్టుకు—తెలీదు.

ఒక రోజున స్నానానికి నేను కుళ్ళాయి దగ్గర కెళ్ళాను. సబ్బు బిళ్ళ పెట్టి పక్కన ఉన్న పళ్ళ వరసను చూసి అదిరిపడ్డాను. పద్మావతి గారిని అడిగాను.

"అవా-ఆ పళ్లు డాక్టర్‌గారివే" అంది.

"నే నెప్పుడూ గమనించనేలేదుస్మాండి" అన్నాను.

"డాక్టర్లకీ, డాక్టర్లని గురిం చేం తెలుస్తుంది?" అన్నది.

కొంచెం పరీక్షగా పద్మావతిగారి పళ్ళవరసని అప్పుడు చూచాను. నిజంగా చాలా అందమైన పళ్ళవరస. అసలు ఆవిడలో వున్న "కళ" అందం ఆ పళ్ళలోనే వుందని మాఘం అనును.

వేలాయుధం చెప్పాడు. నాగభూషణంగారి కింద పళ్ళలో ఒకటి వంకరగా, ఎత్తుగా వుండేదిట. ఆయన దాన్ని కెలికి, లాగి, చివరికి వర సంతా పీకించేసుకుని, కొత్త పళ్ళు తగిలించుకొన్నాడుట—కొన్నేళ్ళక్రితం. ఇది విన్ననాటి నుండీ, నా పళ్ళపై, శ్రద్ధాభక్తు లెక్కువైనాయి.

పద్మావతిగారికి జీవితంపై వున్న విముఖత్వానికి, తన అందమైన పళ్ళవరసని, మిమ్మల్ని అనుకోమనడంలేదు. డాక్టర్ చదువువల్ల, నాకు మనుషుల అస్థిపంజరాల అమరికని తప్ప, కండనీ, చర్మం సొంపునీ చూసి మురిసిపోవడం అలవాటు లేదు. అస్థిపంజరానికి, నిజంగా పరిపూర్ణమైన వికృతాన్ని ఆపాదించేది పళ్ళవరస కాక మరేమిటి?

నేను శెలవలకి ఇంటికెళ్ళినప్పుడు వారి పెద్దమ్మాయి పెండ్లి జరిగింది. తిరిగి వచ్చాక పద్మావతిగార్ని అడిగాను.

"అమ్మాయికి పెండ్లే చెయ్యమన్నారు?"

"నాయిష్టమేముంది?-అంతా డాక్టర్ గారిదే" అంది. భార్య అన్న మాట నాగభూషణంగారు విన్నారు.

"ఇదోటా పైగా—సంబంధం పురమాయించిందీ, ఏర్పాట్లన్నీ చేసిందీ మీ అన్నలూ అక్కలూ. పీటలమీద కూర్చోడంతప్ప, నే నేమీ ఎరగను" అన్నా రాయన.

దీన్ని బట్టి మీరూ, నేనూ, ఏమనుకోవాలి? అమ్మాయికి పెండ్లి చెయ్యమన్నది ప్రగల్భం! సంబంధాలురావడంలేదన్న తలవంపుని, బడాయికింద తిప్పికొట్టడం! అమ్మాయికి పెండ్లి కాకపోతే ఆ కీర్తంతా తల్లిదండ్రులకే దక్కాలి కాబోలు !

కథపూర్వకంగా చెప్పదల్చుకున్న విషయాలింకేవీలేవు. ప్రతి జీవితం మృత్యువుతో అంతం కావల్సిందే.

నా చదువు చివరి సంవత్సరం. నేను పరీక్షల చదువు కోసం, స్నేహితుల గదిలోకి మకాం మార్చేశాను. పరీక్షలు ముగిసినాయి. ఆరు గంటలకి సినిమాకెళ్ళి, భోజనంచేసి, బీచమ్మట నడుచుకుంటూ లాడ్జికి చేరుకునేప్పటికి పదకొండైంది. స్నేహితుడు కామత్ చెప్పాడు. నాగభూషణంగారు నన్ను వెంటనే వారింటికి రమ్మని రెండుసార్లు కబురంపినట్లు మేం మాట్లాడుకుంటుండగానే, డాక్టర్ "కుట్టి"గారి కాంపౌండర్ కారు తీసుకొచ్చాడు. నాగభూషణంగారికి సాయంత్రం ఐదింటికి గుండెల్లో

విపరీతమైన నొప్పి బైలుదేరి పడిపోయ్యాడనీ, "కుట్టి" మందులిస్తున్నా డనీ చెప్పాడు కాంపౌండరు. నేనూ, కామత్ కూడా బైలుదేరాము.

మేము వెళ్లేటప్పటికి నాగభూషణంగారు నిద్రలో వున్నారు. అక స్మాత్తుగా గుండెలో నొప్పిరాగానే, ఆయన లేచి గుండెలు పట్టుకొని అటూ యిటూ పచార్లుచేసి పడిపొయ్యాడుట. ముచ్చెమట్లు పోశాయిట. రెండు వాంతులు కూడా అయ్యాయి. నాలుగైదు నిముషాలు స్పృహ లేకుండా పడిపోయి తరవాత మెల్లిగా లేచాడుట. అజీర్ణం వల్ల కలిగిన "బిలియరీ కాలిక్" అనుకున్నారట నాగభూషణంగారు. డాక్టర్ వాసుదేవరావ్‌కి కబురుచేశాను. ఆయన పది నిమిషాల్లో వ్యాధి "ఎంజినా పెక్టోరిస్" అనే గుండె జబ్బుని నిర్ణయంచేసి మందులు డాక్టర్ కుట్టికి పురమాయించి వెళ్ళాడు. ఒక గాజు గొట్టంలో "ఎమిల్ నైట్రైట్స్" వేసి చుట్టూ పట్టుగుడ్డ చుట్టి పీల్చడం, నైట్రొగ్లిసరిన్ బిళ్ళలు చప్ప రించడం—అంతే మందులు.

నాగభూషణంగారికి నిద్రపట్టడంలేదు. మతిభ్రమించిన వానికి మల్లె అటూ యిటూ దొర్లడం, లేచి కూర్చోడం చాలా బాధపడుతున్నాడు. కుట్టి నైట్రొగ్లిసరిన్, కాస్త "మార్ఫిన్" కలిపి ఇంజక్షనిచ్చిన తర్వాత ఆయన మత్తుగలిగి నిద్రపొయ్యాడు. రాత్రంతా నేనూ, పద్మావతమ్మ, వారి అల్లుడు, వేలాయుధం మేలుకొని కూర్చున్నాం. అప్పుడప్పుడు ఆయన గుండెల్లో నొప్పి అనడం, నిద్ర మత్తుకోసం లూమినాల్, బెల్ల డోనా మొదలైనవి ఇయ్యటం అలవాటే.

తెల్లవారింది. పద్మావతమ్మగారు వెన్ను, కడుపు మెల్లగా రాస్తూ, మసాజ్ చేస్తూనే వున్నారు. రెండోసారి గుండెల్లో నొప్పి తొమ్మిది గంటల కొచ్చింది. వాసుదేవరావు రాకపూర్వమే నాగభూషణంగారు చనిపోయాడు.

ఇది జరిగిన ఏడాదికే, నేను ఒక పేషంటు ట్రీట్‌మెంట్ నిమిత్తం పట్నం వచ్చాను. పద్మావతమ్మగారి అల్లుడు హాస్పిటల్‌లో కనిపించి

అత్తగారికి జబ్బుగా వుంది, చూసి పొమ్మంటే వెళ్ళాను. ఆవిడ జబ్బు గుండె క్షయ–"కార్డియక్ ఆస్త్మా"–నిద్రపట్టేటప్పుడు ఆయాసం ఎక్కువవడం, శ్వాస దీర్ఘం కావడం, ఊపిరితిత్తులలో ఏదో ఆటంకం కలిగినట్లుండి, నిద్ర నుంచి లేచి కూర్చోడం–యివి యీ వ్యాధి చిహ్నాలు. డాక్టర్ కుట్టి చెయ్యవలసినవన్నీ చేస్తూనే వున్నాడు. అతని ట్రీట్‌మెంట్ నాకు నచ్చింది నేను వెళ్ళొస్తానని లేవబోగా, పద్మావతమ్మగారు కూర్చోమని సంజ్ఞ చేసింది.

"మీతో ఓ విషయం చెప్పాలని ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నాను" అంది.

అదేమిటోనని కుతూహలం కనపరిచినా, ఆవిడ ధోరణికి భయమేసింది.

"చెప్పండి-ఫరవాలేదు."

"మీ రెవ్వరితోనూ చెప్పరు కదా!"

"ఫరవాలేదు-చెప్పండి."

"నేనింక బ్రతకను."

"మీకేమీ భయంలేదు. కార్డియోగ్రాఫ్ చూస్తే, నాకూ కుట్టికీ కూడా ఎంతో ధైర్యంగా వుంది. మీరు మాత్రం మానసికంగా ఏ విషయం గురించీ హైరానా పడకూడదు" అన్నాను.

బ్రతికినా, బ్రతక్కపోయినా నాకు ఎలాంటి చింతా లేదు. కాని, డాక్టర్‌గారి విషయం తల్చుకుంటే..." వాక్యం పూర్తిచెయ్యకుండా ఆవిడ కళ్ళు చెమ్మగిల్లాయి..

"ఏం చేస్తాం-అవన్నీ మరిచిపోవాలి మీరు. మీకు అన్ని విషయాలూ తెల్సును. మీరే నలుగురికీ ధైర్యం చెప్పి సముదాయించుకోవాలి" అన్నాను, ఏదో వ్యవహారరీత్యా మాట్లాడుతూ.

"డాక్టర్‌గారి జబ్బు ఏమిటంటారు ?" అంది ఆవిడ.

"వాసుదేవరావు "ఎంజినా పెక్టోరిస్" అన్నాడు కాని, నాక్కు

మా స్నేహితుడు కామత్‌కీ, "కొరొనరీ థ్రాంబాసిస్" అని అప్పట్లో అనుమానం కలిగిందనుకోండి. కలిగినా మేం చేసింది ఏమీలేదు" అన్నాను డాక్టర్లు అప్పట్లో చేసిన వాగ్వివాదాలను స్మరిస్తూ.

"ఎవ్వరితోనూ చెప్పకండి — డాక్టర్‌గారిది సహజమైన చావు కాదు."

"అదేమిటి ?"

"ఆయన ఆత్మహత్య చేసుకున్నారు."

"ఆ!..."

నా కెన్నో అడగాలనుంది. ఆవిడ కళ్ళు మూసింది. మళ్ళా తెరవలేదు.

ఇది తెలిసింతర్వాత, నాకు నేను క్రొత్త ప్రాముఖ్యాన్ని ఆపాదించుకున్నాను. ఎవరితోటి పంచుకోడానికి వీల్లేని రహస్యంతో మనో తీక్షణం ఎక్కువైంది. ఆ విషయం నమ్మేటందుకు ఆధారాలు నా కేవీ కనబడకపోయినా, నమ్మాలని మాత్రం వుండేది. జీవితానుభవం అనే కత్తికి పదునట్టినట్లుగా వుంది. దాంతో ఎవర్నిపడితే వారిని నరికెయ్యెచ్చు—నరకక్కపోవడంలో శక్తి, ప్రభావం వుంటాయి.

ఎన్నోసార్లు నాగభూషణంగారి మృత్యువునాటి విషయాలని స్మరించి చూశాను. ఆత్మహత్య నెగ్గాలంటే రెండు కావాలి. మొదటిది అవకాశం, రెండోది ప్రబలమైన కారణం.

అవకాశం బొత్తిగా లేదనడానికి వీల్లేదు. నాగభూషణం డాక్టరు. అప్పుడప్పుడు గుండెల్లో నొప్పి రావడం వుండేది. ఉపశాంతి నిమిత్తం మార్ఫియా, వెరొనల్ మొదలయిన మత్తు పదార్థాల వాడకం వుంది. ఆ రోజు ఉదయం తెల్లారకుండానే పెద్దమ్మాయి కాఫీ కలపడానికి వంటింట్లో కెళ్ళింది. నేను తెల్లవార్లూ మేలుకుంటున్నట్లు యిందాక చెప్పినా, అల్లా వోరగిలి గోడకి కాసేపైనా కునుకుతీసి

వుండడం అసంభవం కాదు. నాకు బాగా జ్ఞాపకం...ఎనిమిది గంటలకి గది ఊడవడానికి పనిపిల్ల చీపురుచ్చుకొచ్చింది. గదినిండా ఇంజెక్షన్ ట్యూబుల పగిలిన ముక్కలు, అట్టపెట్టెలు పడి వున్నాయి. వాటిని ఓ పక్కగా చేరవెయ్యడంలో వేలాయుధం చేతి వేలుకి గాజు పెంకు గుచ్చుకుని రక్తం రావడం, కట్టుకట్టడం కోసం అతనూ నేనూ ముందుగదిలోకి వెళ్ళడం–నాకు గుర్తు. ఆ ఐదు నిమిషాలలోనూ, నాగభూషణంగారు ఆత్మహత్య చేసుకొని వుండచ్చు. మరో రెండు వెరొనాల్ టేబ్లెట్సు మింగితే చాలు లేక, వాసుదేవరావు నిద్రకోసం క్లోరోఫారం కూడా వాడ మన్నాడు–దాన్ని ఎక్కువగా వాడి వుండొచ్చు. పద్మావతి చూసి కూడా, తనకి ఆ మందుపర్యవసానం అర్థం గాక, వారించక పోయి ఉండొచ్చు; చనిపోయిన తర్వాత అర్థమై వుండొచ్చు.

ఐనా నేను నమ్మలేను. అట్టాంటిపని చేసివుంటే, లక్షణాలు బైట పడక మానవు. రెండోమారు గుండెపోటు వచ్చినప్పుడు, ఆయనకి స్పృహవుంది. నేను చూచాను. నేను డాక్టర్ని – నాకు తెలుసు. చావుకి కారణం "కొరొనరీ త్రాంబొసిస్" అన్నది నేనే.

వాసుదేవరావు కుట్టి ఘర్షణపడ్డ విషయంకూడా అదే!

ఎంజినా పెక్టోరిస్ నాలుగైదుమార్లు వచ్చి నయంకావచ్చు. అటు పిదప త్రాంబొసిస్ వస్తే చావు తప్పదు.

అవకాశం సంగతి వొదిలేసి, ప్రబలమైన కారణం ఏదన్నా ఉందా అంటే ఏదీ కనిపించదు. ఒక భయంకరమైన అవస్థ సంక్రమించినప్పుడు దాన్ని ఎదుర్కొనే మార్గంకాని, మరోవిధానంకాని లేనప్పుడే ప్రాణి ఆత్మహత్య తలబెడుతుంది. ఈ రెండేమార్గాలు – వీటిల్లో ఏదో ఒక దానంట ప్రయాణం చెయ్యి – అన్నప్పుడు ఆత్మహత్యకి దిగరు. ఈ ఒక్కటే మార్గం – కాని అటు నువ్వుపోలేవు – అన్నప్పుడే ఆత్మ హత్య.

ఫేలయిన విద్యార్థికి రెండుమార్గాలున్నాయి. మళ్ళా

చదివి కృతార్థుడవచ్చు; లేకపోతే చదువు విరమించి, ఉద్యోగంలోకి దిగొచ్చు, కాని ఒక సినిమాస్టార్‌ని పెండ్లి చేసుకోవాలని సంకల్పించిన విద్యార్థి ఆ సినిమాతార మరొకర్ని వివాహమాడిన విషయం తెలుసుకున్నప్పుడు ఆత్మహత్య చేసుకున్నాడంటే — అతని దృష్టిలో ఆ ప్రబలమైన కారణమే మరొక సినిమాతారని చేసుకుందువుగాని లేరా - అన్న వోదార్పు వెక్కిరింపై మృత్యువుశరణ్యం వెదుకుతుంది. తర్కం బాగానే ఉంది. కాని,

మానవహృదయం తర్కబద్ధంగా ప్రవర్తించదు. పరీక్షలో ఫేలయిన విద్యార్థి ఆత్మహత్య చేసుకుంటాడు; సినిమా తారకోసం తహతహలాడిన విద్యార్థి, పక్కింటివారి సూరమ్మతో నిక్షేపంలా కాపరం చేస్తాడు.

అనారోగ్యం, రోగబాధ భరించలేక ఆత్మహత్య చేసుకోడం లేకపోలేదు. నాగభూషణంగారు ఆ పని చేస్తాడనుకో గలమా ? పైగా ఆ బాధకి ఉపశాంతి ఉంది. ఆయన డాక్టరు, పిల్లలు, భార్య — యింత సంసారం వదులుకుంటాడా ?

నాకేమీ పాలుపోక, అనేక చిత్రమైన కారణాలు సృష్టించుకున్నా. ఏదీ తృప్తి నివ్వలేదు. ఒక్కొక్కమారు, సామర్‌సెట్ మాఘం యీ విషయాన్ని ఎట్లా సమర్థిస్తాడో వూహించేవాడిని. ఆ వూహ యీ విధంగా సాగేది.

మాఘమ్ సానుభూతి పురుషులపైనా, ద్వేషం స్త్రీలపైనా.

స్త్రీల వంచనలకు లొంగకుండా పురుషులు వారి బారి నుండి తప్పించుకుపోతారు. స్త్రీ పాత్రలకి శరీరాలుతప్ప, మెదడు, ఊహ, మానవత్వం ఉండవు ఇవన్నీ పురుషుడి సొత్తు. స్త్రీలకు కావల్సింది సంఘంలో పలుకుబడి, హోదా, అధికారం. వీటిని సూచించే భౌతిక పరికరాలు – అంటే కార్లు, బంగళాలు, నౌకర్లు, దుస్తులు, నగలు వగైరా. వీటిని ఏ మొగాడు ఎక్కువగా సంపాదించిపెట్టగలిగితే, ఆ మొగాడి

కోసం వారు శృంగారంవలని పన్నుతారు. అందరూ యీ వేటలో కృత కృత్యులు కాలేరు. అట్లాంటప్పుడు, ఏదో విధంగా, తమ అపజయానికి ప్రతీకారంగా పగసాధిస్తారు. దీనికి పురుష పాత్రలు లొంగరు. ఆ సందర్భాలలో, నిరంతరం స్త్రీలకి పురుషులకీ "సంసారం" అనబడే సంఘర్షణ జరుగుతుంటుంది. దాని పర్యవసానం ఎవ్వరూ నిర్ణయించలేరు. పురుషుడు గెలిచినప్పుడు సంఘం పురోగమిస్తుంది. స్త్రీ గెలిచినప్పుడు, సంస్కృతి పతనం జరుగుతుంది.

ఈ సిద్ధాంతాల ప్రకారం, పద్మావతిదృష్టిలో తనకి తగినభర్త కాడన్న మాట నాగభూషణం. పద్మావతి ఉత్తమశ్రేణికి చెందిన సంఘంలో వ్యక్తి; తనవాళ్ళంతా పెద్ద పెద్ద హోదాలోనివారు. ఆమె తలంచినట్టుగా భర్త పైకిరాలేదు. రాదని తెలుసుకుంది ఇంక తనకి జీవితంతో నిమిత్తం దేనికి ? తనకి తగినవాడు కాడని ఎన్నివిధాలుగానో, భర్తకి తెలియపర్చి ఉండకపోయినా, తెలుసుకునే అవకాశం కలుగచేసి వుంటుంది.

అక్కలు, చెల్లెళ్లు సౌందర్యానికి పేరుమోగిన వాళ్లు. అందుకు నిదర్శనం, వాళ్ళందరూ మంచిహోదాగల మొగాళ్ళని తెచ్చుకోగలగడమే. ఆ సౌందర్యం తనకే ఉందని భ్రమించి నమ్మడం, కుటుంబంపై ఎక్కువ అభిమానం వున్న వారికి ఎంతోతేలిక; పోనీ, భర్త అందమైనవాడా! పెట్టుకున్న పళ్ళు అది తీసినప్పుడెట్లా వుంటాడో లోకానికి తెలీదు. లోకం తనను గురించిన అజ్ఞానాన్ని చాలా సంపాదించుకుంది. లోకానికి జ్ఞానభిక్ష పెట్టాలి. ఎట్లా? తనకోసం తన భార్య చేసిన త్యాగానికి తను తగడని నాగభూషణం నమ్మి, ఆత్మహత్య చేసుకున్నట్లు లోకానికి తెలిస్తే, తన ఆత్మకి శాంతి. నాకా రహస్యం చెప్పేసి, ప్రాణం విడిచింది. భార్య భర్తద్వారా పొందిన సంక్షోభకి, తట్టుకున్న అన్యాయానికీ, అణగి మణగి ఉండిపోవడంలో చూపిన త్యాగానికి నాగభూషణం సిగ్గుపడి, కుమిలి ఆత్మహత్య చేసుకున్నాడ అనుకుంటే, పద్మావతిలోని

వ్యక్తిత్వం, ప్రత్యేకతా విశదమై తన మరణానంతరమైనా, విజయం, సాధించిన ఉత్తమనాయిక అవుతుంది.

దీని ప్రకారం పద్మావతి భర్త ఆత్మహత్య చేసుకున్న పుకారు, స్వార్థంకోసం పుట్టించిందనీ, నిజంగా అల్లా చేసుకోలేదనీ స్పష్టమౌతుంది. పాఠకుడి దృష్టిలో, ఆమె హేయమైందిగా తయారవుతుంది. మాఘమ్‌కి స్త్రీలోకాన్ని మరోసారి పరాభవించే అవకాశం కథద్వారా చిక్కుతుంది.

ఇల్లా అనుకోవడంలో తృప్తిలేకపోలేదు. ఆలోచించిన కొద్దీ యిందులో ఎన్నో లోతులు, కోణాలు శిఖరాలు, గోచరమౌతాయి. మర్యాదలో, సంప్రదాయంలో వున్న కుళ్ళు వింతరూపాలు దాలుస్తూం టుంది. ఆ స్వరూపాలని ప్రదర్శిస్తే కుళ్ళుని కడిగినట్లేగా!

మరో సంవత్సరం గడిచింతర్వాత ఎక్స్‌రే పరికరాలు కొనడానికి పట్నం వచ్చాను. స్నేహితులని చూద్దామని జనరల్ హాస్పిటల్‌కి వెళ్ళాను.

డాక్టర్. కుట్టిద్వారా వేలాయుధం అంతర్కితంరోజే హాస్పిటల్‌ని వదిలి, కొంచెం నింపాదిగా వుంటం మూలాన, యింటికి వెళ్ళిన సంగతి తెలుసుకున్నాను. ఓసారి వెళ్ళి చూద్దామని బైలుదేరాను. వేలాయుధం గుమ్మంలో మంచంమీద ఓ బొంత వేసుకుని దానిమీద పడుకుని వున్నాడు. మరో ముసిలామె అతనికి ఉపచారాలు చేస్తోంది. వేలాయుధా నికి సంక్రమించిన వ్యాధి పక్షవాతం. మొదట్లో తీవ్రంగావున్నా, కాస్త తగ్గి, తల మాటిమాటికీ వంకించే "టిక్" జబ్బుగా పరిణమించింది. అతికష్టంమీద మాట్లాడగల్గుతున్నాడు.

నాగభూషణంగారి పిల్లలవిషయం మాట్లాడుకున్నాం. పెద్ద అమ్మాయి మొగుడు బొంబాయిలో ఆర్. ఎ. గా పనిచేస్తున్నాడుట, నాలుగోవాడు తాతగారి దగ్గర ఉంటున్నాడుట. రెండో అమ్మాయికి మేనరికం చేశారుట. మూడో పిల్ల కాన్వెంట్‌లో చదువుకుంటోందిట.

వేలాయుధం వున్న గది గోడకి, నాగభూషణం, పద్మావతి చిన్న

ప్పుడు తీయించుకున్న ఫొటో తగిలించి వుంది. అది చూశాను. ఆ ఫొటోలో పద్మావతిని గుర్తు పట్టడం కష్టం. చాలా నాజూకుగా, ఆకర్షణీయంగా కూడా వుందనే చెప్పాలి. ఫొటోలో బాగుండే "ఫొటొజెనిక్" మొహం కాబోలు. నాగభూషణాన్ని గుర్తు పట్టడం మరీ కష్టం అతను భార్యకంటె కూడా పల్చగా వున్నాడు. అదుగో! ఆ ఎత్తు కిందిపళ్ళ వల్ల నోరు వికృతంగా సాగారింది.

ఆత్మహత్య విషయం వేలాయుధంతో ప్రస్తావించడానికి ధైర్యం లేదు. ఏదైనా వుంటే బైటపడుతుందని, జబ్బు విషయాలు ప్రసంగించాను.

"సరిగ్గా ఎన్ని గంటలకి పొయ్యాడో నీకు జ్ఞాపకం వుందా ?"

"లేదండి"

"చనిపోయినప్పుడు, నువ్వు దగ్గరగా వుండి చూశావా?"

"లేదుకానండి...అంతకి ముందుగా నాకు తెలుసు..."

"అంటే?"

"చచ్చిపోతారని"

"ఎట్లా తెలుసు?"

"ఏ విధంగా చచ్చిపొయ్యాడో నాకు తెలుసండి. కానీ ఎందుకండి అవన్నీ సెప్పుకోడం?"

అని మౌనంలోపడ్డాడు వేలాయుధం. వేలాయుధం మాట్లాడింది అరవ తెలుగు. హాస్యాస్పదంగా ధ్వనిస్తుందని, మామూలు తెలుగులో అతని వాక్యాలు పొందుపరుస్తున్నాను.

"ఫరవాలేదు చెప్పు; వారిద్దరూ జీవించిలేరు"

"ఆయన మామూలుగా సావలేదండి"

"నాక్కూడా యించుమించు అట్లాంటి అనుమానం వుంది. పూర్తిగా చెప్పరాదు?" అన్నాను.

"మీ అడుగుతున్నారు గనుక చెబుతున్నాను ఆర్ని ఆమె చంపేసినారండి."

"ఆ!"

"అవును, నే చూశాను. కాఫీలో ఆ బిళ్ళలు వేసి యిచ్చారు, మత్తు బిళ్ళలంట-నేను చూశానండి, ఆట్ని కలపడం. యివ్వడం – దాని తర్వాత అరగంటలో పాణం యిడిచినారు."

నే నేమీ మాట్లాడలేకపొయ్యాను. దీని నిజానిజాలు శాస్త్రీయంగా విమర్శించే మన స్తత్వం, వాతావరణం అప్పట్లో ఏర్పడలేదు. అయినా వేలాయుధం చెప్పింది అబద్ధమని ఋజువు చెయ్యడానికి సంకల్పించి, అన్నిటినీ సమర్ధించడం మొదలెట్టాను.

"అది మత్తుమందు—డాక్టర్ సలహాపైననే యిచ్చింది. అందులో తప్పులేదు" అన్నాను.

"నాకూ తెల్సండి. ఆయన అప్పుడప్పుడు పుచ్చుకుంటుంటారు. ఒక్కటే బిళ్ళ. ఆ యమ్మగారు, నాలుగైదు కలిపినారు ... అంతే కాదండి..."

"ఇంకా ఏం జరిగింది?"

"నా కావేశంగానూ, భయంగానూ వుండి, దడొస్తా వుందడి... మందుసీసా సిల్కు రూమాల్లోకి బోర్లించి, ఆరి నుదురు, కళ్ళు ముక్కు తుడిచినారండి. గుప్పుమనేతలికి నేను దొడ్డిగుమ్మంకాడి కెళ్ళిపోయినాను."

"వేలాయుధం, నువ్వు ఆవిడని బాగా ఎరుగుదువు కదా-అంత మంచావిడ లేదనేవాడివి – ఎందుకల్లా చేసిందంటావ్!" అని అడిగేశాను.

"చెప్పమంటారా? చెప్పమంటారా?"...

అల్లా రెండు మూడుసార్లు ప్రశ్నించి వేలాయుధం మరి మాట్లాడ లేకపొయ్యాడు. పల్స్ నీరసంగా వుంది. ఆయాసం ఎక్కువైంది. నేను తొందరగా హాస్పిటల్ వాన్‌కి ఫోన్‌చేసి అతన్ని అందులో వేసు కెళ్ళి ఆస్పత్రిలో చేర్పించాను. ఒకటి రెండు రోజుల వరకూ స్పృహ

లేదట. నేను పూరి కెళ్ళిపోయిన నెల రోజుల్లోనే అతను చనిపొయ్యాడని తెలిసింది.

ఈ విషయాలు నిజమైతే పద్మావతి పొరబడిందనుకోవల్సి వస్తోంది ఎందుకంటే, వేలాయుధం రహస్యం కాస్తా నాకు చెప్పివేశాడు.

అందుచేత యీ అపవాదు వెయ్యడానికి వేలాయుధానికి ఏదో మంచి సాకువుండాలి. అదేమిటో వూహించవలసిందేగాని, యిదమిద్ధ మని తేల్చేటందుకు ఆధారాలేవీ లేవు. భూస్వామి తత్వంపైన, కర్షకుడు-మజ్‌దూర్‌చేసే దౌర్జన్యం అనుకుందామా? కూలివాడు తనకి తెలీకుండా, యజమానులపై చూపే యీర్ష్య అందామా? కలిమి లేములకు నిరంతరం జరిగే యుద్ధానికిది జయభేరియా? అదీ యిదీ కాక, సామర్‌సెట్ మాఘమ్‌కి మల్లె ఈ ప్రాచీన మానవుడికి స్త్రీ లోకంపైన ద్వేషమా?

పద్మావతి, భర్తని హత్యచేసిందన్న నేరంలో నిజా నిజాలు పాఠకులు నిర్ణయించాలి. భర్త ఆత్మహత్య చేసుకుంటాడని పద్మావతి చాలా ఆశ పడింది. కాని అల్లా జరిగే సూచనలు లేనందున, తనే ఆ పని చేసేసి, ఆత్మహత్య చేసుకున్న పుకారుని లోకానికి అందజేసిందన్న వాదంలో కొంత బలం లేకపోలేదు. ఓ వేళ ఆత్మహత్య చేసుకున్నాడన్న తన వాదానికి సాక్షులు కూడా అవసరం అనుకొని కాబోలు. ఆ పనికాస్తా వేలాయుధం చూస్తుండగా చేసిందేమో అనుకుంటే, మరింత బలపడుతుంది. వేలాయుధం అమాయకుడు, తనంటే భక్తి శ్రద్ధలు మెండు, అతను ఒకవేళ పసికట్టినా, అతను ఎవరికీ తెలియపరిచే ఘటం కాదని ఆమెకి బాగా తెలుసు.

కారణం యేదైనా, ఈ రహస్యం బయట పెట్టేందుకు యింత కాలం వేచి వుండడం దేనికి? ఇట్లాంటి రహస్యాలు చనిపొయ్యే ముందు చెబితేనే మనశ్శాంతి కలుగుతుంది గనుక పద్మావతి, వేలాయుధం ఇంత కాలం వేచి వున్నారని పాఠకులు సర్ది చెబితేనే నే నంగీకరిస్తాను.

ఈ వాదంలో ప్రయోజనం నాకేమీ కనబడలేదు. మూఘమ్ సాను భూతి నాగభూషణంపైనా, పాఠకుల సాను భూతి వేలాయుథంపైనా ఉండి, ఇద్దరూ పద్మావతిని చులకన చేసి ద్వేషిస్తే, కళానుగుణ్యంగా విలువలేక పోయినా, కథకి సాంఘిక ప్రయోజనం దొరుకుతుంది. సంప్రదాయానికి లొంగిపోయిన వ్యక్తులు, ప్రజాస్వామ్యంలో వ్యక్తిత్వప్రకర్షకి అవకాశం లేకపోవడంవల్ల, కుతంత్రం సాగించి జీవితాన్ని మలినం చేసుకుంటారు కాబట్టి, అసాధారణ వ్యక్తులకింద, ఆచారంపై విప్లవంచేసిన ప్రయోజకు లకు స్థానం కల్పించి, గౌరవించే వాతావరణం కల్పించే విధి ప్రభుత్వానికి, పాఠకులకీ వుందని యీ కథలోని నీతి.

ఇల్లా 'నీతిని' కథ ప్రయోజనాన్ని పాఠకుడి మొహాన కొట్టి తబ్బిబ్బు చెయ్యడం ఆధునికత్వం కాదనుకుంటాను. రాగద్వేషాలతో నిమిత్తం లేకుండా వ్యక్తుల ప్రవర్తన, పరిస్థితులకు అతీతం కానిదిగా, త్రాసులోతూచి చూపడం ఉద్దేశంగా పెట్టుకున్న నేను, ఆత్మహత్యకీ, హత్యకీ అంగీకరించను. నాగభూషణంగారిది సహజమైన మరణమేనన్న నా నమ్మకానికి బుజువు యీ కథని ఇంకా పెంచలేకపోవడంలో వుందను కుంటాను.

# కార్యసాధకుల మహాకావ్యం

(వా క్ చి త్రం)

ప్రపంచ భారం ముగ్గురిమీద పడింది. పనిచేసేవారు; ఏం చెయ్యాలో చెప్పేవారు; వీరు సరిగ్గా చెప్పారో లేదో, వీరుచెప్పింది వారు చేస్తున్నారో లేదో గమనిస్తూ, అసలు ఏం చెప్పాలో నిర్ణయించేవారు. మొదటివారుకష్టజీవులు; రెండో రకంవారు మేధావులు, మూడోరకంవారు పాలకులు. కీర్తి, పలుకుబడి, పేరుప్రతిష్ఠలు, అధికారం, డబ్బు, గౌరవము అన్నీ ఈ మూడోరకంవారికే దక్కుతున్నాయి. వీరుకాక నాలుగో రకంవారుకూడా వున్నారని ఈ మధ్యనే తెలుసుకున్నాను. ఈ మూడు రకాలవారి చర్యలని చూస్తూ, ముక్కుమీద వేలేసుకుని 'ఔరా!' అని లోపల అనుకుంటూ, కూర్చునేవారు. నేనీ రకంవాడిని. ఈ నాలుగో రకంవారి ప్రతినిధిగా వారి గుణగణాలను పొందుపరుస్తున్నాను. మేం అందరం చాలా మంచివాళ్ళం. ఎవరిజోలికి పోము — తుదకు మాజోలే మాకక్కర్లేదు. ఒక సంఘటన జరిగిపోయిన చాలా కాలం వరకూ, మాకు దానివిషయం తెలవదు. ఆ సంఘటన గురించి కొన్ని అభిప్రాయాలు ఏర్పరచుకొని, ఇతరులకి చెబుదామనుకున్నప్పుడు, వారందరూ ఆ సంఘటన మరచిపోయే వుంటారు. మాకింక చెప్పే అవసరంలేదు. ఇతరులతో సంభాషించేటప్పుడు, ఎన్నెన్నో చమత్కారమైన భావాలు, సమాధానాలు మా బుర్రలలో చటుక్కున మెరిసి మాయమైపోతూంటాయి. వాటిల్లో ఒక్కదాన్ని చెప్పడానికి చక్కటి మాటలు వెదుకుతూండగా, ఆ సంభాషణ సమయం గడిచిపోయి, అవతల వ్యక్తులు నిష్క్రమించడం మామూలుగా జరుగుతూవుంటుంది. ఒక జడ్జీగారు భార్యని పిలిచి 'ఆ మెట్ల మీద నుంచి వెళ్ళిందెవరు?' అని ప్రశ్నించారట. వారం గడిచింతర్వాత 'అది పిల్లి' అని ఆమె సమాధానం ఇచ్చిందట. మేం అట్లాంటివాళ్ళం.

మేం వూహాలో జీవిస్తాం. ఆ సామ్రాజ్యంలో మేం పాలకులం - కాని పాలితులు లేరు. స్థిత ప్రజ్ఞలకింద జమకట్టి గీతాకారుడు మమ్మల్ని తెగ మెచ్చుకున్నాడు. మాకూ ఆకలి దప్పులూ, తృష్ణ, వాంఛ, అహం కావలిసినంత వున్నాయి. దప్పికై మంచినీరు త్రాగితే, దప్పిక తీరిపోయి అఅనుభవందూరమై పోయిందన్న భయంవల్ల మేం దప్పిక తీర్చుకోము, వాసనచూసిన పుష్పం త్వరితంగా వాడిపోతుందే అనుకుని, దాన్ని తుంచం. వాసనచూడం గొప్ప సౌందర్యం కేసి చూస్తే, కన్నీటితో మలినమైన మా దృష్టికి ఆ సౌందర్యం మలినమైపోతుందని భయపడి, దానికేసి చూడం - చూడకుండా, వినకుండా, స్పృశించకుండా, సౌందర్యం మా దవాలి - ఇదెల్లా సాధ్యం చెప్పండి! ఊహా జగత్తులో ఏవో పిచ్చి ఆటలాడుకుంటూ వుంటాం. కాని మమ్మల్ని అల్లా విహరించనివ్వరు ఎవ్వరో చెయ్యిపట్టుకుని స్థూలజగత్తులోకి లాక్కుపోతుంటారు. ఏమిటో చదువులట, ఉద్యోగాలట, పెళ్ళిసంసారంట. కూరగాయలు, రైళ్ళు, కోర్టులు, డాక్టర్లు, డబ్బుట! "మార్కెట్టుకెళ్ళి కూరలు పట్టుకురా" అని ఎవరో కసిరి, మాచేతిలో వోసంచీ ఇచ్చి జేబులో నోటుపెట్టి తరుముతూ వుంటారు. ఎక్కడ మార్కెట్టు? పుచ్చొంకాయ ఎట్లా వుంటుంది? చేదు దోసకాయని పసిగట్టగలవా? ముదిరిన బెండలో బంగారం బైటపెట్టగలవా నా బెండరాజా? ఈ ప్రశ్న పరంపరకి సమాధానం ఎవ్వరూ చెప్పరు. అనుభవంవల్ల ముదిరిన బెండవైనం తెలుసుకున్నా, మళ్ళా మార్కెట్‌కి వెళ్ళినప్పుడు, ఆ అనుభవం వుపకరించదు. ఆ బెండ అక్కడ వుండదు, ఎవరో దాన్ని పట్టుకుపోయి తినేస్తారు. ముదిరినబెండ తినరు కాబోలు. మేకలికి పెడతారా? నాకు తెలీదు. మరో కొత్తబెండ అవతరిస్తుంది. దాని పుట్టు పూర్వోత్తరాలు, భవిష్యత్తు ఎవరికి తెలుసు? మాకుమాత్రం తెలపదు రోజు రోజు ఈ బెండలు, దోసలు, ఎఱ్ఱపచ్చ మిరపకాయలు, బ్యాంకులు, ఇన్‌కంటాక్సు ఫారాలు, పని మనిషి పగిలినగాజు, కింద వుద్యోగి పూడిన

పొగా, పెళ్ళిలో బాండ్ వాద్యం – ఈ లోకం మీకు కొత్తగా, వింతగా కనిపిస్తూనే వుంటుంది.

ఎల్లా జరిగిపోతాయో చిత్రం, అందరిలాగే మేమూ తయారవుతాం. స్కూళ్ళ కెడతాం, చదువుకుంటాం, పెరిగి పెద్ద వాళ్ళ మవుతాం, మాకూ పెండ్లిళ్ళు అవుతాయి. అత్త, మామ, మరదళ్ళు, తోడల్లుడు – వీళ్ళందరూ వుంటారు. తమాషా.

"నన్నెరుగుదురా?"

"ఎరక్కేం?"

"చెప్పుకోండి"

"ఇంకానయం - మీరు రాజారావుగారు"

"కాను, మీ తోడల్లుడు మేనమామగా రబ్బాయిని. గుర్నాథం పెళ్ళిలో కలుసుకున్నాం" అంటాడాయన. మధ్యలో ఈ గుర్నాథం ఎవడు ? ఏమో! ఎందుకొచ్చింది ? – గమ్మునుండు! అనుకొని, నోరు నొక్కుకుని–రాజారావు వెళ్ళిపోయింతర్వాత లెండి–కూర్చుంటాం.

మేం ఎవరికేనా మనియార్డర్లు కడితే, అవి తిరిగి మాకే రావడం, పోస్టువాడి చేతులో అణా పెట్టడం మామూలే. ఎవర్నేనా మందహాసం చేసి ఆహ్వానిస్తే, అవతలవాడు సిగ్గుపడి, మొహం తిప్పేసిపోతాడు. అప్పుడప్పుడు నౌకర్లు మొదలైనవారిని గదమాయించమంటారు మమ్మల్ని. కోపం తెచ్చుకొని, నానా తిట్లూ తిట్టి, అధికారం చెలాయిస్తాం. కాని అదేం ఖర్మమో అవతలవాడు నవ్వు ఆపుకుంటాడు. ఆ దృశ్యం చూసి, మేమూ వచ్చే నవ్వుని ఆపుకోలేక నవ్వేస్తాం. మమ్మల్ని గదమాయించమని పురిగొల్పిన వ్యక్తులు, మమ్మల్ని గదమాయించటంతో ఆ వినోదఘట్టం సమాప్తమవుతుంది.

"తెలిసిందా, ఇంకెప్పుడూ అల్లా చెయ్యకు. చేశావంటే, చెవడా లెక్కదీస్తాను. మొట్టికాయ వేసాను. మా చిన్నప్పటి మాష్టారులా తొడ పాశం పెడతాను జాగ్ర

"అదేమిటండీ — ఆ అబ్బాయిని కసురుకుంటారు ? అతను డాక్టరుగారబ్బాయి."

ఇట్లాంటి పొరబాట్లు చేసినవారికి పుట్టగతులుంటాయా ? ఎవరింటికేనా వెడితే, పనవగానే, అందరిలాగా 'వెళ్ళొస్తాం' అని లేచిరావడం మా చేతకాదు. గొంతు సవరించటం, 'అహహ' అని సకిలించడం... ఈలోగా ఇంటి యజమాని మమ్మల్ని బైట దిగవిడచి, తలుపు గడియేసుకుపోవడం జరుగుతుంది. మమ్మల్ని యీడ్చుకుపోవడం యమధర్మరాజుకి కూడా అంత సుళువు కాదు. సావిత్రి మా పెద్దక్క!

మాకు పలుకుబడిలేదు. 'కానీ తక్కువైందీ—రేపిస్తాలే' అంటే దుకాణదారుడు ఊరుకోడు. చొక్కా విప్పించి దగ్గరుంచుకుంటాడు. మాకెవ్వరూ దగ్గర స్నేహితులు లేరు. మా అభిప్రాయాలు ఎవ్వరికీ అక్కర్లేదు. మేం చెప్పింది ఎవ్వరూ వినరు—అసలు అడిగేవాళ్ళే లేరు. ఏ పనిమీదా మమ్మల్ని పంపరు. మాకు పేరు ప్రతిష్ఠలు లేవు-కీర్తి లేదు. అన్నింటికన్నా ముఖ్యం మాకు డబ్బు లేదు. ప్రపంచంలో ఇంతడబ్బు చలామణి అవుతోందంటే మా కాశ్చర్యం. ఇచ్చేవాడెవడు ? పుచ్చుకునేవాడెవడు ? మాకు అధికారం లేదు. మేం చెప్పింది ఆఖరికి దేవుడు కూడా చెయ్యడు.

ఇదంతా అతిశయోక్తి అంటారా ? నాకో వెయ్యి కావాలి. పంపించి ఆ మాట అనండి. మళ్ళా తిరిగి యిస్తాలెండి. ఆ డబ్బు స్వరూపం చూడనివ్వండి. చూసి, కాదూ కూడదంటే అప్పుడే తిరిగి యిచ్చివేస్తాలెండి. దీనికి కారణం ఏమిటంటారు ? ముందే చెప్పాను. మేం చాలా మంచివాళ్ళం అని. మంచివాళ్ళని సంఘం క్షమించదు. 'తన చుట్టూ వున్న సమాజంలో వ్యక్తులకంటె మంచిగా వుండటానికి యత్నించినవాడు, 'దుర్నీతి' అనే గుమ్మంలో కాలుపెట్టినట్లే" అన్నాడు ఒక పాశ్చాత్య తత్వజ్ఞుడు. ఎటొచ్చీ మంచిగా వుండటానికి మేం యత్నించే అవసరంలేదు. అసలు "యత్నం'' అనేది మాకు సాధ్యం కాదు. సహజంగా, పుట్టుకతోనే స్థిరపడిపోయిన మంచివాళ్ళం మేం.

మమ్మల్ని తృప్తిపరిచేటందుకు కొందరు మమ్మల్ని 'పాలకుల పాలకులు అని వ్యవహరిస్తున్నారు. మా బుర్రలోంచి ఏవో భావాలొస్తాయి. మేం చనిపోయిం తర్వాత, ఏ ఒకరిద్దర్నో అవి ఆకర్షిస్తాయి. వారు వాటిని ప్రచారం చేస్తారు. విప్లవాలు, యుద్ధాలు జరిగింతర్వాత వాటిని ప్రజలు ఆమోదిస్తారు; వాటిమీద ఒక సమాజం నెలకొల్పబడుతుంది. ఒక నాగరికత ప్రారంభమవుతుంది; ఇవన్నీ మేం చనిపోయిం తర్వాత. రాత్రికి మాకు తిండిలేదు.

మాకు తిండి కల్పించడానికీ, మా పలుకుబడి పెంచడానికీ, మమ్మల్ని పైకి తీసుకురావడానికీ, ఆధునిక యుగంలో ఎందరో కృషి; చేస్తున్నారు. ఈ కృషివల్ల వారు కోటీశ్వరులైపోతున్నారనుకోండి. అవుతేనేం! మాకు సమాజంలో ఒక స్థానం ఏర్పరచి, మమ్మల్ని ఓ యింటివాడిగా చేయడానికి తోడ్పడే వీరి కృషికి మా కృతజ్ఞత.

ఇట్టివారిలో ఒకరు మాది 'మిడత మనస్తత్వం'గా వర్ణించారు. మా మనస్సు దేనిమీదా కేంద్రీకరించదు. అల్లా అల్లా ఎగురుతూ ఉంటుంది. మేం స్నానం చేసిమెడితే, 'అయ్యో కన్యాకుమారికి వెళ్ళలేదే!' అని వాపోతాం. వేమన్నను గురించి వుపన్యాసం కొనసాగుతూంటే షేక్స్పియర్‌ని గురించి ఆలోచిస్తాం. భార్య 'భోజనానికి లేస్తారా ?' అన్నప్పుడు, పక్కింటారి ప్రభావతిని స్మరించి ఆమె కళ్ళలోకి చూసి నట్లు భార్యకేసి పరధ్యాన్నంతో చూస్తాం. సినిమాకెడితే, సినీనటుడు కావాలనిపిస్తుంది; నాటకం చూస్తే, రంగస్థల నటుడు కావాలని ఆశయం. కుస్తీపట్టు పోటీ చూస్తే 'పహెల్వాన్' అవాలని సంకల్పం; ఉపన్యాసం వింటుంటే, 'డిమాస్థనీస్' 'సురేంద్రనాథ బెనర్జీ' లుగా ఐపోవాలని లోలోన తీర్మానాలు. మిడతలదండు దండెత్తితే పొలాలు నాశనం. మా మనస్తత్వం వల్ల అట్లాంటి ప్రమాదం ఎవరికీ జరగదు. ఈ మన స్తత్వం గలవాళ్ళ పైనుంచి ఆకలితో మాడిపోతున్న యుగయుగాల మను షులు నడిచిపోతారు. వాళ్ళ కాళ్ళ క్రింద నలిగిపోతాం. ఈ మన

స్తత్వం నిర్మూలంచేసి మమ్మల్ని పైకి తీసుకొచ్చే విధానం వుంది. దానికి చాలా డబ్బు కావాలి. చాలాకాలం శిక్షణ పొందాలి...పోస్టు ద్వారా పాఠాలు పంపుతారు నిజమే. మా సందేహాలు మళ్ళా పోస్టుద్వారా పంపే తెలివే లేదనిగా మా గొడవ!

ఇవన్నీ కనిపెట్టి, కొందరు పాశ్చాత్యులు, మా కోసం బోలెడు గ్రంథాలు వ్రాశారు. 'సులువుగా విజయం' అనే నిచ్చెనెక్కడం.' 'స్నేహితుల్ని సంపాదించడం సులువు' 'ఎంత కావలిస్తే అంత;' 'లోకం నీ బానిస', 'పై ఉద్యోగం కావాలా ?' 'ఇతరులపై అధికారం నీకుంది'. 'నీదే పైమాట', 'ప్రేమించిన స్త్రీని పొందు', 'నీ శక్తి నీకు తెలవదు, 'అందరూ వింటారు నీ మాట; నువ్వే నాయకుడవు', 'శిఖరానికి నిచ్చెన' యివన్నీ ఆ గ్రంథాల పేర్లు. ఏది వెల రూపాయి, రెండుకి మించదు. అన్నీ రైల్వే బుక్‌స్టాల్స్‌లోను దొరుకుతాయి. రైళ్ళ కోసం కాచు కున్నప్పుడల్లా యీ పుస్తకాలని కాస్త కాస్త చదువుతూ, వీటి భోగట్టా అంతా తెలుసుకున్నా. 'లోకం నీ బానిస' అన్న పుస్తకం నన్నెక్కు వగా ఆకర్షించింది. అది చూస్తూ వుండటేనే రైలెళ్ళిపోయింది. మా ఆవిణ్ణి తీసుకొని నేను దిగపడిపొయ్యాను. అప్పుడనుకొన్నాను ఆ గ్రంథ రాజాన్ని.

కొన్ని మిలియన్ల కాపీలు అమ్ముడుపోయినాయని ఆ గ్రంథకర్త గారు చెప్పుకొన్నారు. ప్రపంచం అన్ని భాషలలోకీ—చివరకి నార్వీజియన్ భాషలోకి గూడా — అనువదింపబడింది. భాషలన్నిటిలోకి తెలుగు లెస్స గాన, తెలుగులోకి అనువదింపబడలేదు. పుస్తకం చివరలో ప్రముఖుల అభిప్రాయాలు, చదివి బాగుపడినవారి అనుభవాలు పొందుపర్చబడి వున్నాయి.

ఒకాయన యిల్లా వ్రాశాడు :

"మీ పుస్తకంలో, పై అధికారిప్రాపకం పొందటం ఎట్లా" అనే అధ్యాయం చదివి మీ సూత్రాలను ఆచరణలో పెట్టాను. దాని ఫలితంగా

మొదట్లో నా మొహం కేసి చూడని మాపై అధికారి రోజూ మధ్యాహ్నం టీ కని మా యింటికే వచ్చేస్తున్నాడు. ఇప్పుడు ఆయన్ని వదిలించు కోడమే ఒక సమస్యగా తయారైంది. ఆయన్ని వదిలించుకొనే మార్గం సూచించండి అని.

ఈ పుస్తకంలో ఆరు అధ్యాయాలున్నాయి. అందులో సూత్రా లను ఆచరణలో పెట్టాక కలిగిన ఫలితాలను, జరిగిన మేలును వ్రాసు కొనేటందుకు పుస్తకం చివరలో ఖాళీకాగితాలున్నాయి. ఈ పుస్తకం మీలో చాలామంది చదివే వుంటారు. మీ కందరికీ నాలాగ వృద్ధిలోకి రావా లని వుబలాటం వుందని నాకు తెలుసు. లేకపోతే నే వ్రాసింది చదవరు. కాబట్టి ఆ పుస్తకంలో విషయాలన్నీ ఏకరువుపెట్టకుండా అందులోని కొన్ని ప్రధాన సూత్రాలను వివరిస్తాను.

'నీలో చాలా శక్తులున్నాయి. నీశక్తులు నీకు తెలియవు. కాస్తంత పట్టుదలతో పనిచేస్తే నువ్వెంతవాడవు అవాలనుకొన్నావో అంతవాడవు అయ్యితీరుతావు నీకు డబ్బు కావాలా? స్నేహితులు కావాలా? పలుకుబడా? అధికారమా? ప్రేమా? బలమా? అవును, నీ కివన్నీ కావాలి. నీకు పట్టు దల కూడా వుంది. దానికి తార్కాణం నీవా పుస్తకం చదవడమే'.

అల్లా సాగుతుంది మొదటి అధ్యాయం. తర్వాత ఆ పుస్తకంలో విషయాలను ఆచరణలోపెట్టి గొప్పవారైన కొందరి వ్యక్తుల సంగ్రహ జీవితాలు కూర్చబడివున్నాయి. సంఘంలో పలుకుబడి సంపాదించి పైకి రావాలంటే—ఇప్పుడు నా గొడవ అది కనక – ఏం చెయ్యాలో గ్రంథ కర్త కొన్ని నినాదాలు క్రింద క్లుప్తీకరించాడు.

అ : అనవసరంగా మాట్లాడకు.

ఆ : మాట్లాడేముందు నిదానించి చటుక్కున తట్టిన దాన్ని విడిచేసి మరేమన్నా చేస్తే బాగుంటుందేమో ఆలోచించి అది చెప్పు.

ఇ : నిన్ను గురించి మాట్లాడకు.

ఈ : అవతలవ్యక్తిని గురించి మాట్లాడు. అతని భార్య, పిల్లలు,

సంసారం, అభిప్రాయాలు, అభిరుచులు తెలుసుకో. వీలైతే పొగుడు. మెచ్చుకో – మరీ భట్రాజులాగ కాక, లౌక్యంగా స్తోత్రంచెయ్యి.

ఉ : ప్రతివాడు ఏవో కొన్ని తప్పులు చేస్తాడు. ఏవో లోట్లు వుంటాయి. అని తెలుసుకొని సానుభూతి ప్రకటించు. అట్లాంటివి నీలో కూడా వున్నట్లుగా ప్రకటించు.

ఊ : అవతల వ్యక్తి స్త్రీ అయినప్పుడు ఆమెవయస్సు అడగకు.

ఋ : పై అధికారి దండించినపుడు తప్పును ఒప్పేసుకో. సమర్థించకు.

ౠ : ఇవన్నీ ఎప్పుడు ఆచరణలో పెడ్తావు? ఎప్పుడో అవకాశం వసుందని కూర్చోకు. వచ్చేనెల చూచుకుందాంలే అని జాప్యంచెయ్యకు. రేపు ఆలోచిద్దాంలే అని అనుకోకు. ఇప్పుడు, ఈక్షణంలో ప్రారంభించు. లేచి వెళ్ళు."

నిజంగా చూస్తే ఇందులోని ఏవీ కొత్త సూత్రాలు కావు. గీతాకారుడు, భర్తృహరి, వేమన్న ఏనాడో చెప్పినవే. కాని ఈ గ్రంథకర్త నా నిత్యజీవితంలోని విషయాలతో సమన్వయపరచి నినాదాలుగ గద్యలో సూటిగా చెప్పడంవల్ల ఉద్రిక్తుడనై పుస్తకం మూసి అవతలపారేసి రోడ్డు మీదికి పరుగెట్టాను. మొదట్లో ప్రత్యక్షమైంది రోజూ మా వీధిలో తిరిగే పిచ్చాడు. వాడు చక్రవర్తిట. వాడికి రాణీలు కావాలిట. వాడి సామ్రాజ్యంలో ప్రజలు లేరుట. నన్ను రమ్మని ఆహ్వానించాడు. ఏమిటో, నిజంగా ఆలోచిస్తే నాకూ వాడికి తేడా ఏమిటి? వాడిభావాలే నాలోనూ వున్నాయి. ఎటొచ్చీ వాటిని పైకనే సాహసం నాలోలేదు. నా వూహాసామ్రాజ్యానికి నేను చక్రవర్తిని. వాడు స్థూలజగత్తులో తిరుగాడుతున్నాడు. అతన్ని సంఘం చక్రవర్తిగా అంగీకరించలేదు. ఎందుకంటారా సంఘంలో ప్రతిఒక్కడు వారివారి వూహలలో చక్రవర్తులే. ఇట్లాంటివారియందు ఈ గ్రంథకర్త సూత్రాలు ఎందుకు పనికి వస్తాయి? పిచ్చివాళ్ళు పైకివస్తారా, పైకివచ్చినవాళ్ళు పిచ్చి వాళ్ళు అవుతారా? గబ

గబా ఇంట్లోకి వెళ్ళి సమాధానం కోసం మళ్ళా ఆ పుస్తకం తీశాను. దొరక లేదు. ఈ విషయం గ్రంథకర్తకి వ్రాద్దామని ఖాళీ కాగితం మీద గుర్తు పెట్టుకున్నాను. ఒక బ్యాగ్ తీసుకొని ఒక నలభై ఏండ్ల ఆమె వరండాలో ప్రత్యక్షమయింది.

"ఆమె వున్నారాండి?"

నేను మాట్లాడలేదు.

"మిమ్మల్నే, ఆమె వున్నారా అండి?"

నాకు నవ్వొచ్చింది. నవ్వు ఆపుకున్నాను. ఈవిడ కేం సమాధానం ఇవ్వను? ఆవిడ ఒక అడుగు ముందుకేసి "ఆమె ఇంట్లో లేరాండి" అని కంఠం పెద్దదిచేసి ప్రశ్నించింది. నాకు తెలిసిపోయింది. నాకు చెముడు అని అనుకుంటోంది.

'నాకు చెముడుకాదండోయి' అని వెంటనే తట్టిన సమాధాన్ని దిగమింగేశాను.

'ఎవరికోసమండి'

'ఆమె లేరాండి?'

'మీ పేరు?'

'నన్నెరగరా?'

'అయ్యో, ఎరక్కేం!'

'లేడీస్‌క్లబ్ సెక్రటరీని.'

'మీ భర్తగారిపేరు?'

ఆవిడ నవ్వింది.

'మీవారిపేరు చెప్పండి' అంది.

"మా వాళ్ళు దేముందిలెండి, సంతోషంగా చెపుదును. మీ అంతటివారు అడగటం నేను చెప్పకపోదమునా? కాని ఒక్క తిరకాసు వుంది. మా వారు అంటూ లేరు. ఎందుకో మీరు వూహించుకోగలరు. మీ క్లబ్‌లో నన్ను చేర్చుకోరాండి?"

"మీకు వివాహం కాలేదన్న మాట."

"అన్నమాటేమిటండీ, బొత్తిగా కాలేదు"

"రాయలసీమ క్షామనిధికి విరాళాలు పోగుచేద్దామని బయలుదేరాం. అయితే యిది గుర్నాథంగారి యిల్లు కాదన్నమాట?"

"అన్నమాటేమిటండీ, బొత్తిగా కాదు. మూడిళ్ళు దాటాక నాలుగో ఇల్లు వారిది. మీ వారిని కలుసుకోవాలని వుందండీ."

"తప్పకుండా కలుసుకోవచ్చు. కాని ఒక్కటే తిరకాసుంది.

"అయ్యో పాపం! అడిగినందుకు క్షమించండి."

"అదేమిటండోయ్, అసలు పెళ్ళేకాందే."

"అల్లాగా, క్షమించండి."

ఆవిడ వెళ్ళిపోతుంది.

"ఏమండోయ్, మీ వయస్సు మాత్రం చెప్పకండేం"

ఆవిడ నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

నాకు చెముడనే కాకుండా "పిచ్చి" అని కూడా అనుకుంటోం దని నాకు తెలుసు. కాని ఏమి చెయ్యడం? ప్రతి ప్రజా నాయకుడు, కార్యసాధకుడు, వుద్యమకర్త, కొన్ని కష్టాలు భరించాలి. కొన్ని త్యాగాలు చెయ్యాలి. ఈ అనుభవం ఖాళీ కాగితంలో వ్రాసుకున్నాను.

మరో వారంలోనే గ్రంథకర్తగారి సూత్రాలు పూర్తిగా ఆచర ణలో పెట్టే అవకాశం దొరికింది. మా మామయ్యగారి వూరికి గంట రైలు ప్రయాణము. పెట్టెలో జనం కిటకిటలాడుతున్నారు. కాని రైలు కదిలే సమయానికి చాలామంది దిగిపోయారు. పెట్టెలో మిగిలింది ఆరు గురం. ఒక ముసలామె, ఆమె మనుమడు, తలపాగా ఆసామీ, ఒక పోలీసు, నా ఎదురుగుండా సీటు మీదా ఒక ఘరానా వ్యక్తి. పత్రిక తీసి చదువుతున్నట్లు అభినయిస్తూ ఆ పెట్టెలో వున్న వ్యక్తుల వాలకా లను బట్టి వారు ఏయే వృత్తులలో వుండి వుంటారో వూహిస్తూ కాలక్షేపం చేశాను. తలపాగా ఆసామి వ్యాపారస్థుడు. ముసలామెను పోల్చా

లేకపోయాను. పాలు, పిడకలూ అమ్ముతూ జీవితం గడుపుతుంది కాబోలు. మనవడు రబ్బరు త్రాడు తగిల్చిన బంతిని ఎగరేస్తూ తనవైపుకు లాక్కుంటున్నాడు. సరే, పోలీసు ఆయన పోలీసాయనే. నాకు చిన్నప్పటినుంచీ పోలీసులన్నా, కాకీ చొక్కా, లాగు వేసుకున్న మిలటరీ వాళ్ళు అన్నా చచ్చే భయం. ఒకే రకం దుస్తులు ధరించిన ఏ పది మందిని చూసినా కూడా భయమే. ఎందుకో తెలియదు. చిన్నప్పటి నుంచీ పోలీసులంటే భయం నేర్పుతారు కాబోలు. అసలు శాంతి కాముడుగా జన్మించానేమో లేక సహజమైన భయాన్ని అహింసాతత్వంగా మార్చుకున్నానేమో! ఈ భయమే అసహాయకుడుగా చేస్తుందనుకుంటాను భయం దిగమింగుకొని సాహసం అలవర్చుకొంటే మానవుడు సాధించని కార్యం లేదనుకుంటాను ఇవన్నీ నాకు తెలుసు. కాని ఆదర్శానికి ఆచరణకి చాలా వ్యత్యాసముంది. పర్యవసానం ఏమిటంటే కాస్త దూరంగా వుండి ఆ పోలీసాయన ముఖం కేసి మళ్ళా చూడలేదు. ఆ ప్రక్క స్టేషనులో రైలు ఆగడం తలపాగా ఆసామి దిగడం మళ్ళా రైలు కదిలే వరకూ నేను గమనించనే లేదు. ముసలామె పడుకుంది. రబ్బరు త్రాడు తెగిపోయి కుర్రాడు వుత్తబంతితోనే ఆడుతున్నాడు. మళ్ళాపత్రికచూశాను వుద్యోగం ఖాళీల వివరాలు చదివాను. నాకు నచ్చినది ఒకటీ లేదు. "వరుడు కావలెను" జాబితా చూశాను. నాకు తగినవారు ఒక్కరూలేరు. పరమపదించిన వారి చిట్టా చూశాను. నా కిది నచ్చింది. నా భావాలు చాలా చెడ్డవి. చనిపోయినవాళ్ళను గురించి చదవడం నా కిష్టం. ఆత్మహత్యలు, హత్యలు మరీ యిష్టం. ఎవరేనా చనిపోతే వారిల్లు ఖాళీ అవుతుంది కదా! వారు చేసిన ఉద్యోగం ఖాళీ ఏర్పడుతుంది కదా ? ఎక్కడో విమానం తగులబడింది. మరెక్కడో యుద్ధం, రెండు లారీ ప్రమాదాలు, ఒక రాజకీయ హత్య. మరో ప్రాంతంలో కరువు. ఒక దేశంలో భూకంపం. మరోచోట అగ్నిపర్వతం ప్రేలుడు. పసిఫిక్ సముద్ర... రెండు ఓడలు మునిగాయి. ఇవన్నీ ఆ పత్రికలో వార్తలు. ఒక

రోజులో యింతమంది చనిపోయారే. యిన్ని ఖాళీలు ఏర్పడ్డాయే. నాకు మాత్రం వుద్యోగం దొరకదేం? ఎదురుగా కూర్చున్న ఘరానా వ్యక్తి నోట్లో సిగరెట్టు పెట్టుకొని అగ్గిపుల్ల కోసం సంజ్ఞ చేశాడు. నా దగ్గర లేదు. పోలీసాయన కేసి చూపించాను నా చేతిలో పత్రిక ఆయనకు యిచ్చాను. ఆయన సిగరెట్టు ముట్టించి పత్రిక చదువుతూ కూర్చున్నాడు ఆయన కేసి పరకాయించి చూశాను. వయస్సు ముప్పైలోపు. దట్టంగా మీసాలున్నాయి. ఖద్దరులాల్చీ, పైన కండువా, కళ్ళజోడూ, మధ్య పాపిడ, రెండు అంగుళాలు నడిచే జుట్టు సుడులు తిరగటం మూలాన్న నిలిచిపోయింది. ఆయన విద్యార్థి కాడు, వుద్యోగి కాడు, రైతు కాడు, వ్యాపారస్థుడు కాడు, భూతవైద్యుడు కాడు. ఇల్లా ఆయన ఏంకాడో ఒక రోజల్లా చెప్పుకుపోగలను మరెవరు? శాసనసభా సభ్యుడేమో! ఆయన ప్రాపకం నా కవసరం. "అల్పుడా! మందభాగ్యుడా. ఇంకా ఎంత కాలం జాప్యం చేస్తావు? రైలు చక్రాలకింద నిమిషాలు నలిగి చస్తున్నాయి. ఆయన్ని మంచిచేసుకోవాలని లేదా? ఆయన్ని పలకరించవేం? లే, వెళ్ళు; మాట్లాడు" అని అంతరాత్మ దండిస్తోంది.

"బాగా చెప్పావు. యింకా చివాట్లుపెట్టు. నాకు మీ భాషరాదు. వస్తే నేనూ నాలుగు తిడుదును" అని గ్రంథకర్తగారు అంతరాత్మని వురిగొల్పుతున్నాడు. ఇంక నేను ఆలసించచానకి వీల్లేదు. గొంతుక సవరించుకుని ఉపక్రమించాను.

'తమ నామధేయం...?'

ఆయనేమీ మాట్లాడలేదు.

'తమ పేరు శెలవిచ్చారు కారు'

ఆయనకి చెముడా అన్న అనుమానం రాసాగింది.

'మిమ్మల్నే' అన్నా కొంచెం బిగ్గరగా.

పత్రిక ముడిచేసి, నాకేసి చూశాడు.

'అయ్యా' అన్నాడు.

'తమపే రడిగాను.'

"మిమ్మల్ని నేనూ అదే అడుగు దామనుకుంటున్నాను."

నా పేరు చెప్పాలనీ, మా తాతగారిపేరు చెప్పాలనీ - మా తాత గారి తండ్రిగారు కొన్నాళ్ళు దివాన్‌గిరి చేశాడుట. ఇప్పుడవన్నీ ఎవరు వాకబు చెయ్యొచ్చారులెండి – నాలిక చివరిదాకా వొచ్చేసింది. దానిని దిగమింగాను.

"తమరెవరో..."

ఏమిటి చెప్పాలో స్పష్టంగా లేకపోతే వాక్య నిర్మాణం యిల్లాగే ఏడుస్తుంది.

"మిమ్మల్ని ఎక్కడో చూసినట్లున్నాను" అన్నాడాయన.

"మిమ్మల్ని తప్పకుండా చూశాను ... కాకినాడా ... ? పట్నమా...?"

"ఆ జ్ఞప్తికొచ్చింది. మిమ్మల్ని నెల్లూరులో చూశాను అన్నాడాయన.

నేను నెల్లూరుకిగాని, ఆ చుట్టుపక్కలకిగాని, రైలు ప్రయాణములో తప్ప వెళ్ళలేదు. కాని ఖండించటం తప్పనీ వాదనలోకి దిగవద్దనీ, "లోకం బానిస" గ్రంథకర్తగారి నినాదం చెవులో అద్దె ఎగేసి కాపురం వుండి, ఇల్లు తన స్వంతదే అనే స్థితి కొచ్చింది.

"నా దేముందిలెండి. మీరంటే దేశం నాలుగు మూలలూ తిరిగొచ్చినవారు. పై దేశాలుకూడా పర్యటన..."

"ఎబ్బే — లేదండి- నా మోహం – మీ మాట చెప్పండి — మీరు ఉత్తర హిందూదేశం అంతా తిరిగొచ్చినట్లుగా వున్నారు" అన్నాడాయన.

"తాజమహల్‌ను గురించి మీ అభిప్రాయం వినాలనుంది" అన్నాడు.

"ఏం లేదులెండి –కన్యాకుమారినుండి సూర్యాస్తమయం గొప్పగా వుంటుందిట. దాన్ని గురించి మీరేమన్నా చెబుతారేమో..."

సూర్యాస్తమయం వర్ణనపద్యం ఒకటి జ్ఞప్తికొచ్చింది. దాన్ని నాలుకకిందే నలిపేశాను.

"మీకండువా చాలా బాగుందండి – ఆ ఖాదీ ఎక్కడిదండి!" అన్నాను. ఆయన నా జోళ్ళకేసి చూస్తున్నారు.

"మీ జోళ్ళు బాగున్నాయి. ఎంతకి తీశారు ?

"మీ కండువా గురించి చెప్పారు కారు..."

"ఆ—ఇదేముందిలెండి—ఇది నాది కానేకాదు ఓ స్నేహితుడిది" అన్నాడాయన.

మీ స్నేహితుల్ని బట్టి, మీరెవరో చెప్పవచ్చునంటూ వుంటారు పెద్దలు. మీ స్నేహితుడి అభిరుచులు మంచివండి. బాగుంది కనుకనే మీరు దాన్ని ధరించారు. మీ స్నేహితుణ్ణి గురించి వినాలనుంది. చెప్పండి" అన్నాను.

రైలు నిలిచింది. కుర్రాడు ఎగరేస్తున్న బంతి తిన్నగా వొచ్చి ఆయన మెడకింద కండువా డాగుచేసి పడింది.

"మీవాడా ?"

నా వొళ్ళు మండింది. ఈ దౌర్భాగ్యుడు ఆ మాత్రం వూహించ లేడు. పెండ్లయి, అంత వయస్సు పిల్లడి తండ్రిలాగున్నానా — కళ్ళు లేవు ? అందుకనే కండ్లజోడు పెట్టుకున్నాడు!

ముసలమ్మ, మనవడు దిగిపొయ్యారు. రైలు కదిలింది. ఘరానా వ్యక్తిపై కోపం వచ్చేసింది. "లోకం బానిస" గ్రంధకర్త మీద కోపం వచ్చేసింది. అసలు మొత్తంగా పుస్తకాలంటేనే కోపం రేగించి. ఎవ్వళ్లూ పుస్తకాలు చదువకూడదు.

పుస్తకాలకి అలవాటుపడినవాళ్లు వూహలో జీవిస్తూ, లోకజ్ఞానం లేక, అనామకులుగా, ఎందుకూ పనికిరాకుండా తయారవుతారు పుస్తకాలని నిషేధించాలి ప్రభుత్వాలు. ప్రతి గ్రంధకర్త, ప్రభుత్వానికి పుస్తకానికి వెయ్యిరూపాయిలు చొప్పున సుంకం చెల్లించి మరీ రచనకి

పూనుకోవాలి. దాన్ని పుస్తక భాండాగారములో భద్రంగా ఉంచాలి. దానిని చదవాలన్నవారు ఐదు రూపాయలు రుసుం చెల్లించాలి. అప్పుడు కాని యీ రాతలు, చదువులు తగ్గవు.

"లోకం బానిస" గ్రంథకర్త కేవలం ఆ పుస్తకం వ్రాసే బోలెడు డబ్బు సంపాదించాడు. ఇంకేపని వాడికి చేతగాదు. అతను పాశ్చాత్యుడు — వారి దేశంవారిని ఉద్ధరిద్దామని వ్రాసుకున్నాడు. నే నెందుకు చదవాలి? పాశ్చాత్యుల నాగరికత వేరు. సంస్కృతి వేరు. వారి ఆదర్శాలే వేరు. వారిది కృత్రిమ జీవితం; విద్యుత్ పరికరాలపై ఆధార పడ్డ అసహజమైన జీవితం. వారి విజ్ఞానంలో జ్ఞానానికి స్థానంలేదు. వారి కళలు, వినోదాలు వేడుకలు, చౌకబారు విలువలు గలవి. వేగం, పైపై నిగనిగలు అశాశ్వతమైన, బుద్బుదప్రాయాలైన వెకిలి, బాహ్య, శారీరక, ఇంద్రియాలతృష్ణతో నశింపయ్యే రైలుపొగలాంటి జీవితానందాలు వారివి. ఈ యుద్ధాలన్నీ ఆ విధానంవల్ల సంక్రమించినవే అని వారే వొప్పు కుంటున్నారు. ఇంకా పైకి రా; డబ్బు గడించు; అధికారం తెచ్చుకో. సుఖించు. నీ బాగు చూసుకో — ఇల్లా ప్రతివారూ కృషిచేస్తే వారందరి "అహం"లూ ప్రేలి, ఢీకొని, యుద్ధంగా గాక, మరెల్లా అంతమొందు తాయి ?

ఇంక నేనా — మాది వ్యవసాయ నాగరికత. ప్రకృతితో ముడి పడిన సహజ సంస్కృతి. ప్రపంచాన్ని తిలకించడం — ఆలోచన, తపస్సు — ఆధ్యాత్మిక చింతన, జన్మరాహిత్యం, "అహం"ని చంపడం— యివి మా జీవితవిధానం. కడుపులో చల్ల కదలకుండా, హాయిగా కొబ్బరి చెట్లకింద చాపేసుకుని పడుండి, పక్షుల ప్రేమగానం వింటాను. ఆవు పాలు స్వయంగా పితుక్కుని త్రాగుతాను. భాగవతం చదువుకుంటాను. పొలందున్నుతాను. కూరగాయలు స్వయంగా పండించుకుంటాను. చదరంగం ఆడుకుంటాను. రాట్నం త్రిప్పుతాను. నదిలో స్నానంచేసి, పరమాత్మని తెలుసుకోవాలని పూజచేస్తాను. నే నెక్కడికీ వెళ్ళాను,

నాకు డబ్బొద్దు — అధికారం వొద్దు, గొప్పవద్దు, బస్తీవద్దు, విద్యుత్ నాగరికత వద్దు, యుద్ధాలొద్దు; ఇంటికెళ్ళి ఆ పుస్తకాన్ని చించెయ్యా లన్నంతకోపంవచ్చింది.

"అవునులెండి — దేశంలో జనాభా పెరిగిపోతోంది. కుటుంబ నియంత్రణ మంచిదని పెద్దలంటున్నారు. మీబోటి వారు ఆచరణలో పెట్టడం బాగుంది. మీరే మార్గదర్శకులు" అన్నాడాయన. ఇదెక్కడి గొడవ, నా కసలు పెండ్లేకాందే! ఖండించడం తగదు.

"మీ అత్తవా రేవూరండి ?" అని ప్రశ్నించాడు. పెండ్లిని గురించి, ప్రేమతత్వం గురించి నా అభిప్రాయాలు చెప్పాలనిపించింది. ఎల్లా? అవతలవ్యక్తిని గురించే మాట్లాడాలి !

"మీ పిల్లల్ని గురించి చెప్పండి — చదువు కుంటున్నారా ? వారి వయస్సులు — అమ్మాయిలైతే వయస్సు చెప్పనక్కర్లేదు లెండి" అన్నాను.

"పిల్లల చదువు, ఉద్యోగావకాశాలు, జాతీయ విద్యా విధానం — వీటిని గురించి మీ అభిప్రాయాలు చెప్పండి".

"మీరు స్వచ్ఛమైన తెలుగు మంచి జాతీయాలతో మిళాయించి మాట్లాడుతున్నారు. సంస్కృతంలో పాండిత్యం సంపాదించినట్లున్నారు." అన్నాను.

"నేనడిగిన దానికి సమాధానం చెప్పకుండా తప్పించేస్తున్నారు. మీరు కవిత్వం వ్రాస్తారు. కాదనకండి"

ఇదేం కర్మ !

"మీబోటి రసికుల ఆదరణ వున్ననాడే కవిత్వానికి దోహదం చేకూరుతుంది. ఏమంటారు ?"

"మీరు చదువుకుంటున్నారా ?"

"మీ వుద్యోగం —"

"ముందు మీ విషయం చెప్పండి." అని కంఠం కాస్తంత పెద్దది చేశాడు.

"అదేనయ్యా నేనూ అంటున్నది. ముందు మీ విషయం చెప్ప మనే."

"ఏమిటయ్యా మహా యిందాకటి నుంచి చూస్తున్నాను. ఒక్క ప్రశ్నకీ సమాధానం చెప్పవు —"

"నీ వ్యవహారం మరీ ఘోరంగా వుంది. సమాధానం చెప్పవు సరి కదా, ప్రశ్న పరంపరలు కురిపిస్తున్నావు" అన్నాను.

"నీ వ్యాకరణ బద్ధమైన భాష నా నెత్తిలాగ వుంది కాని, నీ పెళ్ళి, పెళ్ళాం విషయం చెప్పు —"

"ఏమయ్యోయి, యింత వరకూ చెప్పలేదు. యిప్పుడు చెప్పేస్తున్నాను. నేను కవిని. బోలెడంత కవిత్వం వ్రాసాను. కాపీలు కావాలంటే నాకు వ్రాయాలి తెలుసా ! నువ్వు చదవకపోతే సరా ? నీలాంటి రసికులు ఎందరు తక్కువుంటే కవిత్వానికి అంత మంచిరోజులు పైగా నా పెళ్ళాం గొడవ నీకెందుకూ ? అసలు నాకు పేళ్ళే కాలేదు. నీ పిల్లల విషయం అఘోరించు." అనేశాను ఒళ్ళుమండి.

"మాటలు తిన్నగా రానియ్. నా పిల్లల జోలి నీకెందుకు ! నీబోటి గాడి దిష్టి తగిలిందంటే అసలు పిల్లలే పుట్టరు. నీకొక్కడికే కాలేదను కున్నావా పెళ్ళి. నాకూ కాలేదు. అసలు కాదు కూడా" అన్నాడు.

"ఏం ఏంవచ్చింది తెగులు నీకు. గుడ్డివాడివా, కుంటివాడివా ?"

"ఛీ, నోర్మూయ్."

"ఛ, ఛా, నీ నోరు నీచేత్తో మూసుకో. మూతికి తాళం వేసి తాళం నాకియ్యి."

ఆయన లేచి లాల్చీ చేతులు పైకి మడుస్తున్నాడు.

"ఏదీ, యిప్పుడు వాగు."

నేనూ లేచాను.

"ఏం కొడ్తావా ? ఏయ్ పోలీసాయనా !" అని పోలీసాయన కూర్చున్న వేపుకి చూశాను. ఏడీ, ఎక్కడా లేడే. సీటు కింద దూరి ఒక దుడ్డు కర్ర, నల్ల కంబళీ పైకితీసి చుట్టచుట్టి బయటకు పోయాడు.

జనం పెట్టెలోకి ఎగబడుతున్నారు. "ఇది ఏ స్టేషన్" అని అడిగాడు ఘరానా వ్యక్తి.

"వలానా" అన్నారు ఎవరో.

ఘరానా వ్యక్తి గబ గబా సంచి తీసుకొని జనం లోంచి పెట్టె బయటపడ్డానికి పెనుగులాట సాగించాడు. అతగాడిని ఎదుర్కొన్న వస్తు పరంపర ఒకటా. కొబ్బరికాయల సంచీ, కుడి ఎడమల వైపుల వారిని ధృతరాష్ట్రి ద్వయంగా చేయగల పాల కావడి, మృదంగం లాగ మోగే కిరసనాయిలు డబ్బాలు. కట్టెల మోపు, మూతి వూడిపోయిన మిరప కాయల సంచీ, యీ సరుకు తాలూకు ఆసామీల సముదాయం. యిందరి లోంచి బయటపడడంలో ఘరానా వ్యక్తి సంచిలోంచి ఒక గ్రంథరాజం కిందపడి నలిగి చిరిగి తుత్తునియలు కాబోతుండగా పురావస్తు పరిశోధన లాంటి సాహస కృత్యంతో దాన్ని బయటికి లాగి, దులిపి ఘరానావ్యక్తికి యిచ్చాను. రైలు కదులుతోంది. ఆయన చాలా థ్యాంక్స్ చెప్పడం గ్రహించాను. ఆయన సంచీ లోంచి పడిపోయిన పుస్తకం పేరు "లోకం బానిస" నా అభిమాన గ్రంథరాజం. చిన్న పొరపాటు జరిగిపోయింది. నేను దిగవలసిన స్టేషన్ దాటిపోయింది.

# సౌందర్యాన్వేషణ

ఇంట్లోకి సరుకులుతెద్దామని బజారుకి బైలుదేరాడు పరంధామయ్య. కాస్త చల్లబడిన తర్వాత వెడతానన్నాడు. కాదు వెంటనే వెళ్ళమంది. ఆయన భార్య పార్వతమ్మ ఎందుకో అతనికి వెళ్ళాలనే వుంది. కాని భార్య తొందరగా వెళ్ళమంది. కాబట్టి కొంచెం ఆలస్యం చెయ్యడంలో కాస్తంత తృప్తి. అదేం చిత్రమో ! రకరకాలుగా మొగాడు తన ఆధిక్యతని ప్రకటించుకుంటాడు కాబోలు ననుకున్నాడు వెడుతూ. శెలవు రోజు కోసం వారం అంతా ఎదురు చూస్తూ, తీరా వొచ్చిం తర్వాత ఏమీ చెయ్యక వృధాగా గడిపేశామే అని బాధపడుతూ మళ్ళా పని ప్రవాహములో కొట్టుకు పొయ్యే మధ్య తరగతి వ్యక్తి పరంధామయ్య. శెలవు రోజున తన వ్యక్తిత్వానికి అనువైన పని ఏదో చెయ్యాలి. ఏం చెయ్యాలో అతనికి తెలియదు. ఇంట్లో గడపడం మాత్రం కూడదు. తనూ, భార్యయింకెవ్వరూ లేకుండా, అల్లా అల్లా షికారు తిరిగి సినిమాకెళ్ళి, ఏ హోటల్లోనో భోజనం చేసి, పార్కులో పెళ్ళినాటి సంఘటనలను స్మరించుకుని, గేట్లు మూసేసి అందరూ ఇళ్ళ కెళ్ళిపోయిం తర్వాత గడ్డిలో ఆమె తొడమీద తల ఆనించి పడుకుని ఏమీ మాట్లాడకుండా ఆకాశంలో నక్షత్రాలకేసి నిశ్చలంగా చూస్తూ విశ్వంలోని నిశ్చలత్వాన్ని తనలో నింపుకుని క్రొత్త సౌందర్యాన్ని ఆనందాన్ని పొంది ......

అనుకుంటాడు; అంతే. ఆమె పుట్టింటి కెళ్ళినప్పుడు ఈ ఆలోచనలు వొక ప్రణాళికస్వరూపం దాలుస్తాయి. ఆవిడలో వున్నప్పుడు వీటిల్లో ఏదీ ఆచరణయోగ్యంగా కనబడదు. ఎందుకో—క్రొత్త సౌందర్యం.

అదే పెచీ—వారిజీవితాల్లో ఆనందం సౌందర్యం లేవు. శారీరక సౌందర్యం అంత ముఖ్యమైంది కాదంటారు. మరేదో శీలంలో సౌందర్యంట—మనస్సులో వుంటుందిట. బాహ్య సౌందర్యం వుంటేనే ఆ మిగతావి కూడా వుంటాయి. అనాకారులైన కొందరు పెద్దలు, సుందరాకారులు విర్రవీగుతోంటే చూసి వోర్వలేక, ఈ సిద్ధాంతం ప్రతిపాదించి అమాయక ప్రజపై రుద్దారు. ధనికవర్గం భోగండుదర్చాలని పేదతనంలో

ఆనందాన్ని పొగిడిపారెయ్యమని కవులను ప్రోత్సహించారు. సూది రంధ్రంలో వొంటె దూరడం ఎంతకష్టమో, భాగ్యవంతుడు స్వర్గద్వారం గుండా దూరటం అంత కష్టంట ఇదంతా వెనక. ఈ రోజుల్లో ఈ దగా అంతా బైటపడిపోయింది. ప్రతివాడికి తిండి, బట్ట, కొంప, విశ్రాంతి, భార్య, పిల్లలు-కావాలి. నలుగురూ కూడబలుక్కొని, వాటాలు నిర్ణయించుకుంటే శాంతియుతంగా పరిష్కారమయ్యేపని ఇదంతా. నేటి దేశాలు ఈ పనికి పూనుకున్నాయి.

సౌందర్యం ఎట్లా వొస్తుంది? డబ్బుంటే ఏదిపడితే అదే వొస్తుంది. ఆధునిక విజ్ఞానశాస్త్రజ్ఞులు కనుక్కొన్న నూతన పరికరాలద్వారా అందాన్ని కూడా పొందవచ్చు. సినిమా తారలని చూడండి. కృత్రిమమైనవైనా, ఆకర్షణీయంగా వుంటారా లేదా? ఉంటారు.

తన అందంగూర్చి పరంధామయ్యకి బోలెడన్ని శంకలు. మొగాడి అందం ఎవడిక్కావాలి అని తృప్తిపడే ఘటంకాడు. అందం స్త్రీది, తెలివి పురుషుడిదీ అనుకునే రోజులువెళ్ళిపోయినై. ఇరువురూ సమంగా ఎంచబడే రోజుల్లో తనలాగే స్త్రీ కూడా మొగాడు అందంగా వుండాలని కాంక్షించడంలో ఆక్షేపణ వుండనక్కర్లేదు. కొంచెం పొడుగాటి ముక్కు. కాస్తంత పొట్టిదిగా వుంటే ఎంత బావుండును. ఎన్నోసార్లు అద్దంలో ముక్కుని వేళ్ళతో నొక్కిపట్టి పొట్టిదిగా చేసి చూసుకొని లోలోన సంతోషించేవాడు. పెదవులు కొంచెం వంకర-ఏవంకరా లేకుండా ఎవ్వరిపెదవులూ ఉండవు-దాన్ని వదిలేద్దాం. జుత్తు—పాపిడ తిన్నగారాదు-అన్నీ సుళ్లే. వెంట్రుకలు లేచినిలబడతాయి. బ్రిలియంటైన్లు అవీ రుద్ది నీళ్ళురాసి అదిమితే వో పదినిమిషాలపాటు అణిగిపడుంటాయి అంతే. మళ్ళా తడిఆరగానే, విశ్వంలోకి పయనంచేసే రాకెట్‌లాగా తిన్నగా పైకినిలబడతాయి. దాని కేదో చెయ్యొచ్చు. చెయ్యాలి. విజ్ఞానశాస్త్రజ్ఞులు యీపాటికి కనిపెట్టేవుంటారు, ఏదో సాధనం. కాని అది మనదేశం చేరుకుని నలుగురికి తెలిసి, అందుబాట్లోకొచ్చేసరికి ఆ వున్న జుత్తుకాస్తా వూడిపోదని అనుకోడం ఎల్లాగ? ఈ జుత్తు వూడే జాడ్యానికి ఏదన్నా మందు కనుక్కున్నారా శాస్త్రజ్ఞులు? ఆ మధ్య ప్రపంచంలో పెద్ద డాక్టర్లు వొకచోట సమావేశమై జుటు వూడ్చా

నికి మందు లేదని తీర్మానించినట్లు పత్రికలో చదివి, బెంగెట్టుకున్నాడు పరంధామయ్య.

కాఫీ హోటలుకి చేరుకున్నాడు. ఆలోచనలతో అతనికి దూరమే తెలియలేదు. హోటల్లో బల్లముందు కూర్చున్నంత వరకూ అక్కడికి చేరుకున్నట్లే తెలియదు. టిఫిన్ తీసుకున్నాడు. టీ త్రాగాడు, మళ్ళా బైలుదేరాడు.

తనమాట వొదిలేద్దాం. పార్వతమ్మ అందం విషయం ఆలోచించు. ఆలోచించేటందుకేముంది? ఏమీలేదు. ఆమె అందంగా వుండదు. ఏ అవయవాని కా అవయవం, విడమర్చి పరిశీలిస్తే ఏ లోటూ కనబడదు.

నుదురు: జెడ, మెడ, కళ్ళు, నోరు, చెక్కిళ్ళు, చెవుల మీద జుత్తు-అన్నీ దేనికవి బాగానే ఉంటాయి. అన్నీ కలిపి మొత్తంగా చూడండి. ఏదో తరకాసుంది. ఎందుకల్లా దగా చేసుకోవడం-విడివిడిగా ఏ అవయవము బాగుందనగలవా? కనుబొమ్మలకి ఆకారంలేదు. అర్ధచంద్రాకారం ఆకృతి కలిగి దట్టంగా, నల్లగా, స్ఫుటంగా వుండాలి. అల్లాలేవు. ఆ ముక్కు? కాస్తంత పొట్టదనే వొప్పుకోవాలి. వేళ్ళతో ముందుకి లాగి చూసినప్పుడు, ఆ తేడా తెలిసొచ్చేది. మళ్ళా ఎంతో అక్కర్లేదు సుమాండి. కాస్తంత తన ముక్కులో పొడుగైన ఆ కాస్త భాగం కోసేసి, ఆవిడ ముక్కు మొనకి అతికించివేస్తే, అహా ఎంతబాగుంటుంది! ఈ రకం ప్లాస్టిక్ సర్జరీవుందని చెబుతూవుంటారు. కాస్తంత ముందు కొచ్చిన పళ్ళని వూడగొట్టించి చక్కగా కొత్తపళ్ళని అమర్చుకుందిట ఒక సినిమా నటి. ధన్యురాలు!

ఇంతకీ తను ఎక్కడికి నడుస్తున్నట్లు? ఇంట్లో సరుకుల కోసం. ఏం సరుకులు? జ్ఞాపకానికొస్తున్నాయి. ఎక్కడెక్కడ దొరుకుతాయో కూడా అతనికి తెలుసు. ముందు ఆ కొట్లో కెడదాం. అదుగో, ఆ సందు మలుపులో.

సందుమలుపు తిరగగానే, ఒకరివెనక ఒకరు వరుసగా నిలబడ్డ జనం-రోడ్డంతా కమ్మేశారు. ఓ ఏంజనం, ఏంజనం? ఏదేనా ఊరేగింపు కాబోలు. వరుసగా క్యూలో నిలబడడం దేనికో? మన ప్రజలకి ఎంత

డిసిప్లిన్! ఇవతల ప్రక్క మొగాళ్ళ క్యూ ఫర్లాంగుపొడుగు. అవతల ప్రక్క స్త్రీల క్యూ. ఈ జనం ఎందుకు నిలబడ్డారో; క్యూచివరలో ఏముందో? ఈ క్యూయోధుల పరమావధి ఏమిటో? వీ రారాధించే దైవం ఎవరు చెప్మా.

'ఏ అబ్బాయ్—ఏమిటిదంతా?" సమాధానం చెప్పకుండా, ఆ కుర్రాడు పరుగెత్తికెళ్ళి క్యూలో కూరుకుపొయ్యాడు. పైనపేలి ఊబిలో కూరుకుపోయిన విమానంకిమల్లె.

"ఏమిటండీ ఈ జనం అంతా?"

"అవును జనం"

అన్నాడాయన. అనడమూ, వెళ్ళి క్యూలో మునగడ మూను-ముక్కుమూసుకుని గ్రహణంనాడు సముద్రస్నానం చేస్తూ మునిగినట్లు, భక్తుడు. తనకెందుకు, తనదోవనుతనుపోక. ఇందరు మనుషుల్ని ఒదిలి ఎలా వెళ్ళడం? వారి రహస్యాన్ని ఛేదించకుండా మానవుడు అడుగు ముందుకివెయ్యలేడు. అదే మానవత్వం అంటే. తోటి మానవుడి రహస్యాన్ని పంచుకోడం.

"ఏమండీ యీ క్యూ దేనికండి?" పరంధామయ్యనే అడిగాడు వో పెద్దమనిషి.

"అదే నేనూ అడుగుతుంట"

'రండి వెడదాం.' అంటూ ఆ పెద్దమనిషి క్యూ రంగ భూమిపైకి దుమికాడు. అదొక రణరంగం లాంటిది. ముందు వాణ్ణి కొంచెంగా నెట్టాలి. — తోపు సరియైన వొత్తిడితో జరగాలి. జోరైందంటే ఫెడీల్మని చెంపమీద కొడతాడు వెనకవాడి తోపిడిని తను తట్టుకోవాలి. వెనక్కి తిరిగి మందహాసం చెయ్యాలి. ముందాయన్ని చుట్టనోట్లో పెట్టుకుని అగ్గిపుల్లకోసం తడుముకుంటుంటే, అగ్గిపుల్ల తనుగియ్యాలి. లేకపోతే వీపు మీద లాల్చీకి లేని బూజుని దులపాలి. ముందు వ్యక్తి అంగుళం ముందుకెడితే యుగం గడిచినట్లే.

క్యూ ప్రభావం సుడిగాలిలా పరంధామయ్యని చుట్టేసింది. మానవ హృదయం దేన్నో ఆసించి రోదిస్తుంటే తాను చెవులు మూసుకో

గలడా! ఆర్తనాదం వినబడటంలేదా? తోటి మానవుడు చిక్కులో వున్నాడు. క్యూలో పడిపోయ్యాడు. క్యూ అనేది సంసారం కుళ్ళు లాంటిది. అది రొంపె. ఒక మాయ. భ్రాంతి. అందులోంచి బైటపడే మార్గం చూసుకోమనే వేదాలఘోష.

'క్యూ చివరలో ఏముందబ్బాయి?' కుర్రాడు ఒగురుస్తున్నాడు. క్యూ సమరంలో గాయపడి వెనక్కి తిరిగొచ్చిన బాలవీరుడు.

'చంపిపారేశారండి — నిలబడి కాళ్ళుమండుతున్నాయి. అడుగో ఆ బొండుకాకిలా వున్నాడే ఆయన నెట్టిపారేశాడు. ఇట కామదగాడు.'

"ఇంతకీ ఏమిటట ?"

"అందం అమ్ముతున్నారుటండి"

అని బాలవీరుడు కుంటుకుంటూ నిష్క్రమించాడు. పరంధామయ్య పరధ్యాన్నం కట్టిబెట్టి ఒక్క గంతేసి క్యూ చివరలో నాలుగంగుళాలు చోటుచేసుకుని స్థావరం ఏర్పరచుకున్నాడు. అమ్మయ్య! ఒక మజిలీ గడిచింది. మదీనాచేరాడు. మక్కాకిపోవాలి. వెనక మరో పదిగజాల పొడుగు జనం గొలుసుకట్టేసుకున్నారు. అందులో నిలబడు, కదలకు; అదేరాసి పెట్టాడు దైవం. ఓపిగ్గా నిలబడు. దైవం నిన్ను పరీక్షిస్తున్నాడు. సహనం స్త్రీ సొత్తా? మొగాడిదీను. బుజాపుచెయ్యి నిలబడు.

నిలబడ్డాడు పరంధామయ్య. కాసేపీకాలు, కాసేపాకాలు, అఖరికి రెండుకాళ్ళూను. చేతులని ఏం చెయ్యడం ? కట్టేసుకున్నాడు. కాసేపు భుజంపైన వేళ్ళాడతీయడం, కొంచెంసేపు మెడచుట్టూ ఉరిపోసుగోవడం, చేతులు పైకెత్తు. దించు రెండు చేతులూ కట్టుకో, అదొకశిక్షణ, డ్రిల్లు, యోగాభ్యాసం, క్యూ ఆసనం అనొచ్చు.

పరిసరాల పరామర్శ ముగించుకొని పరమావధిని గూర్చి ఆలోచించసాగాడు పరంధామయ్య. అందం అమ్ముతున్నారట. అందుకనే యింతజనం. చిత్రం తను ఇంతకుముందు అందాన్ని గురించే ఆలోచిస్తూ వుంట. కోయిన్సిడెన్స్‌కి తెలుగు తెలీదు. జరగబొయ్యే ఘట్టాలు నీడల్ని ప్రసరిస్తాయట. తమసౌందర్యం గురించి ఆలోచించటం, సౌందర్యం

లభ్యంకావడం - ఎల్లా ఉందంటే - సత్యాలలోకి గొప్పసత్యం. సత్యం సంభవం కావడమే - లాగుంది అందం అమ్ముతున్నారా? అందుకనే అంతమంది స్త్రీల క్యూ. అబ్బో! - రెండు ఫర్లాంగులు పొడుగుగల క్యూలో స్త్రీలు, బాలికలు, కన్యలు, యువతులు, నడి వయస్కులు, వృద్ధ నారిలు - అందరికీ అందం కావాలికదా! అందం చర్మం అంతలోతే అనడానికి వీల్లేదు. అందం క్యూ అంత మందం గలది.

క్యూలో కాలక్షేపం కాదు. నిజమే ముందువాడి వెన్ను ఎంత సేపని చూడగలం? వ్యక్తిత్వం లేనిదీ, ఆకర్షణ పరిపూర్ణంగా లోపించినదీ ఏదయ్యా అంటే మనిషి వీపు - మొగాడివీపు. ఎంతసేపనిచూడటం. వెనక్కి తిరిగితే, ఆసామీ మీసాలమధ్య నలిగిన చుట్ట - అబ్బో! ఆయన కనుబొమ్మలు చూడు - అనొక పిల్లఅడివి - ఋషులు అడివిలో తపస్సు చేసుకుంటుంటే రాక్షసులు వారిని చావదన్ని తరిమి, ఆశ్రమం ధ్వంసం చేసింతర్వాత, మిగిలిన అడివిలాంటిది. అందుకనే ఆడాళ్ళకి వేరే క్యూ పెట్టారు. బాగుంది పౌరసత్వ బాధ్యతలు గుర్తెరింగిన ప్రజ, ఏమీతోచకపోతే స్త్రీలకేసి చూస్తూ కూర్చోవచ్చు. క్యూ చివరలో అందం మాట ఎల్లావున్నా వారి అందంచూసి అనుభూతిపొందితే తప్పేముంది. క్యూలో నిలబడింతర్వాత, ముందువారిన్నీ, వెనకవారిని ఈ క్యూ ఎందు కని అడిగే అధికారంలేదు. పెరుగుట విరుగుట కొరకే అన్నట్లు చివరి దాకా అనుభవించి, తనకుతానే సత్యం తెలుసుకుని హతమవ్వాలి.

అయినా, అందం అమ్మడం ఏమిటో; సరిగ్గావిన్నానా? సందేహం వచ్చింది పరంధామయ్యకి. అందం కాకపోతే యింకేమని వుంటాడు ఆ బాలవీరుడు? అంగం, అండం, ఆలింగనం, అంబలి, అల్లం, అందం, అంధత్వం, అంకం - విజ్ఞాన సర్వస్వంలో "అ"తో ప్రారంభమైన మాటల్ని స్మరించాడు. ఏదీనప్పడం లేదు. అందమే ఖాయం.

ఏమీ సందేహంలేదు - అందమే లేకపోతే యింతమంది స్త్రీలు, పురుషులు యీ క్యూలో అవతరించరు. ఎందుకు కాకూడదు? ఈ మధ్య జర్మనీ, అమెరికా మొదలైన పాశ్చాత్యదేశాలనుండి ఎందరెందరో ప్రముఖ విజ్ఞాన శాస్త్రజ్ఞులు వస్తున్నారు. అనేక పారిశ్రామిక రంగాల్లో

పనిచేస్తున్నారు. ఆ మధ్య నెవరో కళ్ళడాక్టరొచ్చి, ఏవో ఆపరేషన్లుచేసి దృష్టి ప్రసాదించాట్ట. మరెక్కడో మరో సర్జెన్‌గారు చెవి ఆపరేషన్‌చేసి చెముడుకుదిర్చి వెళ్ళాట్ట. ఈయనెవరో అందాన్నిచ్చేమూలికో పరికరమో తయారుజేసి అందజేస్తున్నాడు. అందం అమ్మడమేమిటి నానెత్తి. అంటే అందంగా చేసే పరికరాన్ని అమ్మడం అని. వాక్యంలో ఏదో లోపించింది.

"శ్రీమద్రమారమణ గోవిందో హరి" – క్యూలో అడుగు ముందుకు కదిలింది. వేడిలోవేడి మరో అడుగునెట్టి, జగద్రక్షకా, ఆపత్‌బాంధవా – మరో రెండడుగులు.

అమెరికాలో క్యూలో కూర్చుని పేపరు చదువుకునేందుకు కుర్చీలుంటాయిట. క్యూకోసం కొన్ని గ్రంథాలుంటాయిట. నమిలేటందుకు "చ్యూయింగ్‌గమ్" తయారుచేసే అమ్ముతారట. ఎడంకాలు నెప్పిచేస్తే, కుడిదవడ కిందకి ఫిరాయించి చప్పరించడం, కుడికాలు నెప్పిచేస్తే ఎడమవైపుకి ఫిరాయించి చప్పరించడం.

సౌందర్యాన్వేషకుల ఆత్రుత పెరుగుతోంది. వెనక నుంచి ఒక ప్రవాహం తోసుకొచ్చి, మరో రెండు గజాలు ముందికి కదిలారు. ఆ ముసలమ్మకి అందం ఎందుకు ? వెంట్రుకలు నెరిసి పొయ్యాయి, చర్మం ముడతలు పడింది. "వార్ధక్యం" చిత్రించే ఛాయాచిత్రాల పోటీలో ప్రథమ బహుమతిపొందేమొహం ఆమెది. ఈ వార్ధక్యం, జాడ్యం, మృత్యువు ఇవన్నీ లేకుండాచేసే మార్గం కనుక్కునేటందుకే సిద్ధార్థుడు సంసారం త్యజించి, ఏదో చెట్టుక్రింద కూర్చుని ధ్యానం సాగించి బుద్ధుడుగా అవతరించాడట. నిజంగా బుద్ధుడు సాగించినది సౌందర్యాన్వేషణే—అది సాధ్యం కాకపోయినప్పుడు, వేరే లోపల అందం, నిర్వాణము, శాంతి అంటూ తత్వచింతనలో పడ్డాడు. హాలీవుడ్‌లో తయారవుతున్న అందం పరికరాలు "మేకప్ మెటీరియల్స్" ఆ రోజుల్లో వుంటే, సిద్ధార్థుడు ఎంతవరకూ సంసారం పరిత్యజించేవాడో చెప్పలేం. కళ్ళకింద మడతలు, అక్కడక్కడ తెల్ల వెంట్రుకలు, కంఠంలో గీతలు– వీటిల్లో దేన్నో ఒకదాన్ని సిద్ధార్థుడికి సతీమణి నవ్వుతూ అవహేళన చేసే

వుండాలి. లేక భార్యలో ఆయన ఏదో ఒక వార్ధక్య చిహ్నం గుర్తించి వుండాలి. ఆమెని యవ్వనంలో బంధించి వెయ్యాలి—అని తీర్మానించు కునే తపస్సు కొనసాగించాడు. అందుకనే తరతరాలుగా చిత్రకారులకు అభిమాన వస్తువయ్యాడు బుద్ధుడు.

మరో రెండు గజాలు పురోగమనం మరో మూడు. ప్రజ యింక ఆగరు. తోసుకుపోతున్నారు—అందం ఆకలై ముందుకు నెట్టివేస్తోంది. ఏదో వాసన-ఏమిటి చెప్మా! ఆ వాసనకి ఏవేవో జ్ఞాపకాలు. బందరు నడిబజారులో కొలనులో ఖాళీ మిఠాయి పొట్లాలు పారేస్తే, రేగిన వాసన. పట్నంలో వాన వెలిసింతర్వాత తారురోడ్డు మధ్య ఇనుప గొట్టం తలుపు తెరిచినప్పుడు లోపలినుంచి వచ్చే వాసన, అంతర్వేది తిరణాలలో రాత్రి మంటపెట్టిన చెత్తవాసన.

"అబ్బ ఏంవాసనండి?" ఒక భక్తుడి కంఠం.

"కలరా వుండలా?"

"ఏమో. గసగసాలు"

"అబ్బే – కర్పూరం దండలండి"

"ఛఛ! – కానేకాదు."

"మరి?"

"చమురుకంపు."

"కాదు మహానుభావా – అతిగా కాగిన పాలకంపు – ఆ హోటల్లోంచి."

"సరే. ముందుకి నడవండి." మళ్ళా తోసుకుపోతున్నారు ఒక్కసారిగా పదిగజాలు. అమ్మయ్య! – ఎదురుగా క్యూలో ఆవిడెవరు? ఎరుగున్న మొహంలా వుందే – రమణయ్యగారి చెల్లెలా? ఆవిడే. చాలా అందమైంది. ఈ మధ్యనే భర్త కాలం చేశాడు. అంత అందమైనభార్య భర్తగా వుండేందుకు తగనని ఆత్మహత్య చేసుకున్నాడని చెప్పుకుంటా . ఎవరు చెప్పుకుంటారు-తీరాచేసి, పనిపిల్ల సరే, ఇప్పుడదంతా ఎందుకు? ఆవిడ కేం కావాలో? ఇంకా అందంగా వుండాలనా? ఎవరు చెప్పగలరు!

తనముందు చైనా గోడ చివర కనబడుతోంది. మనం తొయ్య కూడదు. వెనక ఎవడో తోస్తూవుంటే, ఆ అదను చూసుకుని మరొక్క గట్టితోపు. ఎవరికి తెలియకుండా-ఊ-కాని-ఇంకెంత. రెండు గజాల దూరంలో శిఖరం, దైవం సాక్షాత్కారం. కొబ్బరికాయ కొట్టి పూజారి పళ్ళెంలో అణా వుంచినట్లు ప్రతివాడూ ఆ కిటికీముందు నిలబడటం, డబ్బు సమర్పించుకోడం, వాడిచ్చిన ప్రసాదం కళ్ళ కద్దుకొని, - పత్రి పూలు వగైరా మాదిరి బిల్లు చీటీ యిస్తాడు -దాన్ని చెవులో బదులు జేబులో వుంచుకొని బైటపడటం—అల్లా జరుగుతోంది. ఒక్కొక్క భక్తుడే దూరంగా వెళ్ళిపోతున్నాడు. వారి మొహాలలో శాంతి ఆనందం తాండవిస్తున్నాయా? అందంతో నేత్రాలు మెరుస్తున్నాయా ? అటుకేసి చూసేటందుకు వ్యవధి లేదు. ఇంక ముందు యిద్దరే వున్నారు.

"కదలవయ్యా" ఎవరో వెనకనుంచి. కదిలాడు పరంధామయ్య సింహద్వారం చేరుకున్నాడు. ఎదురుగా గోడ. దానిలో నోకంత. దాని వెనక పరమాత్మ అందం అమ్మేవాడు. చెంపలు వేసుకో. హర హరశంభో! పాపాలన్నీ క్షమించు, అందం ప్రసాదించు. కళ్ళుమూసుకో పర్సుతీ—చిల్లర.

"పావలా" అన్నాడు దైవం

"ఇదుగోనండి"

"ఇంద"

ఇంత పొట్లం ఏదో చేతిలో పెట్టాడు.

"కదులు"

కదిలాడు పరంధామయ్య-పొట్లం గట్టిగా పట్టుకొని. అది విడి చేశాడా మళ్ళా మెలు వెనక్కి వెళ్ళి క్యూలో నిలబడి మళ్ళా తంతంతా జరగాల్సిందే—మరో జన్మ ఎత్తడం లాంటిది. జన్మరాహిత్యం జరిగింది. బైటపడ్డాడు. మళ్ళా క్యూలో జన్మించనక్కరలేదు. "నడు"

నడిచాడు. దూరంగా, తొందరగా నడిచి వెళ్ళాడు. ప్రాణం కుదుట పడాలి. ముందు విశ్రాంతి కావాలి. దాహంగా వుంది. చెమట్లు పోశాయి. మనుష్యుల వాసన ముక్కులో ప్రవేశించింది. చేతిలో పొట్లం,

పెద్దదే-ఏదో వాసన. నడిచి నడిచి ఇందాక కాఫీ త్రాగిన హోటల్లోకి చేరుకున్నాడు. మొహాన నీళ్ళు కొట్టుకున్నాడు. అద్దంలో మొహం చూసుకున్నాడు. అదే మొహం. వెనకటిదే ఏ మార్పులేదు. అను తున్నంత వికృతమైన మొహం కాదు. అందులో కొంత అందం లేక పోలేదు. అదుగో ఆ ముక్కుంది చూశారూ, వేళ్ళతో వెనక్కినొక్కి పట్టి చూసుకున్నాడు. ఎవరో అద్దంలో అతని మొహంకేసి చూస్తున్నారు. ఫరవాలేదు. ముక్కు చీదుతున్నట్లు అభినయించవచ్చు అల్లా నొక్కి పడితే ఎంత బాగుండనుకున్నారు!

పొట్లం విప్పాడు. అందులో అట్ట పెట్టె-ఆరంగుళాల పొడవు, నాలుగంగుళాల వెడల్పు. మూత తీశాడు—గుప్పున వాసన కొట్టింది. అందులో వున్నది ఇంగువ. దాన్ని వర్ణిస్తూ కాగితం వుంది. అందం మార్కు ఇంగువనే ఎల్లప్పుడూ వాడండి. ఇంగువ పరిమళానికి పేరు పడ్డది. అందం మార్కు ఇంగువకి ఆ రకం వాసన లేదు.అంత మాత్రం చేత పరిమళం అసలే లేదని కాదు. సువాసన, నూతనమైన మూలికలు, అత్తరులు జోడించి సమకూర్చిన పరిమళం. భుజించిన మొన్నాడుకూడా దాని పరిమళం వదలదు. ఇంత బాగుంది — ఏమిటండి? అని నలుగురూ మిమ్మల్ని అడుగుతారు, అభినందిస్తారు. అప్పుడు మీరు నన్ను అభి నందించకండి. అందం మార్కు ఇంగువని అభినందించండి" అని చెప్పండి. దాన్ని మెచ్చుకుంటూ దేశంలో పెద్దలిచ్చిన అభినందన పత్రాలు మా కార్యాలయానికి వచ్చి స్వయంగా చూడొచ్చు.

అందం మార్కు ఇంగువ మీ వంటకాలలో వాడితే మీ ఇల్లాలిపట్ల ప్రేమ, ఆదరణ పెరుగుతాయి. అన్యోన్యం ఎక్కువవుతుంది. ఆ అను భవం మీ దాంపత్య జీవితానికి ఆనందాన్ని సమకూరుస్తుంది. అదే జీవి తంలో అందం. అందుకనే దాన్ని అందం మార్కు ఇంగువ అన్నారు. పండక్కి చీర కొనలేదు. ఆమె తమ్ముడికి ఉద్యోగం చూడలేదు. ఆవిడ మేనమామ ఉత్తరానికి జవాబు వ్రాయలేదు మీరు. కిరాణాకొట్టులో యివ్వ వలసిన పైకాన్ని పేకాటలో ఖర్చుపెట్టి, ఆలస్యంగా ఇంటికి వెళ్ళి స్నేహితులతో సినిమాకెళ్ళానని అబద్ధమాడారు మీరు. ఆవిడ వేచివుంది. అట్లకాడ తీసింది, నెత్తిన కొట్టడానికి. ఆవిడ కోప గృహంలో వుందని

తెలుసు మీకు. రాచిప్ప పగులుతుంది. కప్పు ప్లేటు గోడకి విసిరి కొడితే, అవి కిందపడి ముక్కలై నాట్యం చేసి మధుర బృందగానం చేస్తాయి.

అట్లాంటప్పుడు ఏం చెయ్యాలో తెలుసా ? దూరంగా నిలబడి గుప్పెట్లో పెట్టికేసి చూపించి "ఇదేమిటి చెప్పుకో" అనండి. ఆవిడ చెప్పు కోలేదు. "ఇంగువ" అనకండి. కేవలం ఇంగువ అంటే అట్లకాడ మీ వైపు ప్రయాణం చేస్తుంది. అందుచేత "అందం మార్కు ఇంగువ" అనండి. అని చూడండి. ఆవిడ అట్లకాడ నేలమీద వొదిలేస్తుంది. ఆనందంతో ఆవిడ నేత్రాలు మెరుస్తాయి, పెదవులు వొంకర తిరిగి నవ్వు కోసం పెనుగులాడుతాయి. ఆవిడ సౌందర్యమూర్తి, ప్రేమరాశి. మీపాద దాసి. అనురాగం వొలకబోస్తూ; మీ దగ్గరకు వొస్తుంది.

'మీరెంత మంచివారండి, మిమ్మల్ని కాసేపు పొగడ నివ్వండి'.

'నన్ను పొగడకు. అందం మార్కు ఇంగువను పొగుడు' అనండేం.

పరంధామయ్య చాలా సేపటి వరకూ తేరుకోలేదు. కాని తనొక్కడే కాదు. వేలమంది పురజనులలో తనొక్కడు. వాళ్ళందరూ చేసినపనే తనూ చేశాడు. ఇందులో కించపడేటందుకేముంది ?

సరుకులు కొనుక్కుని మెల్లిగా ఇంటికి చేరుకునేటప్పటికి మరో గంట గడిచింది. ఇంటికి చేరుకున్నాడు. పార్వతమ్మ వంటింట్లో వుంది.

"ఇంత ఆలస్యమైందేం ?"

"ఏమీ లేదు"

"క్లబ్బు కెళ్ళారా ?"

"లేదు"

"మరి ?"

"మెల్లిగా నడుచుకుంటూ వొచ్చాను"

"ఇదేమిటి — యీ పొట్లం !"

"చూడు."

"ఇంగువ."

ఆవిడ మొహంలో చిరునగవు లేదు. కోపంతో మొహం చిట్లించింది. అసంతృప్తిని వొక్క చూపులో వ్యక్తం చెయ్యగల కళా జీవి ఆమె.

"ఇంత ఇంగు తెచ్చుకుంటారా ఎవరేనా ?"

"అంతే యిచ్చాడు వాడు."

"చిన్న పొట్లం అడగలేక పోయ్యారా ?"

"చిన్న పొట్లం వుంటుందని నాకు తెలియదు.

"ఇంకెప్పుడూ ఇట్లాంటి పని చెయ్యకండి అని పార్వతమ్మ వంటింట్లోకెళ్ళింది. అంత సుళువుగా బైటపడినందుకు లోలోన సంతోష పడ్డాడు, పరంధామయ్య.

ఇదిగో చూడండి. నేను తీసుకొచ్చాను — చిన్న పొట్లం" అన్న దామె, మరో చిన్న పొట్లాన్ని ప్రదర్శిస్తూ.

"నువ్వా ఆ క్యూలో నిలబడ్డావా ?"

"ఆహా. పనిపిల్ల చెప్పింది. ఇంగువ చవగ్గా అమ్ముతున్నారని. వాసన గ్రట్టా వుండదుట. జనం ఎగబడుతున్నారుట. ఇదేమిటో చూద్దామని దాన్ని తీసుకొని బైలుదేరాను. క్యూలో నుంచోవడం లేదు ఏం లేదు. ఎలాగో నలుగురి మధ్యాసందు చేసుకుని జొరబడి యీ పొట్లాం లాక్కొని వొచ్చింది. ఈ చిన్న పొట్లం దానికిస్తాను. మీరు తెచ్చింది మన కుంటుంది."

పార్వతమ్మ ఎంతవరకూ నిజం చెప్పిందో పరంధామయ్యకితెలుసు. తనెంత నిజం చెప్పాడో ఆమె కూడా అంతే. ఇది అన్యోన్యం కాక మరేమిటి ?

# 'కాగితం ముక్కలు, గాజు పెంకులు'

## (క థా ని క)

వెనక తగిల్చిన పాత రైలు పెట్టెలను లాక్కొచ్చి వాళ్ళ ముందు గిరవాటెట్టింది కొత్త రైలింజన్. బ్రతుకంతా భ్రమ అనుకుని మడిగట్టుకుని మూల కూర్చుని పెదవి చప్పరించే వారికి యీ కొత్తంజన్ వొక సవాల్. భీకరమైన కూత — ఎక్కడో భూమిని దొల్చుకుని గోళం మధ్యలో కాలం బంధించిన ప్రళయాన్ని కదిపి ఆ ధ్వనుల్ని తనలో జీర్ణించుకుని గతంలోంచి ప్రాణాన్ని తెచ్చుకున్న ఒక చారిత్రాత్మక కళేబరం ఆ ఇంజన్. దాన్ని చూస్తే రైలు నడిపే వారికీ, ప్రయాణీకులకీ కూడా భయమే. కావాలనుకున్న రైలు ఆలస్యంగా రావడానికి వీలుచిక్కనీదు ఆ ఇంజన్. అసలు నాలుగైదు నిమిషాలు ముందే వెళ్ళి కూర్చుంటుందిట. రైల్వే వారి కదొక సమస్య. ప్రయాణీకులు ఎలానో అలా దానిలో వెళ్ళి పడాలి తీరుబడిగా, తాపీగా, నిశ్చింతగా, సోమరిగా ప్రవర్తించకూడదు. అది రావడం, వెళ్ళడం కూడా ఒక స్వప్నం లాంటిదే. అది కదలడం, వేగంగా కదలడం రెండూ వొకటే. మెల్లి మెల్లిగా వేగాన్ని పెంచుకోడం అంటూ లేదు.

"ఈ కొత్తింజన్‌కి తలకాయిలేదు కదూ — నాలా" అన్నాడు నరసింహం. పెట్టెలో సామాను పడేసిన చంద్రానికి నవొచ్చింది. అవును నరసింహానిది పెద్ద తల - పెద్ద మెడ, మొడ మొహం కలసిపోయినట్లు వొక స్తంభంలాగుంటై. తల పెద్దదిగా వుంటే, మెడ సన్నటిదిగా కనపడుతుందని, చదువుకునే రోజుల్లో జుట్టు పెంచేశాడు. పెద్ద వుంగరాల జుట్టు విచ్చల విడిగా పెరిగి నుదుటిమీద, కళ్ళల్లోనూ పడుతూ, వెనక్కి తోసినప్పుడల్లా చేతులకు పని చెబుతూ, మనిషి భీకరంగా వుండేవాడు— అందరూ "సింహం" అని పిలిచేవారు. మరిప్పుడో - ఆ జుట్టు లేదు. ఆర్మీలో ఉద్యోగం అదంతా కత్తిరించేసి పొట్టి క్రాప్ మెడవెనక పై భాగం ఆకుపచ్చ చర్మం పాచిలా కనిపిస్తూనే వుంటుంది.

"తల పెద్దదైతే భుజబలం ఉండదంటారుగా పెద్దలు. ఇంజన్‌కి అదుంది. ఈ రోజుల్లో కావల్సిందే అదిగా" అన్నాడు చంద్రం. కులాసా కబుర్లకు వ్యవధి నివ్వకుండా, ఒక పెద్ద కూత పెట్టింది. అది కూతగాదు. కంఠంలోంచి ధ్వనులు రావడం కాదు. మొత్తం శరీరం అంతా కంఠమై, అల్లాగయ్యే యత్నంలో ఆ కంఠం పగిలినప్పు డొచ్చిన ధ్వని. ప్లాటుఫారంపైన జనం అదిరిపడ్డారు.

"చూసో్క—నే వున్నానని తెలిసి కాబోలు ఇంజన్‌గారు వి్రపీగి పోతున్నారు..." అన్నాడు 'సింహం.'

"రైలు కదులుతోంది" అన్నాడు చంద్రం.

"రైలు కదలడంలేదు"—ధాటికి భూమే వెనక్కి పారిపోతోంది. చాలా థ్యాంక్స్. ఈ నాలుగురోజులు హాయిగా గడిచాయి. అరుణకి మరీ మరీ థ్యాంక్స్ చెప్పు. ఇదిగో ఈ హంటర్ అంటే మోజుపడ్డావు దగ్గరుంచుకో—జ్ఞాపకార్థం."

అంటూ చేతులో హంటర్ చంద్రానికిచ్చాడు. అతను తటపటా యిస్తున్నాడు. ఇంజిన్ మరొక్కసారి కేకేసింది—మిగిలిపోయిన ఆ కాస్త శక్తినీ యిప్పుడు పూరించుకుని. జండా పట్టుకున్న గార్డు కూడా అదిరిపడ్డాడు. ఒక్క గంతేసి రైల్లో పడ్డాడు గార్డు.

"చూశావా—వద్దంటానికి వీల్లేదు. ఇంజన్ కూడా నోరు కట్టేసుకో మంటోంది..."

"అప్పుడే చాలాదూరం వెళ్ళిపోయింది పెట్టె. 'సింహం' పెద్ద తలకాయ చిన్నదవుతోంది. చుక్కలాగై అంతర్ధానమైంది. హంటర్‌ని చేతిలో తిప్పుకుంటూ చంద్రం ఇంటికి బయలుదేరాడు. ఆర్మీలో పెద్ద ఉద్యోగస్తుడు వాడే. హంటర్ అది మూడడుగుల పొడవు, రెండంగు ళాల వెడల్పుగల దండం చుట్టూ చాక్‌లెట్ రంగు తోలు చాపలా అల్లి వుంటుంది. ముందు ఒక అడుగు పొడుగు, రెండు తోలు పటకాలులాగ వేళ్ళాడుతూ ఉంటాయి. అది తన కేమీ ప్రయోజనం లేదు. స్నేహితులు జ్ఞాపకార్థం ఇచ్చింది. కాదనలేకపోయాడు. చదువుకునే రోజుల్లో మోటుగా, కరుకుగా వుండేవాడు సింహం. పోకిరీ అని చెప్పుకోవడం

కూడా తనకి జ్ఞాపకం. ఆర్మీలో ఈ వుద్యోగం అతనికి సరి అయినదే. ఆర్మీలో వున్నాడంటే మోటగా, కరుకుగా వుండివుండాలి అనుకున్నాడు, చాలామందిలాగే తనూ. కాని సింహం అల్లాగ లేడు. నవ్వించడం కోసం కొంత చౌకబారు సంభాషణ సాగించినా—అరుణ ముందు మరీనూ—మొత్తం మీద నమ్రతగా, సంస్కారంతో వచ్చిన ఒక నాజూకుతో వ్యవహరించాడు. ఆర్మీలో వున్న వారికి ఎక్కువ వినోదాన్ని కల్పించి మామూలు సమాజంలో సాధ్యంకాని స్వేచ్ఛతో ప్రవర్తించే అవకాశాలు కల్పిస్తారుట. కదిపితే ఆ విషయాలన్నీ అతను చెప్పునేమో. ఏకాంతంగా అవన్నీ చెప్పుకునే అవకాశం దొరకలేదు. వారిద్దరి మధ్య ఏదో ఒక తెరలాంటిది వుంది. డబ్బు వల్లనో, హోదా వల్లనో, సంస్కారం వల్లనో, మసలే సమాజం వల్లనో దేనివల్లనైతేనేం, వారిద్దరూ అనుకున్నంత అన్యోన్యంగా, దగ్గరగా వుండలేకపోయారు. బహుశా 'అరుణ' సమక్షంలో వారిద్దరూ ఎక్కువగా గడపటంవల్లనేమో. చంద్రానికి నవ్వొచ్చింది. వున్న నాలుగురోజులు ఆమె ఎదురుగా వున్నా లేకపోయినా కూడా అరుణని అరుణగారూ అంటూనే వ్యవహరించాడు సింహం. రైలు కదిలేప్పుడు మాత్రం ఆ "గారూ" వదిలేసి "అరుణ" అనే వ్యవహరించాడు. అంటే ఈ నాలుగురోజుల్లోనూ వారి మధ్య పెంపొందిన అనురాగానికీ అన్యోన్యానికీ అదొక చిహ్నం. ఒకర్ని ఒకరు "గారు" అని సంబోధించే అవసరం వున్నంతవరకూ వారిని నిజమయిన స్నేహితులుగా పరిగణించడం సాధ్యం కాదేమో!

ఇంటికి చేరుకున్నాడు. మెట్లెక్కి తలుపు కొట్టాడు—నౌకరు తలుపు తీసి హాల్లో కుర్చీలు బల్లలు, సర్దుతున్నాడు. గోడగడియారం అప్పుడే పది కొట్టింది.. పోస్టుకు వెళ్ళి టపా తెస్తానని నౌకరు బయటికి వెళ్ళాడు. హంటర్ హాల్లో మధ్య బల్ల మీద పడేసి, పత్రిక కోసం వెదుకుతూ పక్క గదిలో కెళ్ళబోయేముందు భార్యని పిలిచాడు. సమాధానం లేదు. మళ్ళా వెనక్కొచ్చి, ఏమీ తోచక బల్ల మీద హంటర్ చేతిలో పట్టుకొని, గది దగ్గరికెళ్ళి తలుపుకొట్టాడు. ఒక్క క్షణం ఆగి తలుపు తోశాడు. సరిగ్గా పడని గడియ కాబోలు, చప్పుడు చేస్తూ కిందకి జారింది. తలుపు తోసు

కొని లోపలి కెళ్ళాడు. ఎదురుగా అద్దం బల్లముందు మడత మంచం మీద కూర్చుని ఏదో కాగితంకేసి చూస్తూ వుంది అరుణ. భర్త రాగానే కంగారుపడినట్లు వులిక్కిపడి తను చూస్తూ వున్న కాగితాన్ని గుప్పెట్లో దాచేసి అతనికేసి చూడకుండా "అబ్బ, అబ్బ. కాసేపు అవతలుండండి" అంది. ఇదివరకెన్నడూ చూడని అరుణని చూచాడు చంద్రం. తలంటు పోసుకుని జుట్టు తడిని తువ్వాలులో బిగించి ఆర్పుకొంటూ పల్చటి తెల్ల చీర పూర్తిగా కట్టుకోకుండా ఒంటికి సగం సగం చుట్టబెట్టుకొని జాకెట్టు లేని భుజంపైన జారిన తడికొంగు మడతగా మంచం కిందకి జారిన కొం చటుక్కుని కనబడక తువ్వాలును లాగి మెడచుట్టూ కప్పుకున్న అరుణ— అదొక వింత దృశ్యం. అరుణ—పల్చటి మనిషి. బహు లేత శరీరం. స్ఫుటంగా ఆకృతి పొందని అవయవాలు. గుండ్రతనం, నిండుతనం లేవు. అన్ని కోణాలు, బలహీనమైన ఎముకలూ, నరాలు. బ్యాటరీ లైటు ఆమె శరీరంపైన ఫోకస్ చేస్తే యిటు నుంచి అటు ప్రసరిస్తుంది కాంతి. బలంగా, లావుగా కనబడేందుకు ఆమె చేసే యత్నాలు చంద్రానికి తెలుసు. మందంగా వుండే బట్టతో అనేక మడతలుగా తీర్చిన లంగా, దానిమీద ఎనిమిది గజాల చీర, బయటికెళ్ళినప్పుడు వెల్వెట్ జాకెట్టు, సన్నటి, పల్చటి నాజూకైన మొహం. ప్రశాంతమైన కళ్ళు, శాశ్వతమైన మందహాసాన్ని సూచించే నోరు, జాలిగా మెరిసే క్రమమైన చిన్న పళ్ళ వరస, ఒంపుకు ఆస్కారం లేని చిన్న చెక్కిళ్ళు, ఆ మొహం మరీ అంత చిన్నదిగా కనపడ్డానికి కారణం ఆమె జుట్టు, దట్టంగా వొంపులు తిరిగిపోయిన మొహం, మెడ, భుజాలు ఆవరించే మందమయిన తలకట్టు.

గాలిలో అ కళ్ళు ఎర్రగా ఉన్నాయి. నిప్పులు గ్రక్కడం అంటే పువ్వుకికూడా ంతో పెదవులు చలించి చిన్న రంధ్రంలోంచి వున్నాయి. భూమండ ఒక గీతగా పెదవులు చివరలో బిగుసుకున్నాయి. జరిగింది. మడత మంచ

క్కుంది. శ్వాస వేడిగా, తె

నొక్కిపెట్టిన గుప్పెటిపైన నరాలు పదునుగా తీర్చి వున్నాయి. ఏదో మహావృక్షం ఎన్నాళ్ళుగానో భూమికి పెనవేసుకున్న వ్రేళ్ళలాగా—ఆ చేష్టలో ఒక వికృతమైన ప్రాచీన శక్తి కనిపించిన వాడికిమల్లే అరుణని చూసి చంద్రం దిగ్భ్రమ చెందాడు. క్షణంలో తేరుకున్నాడు.

"చేతిలో ఏమిటది ?"

సమాధానం లేదు.

ఒకడుగు ముందుకువేశాడు.

ఆమె బుజాల తకి ఆరింది-కాని చీరమడతలు తడికి చర్మాన్ని అంటిపెట్టుకొని శరీరకాంతిని బైటపెడుతున్నాయి. పరాయి స్త్రీగా కనబడుతోంది అరుణ.

"నిన్నే"

"బైటకెళ్ళండి" అంది గుప్పిడిని చీర మడతలో దాచుకుంటూ.

"ఏమిటది ?"

"ఏమీ లేదు"

"చెప్పాలి"

"ఏం లేదన్నానుగా"

చంద్రం మరో అడుగు ముందుకి వేశాడు. ఆమె మంచంమీద కొంచెం వెనక్కి జరిగింది. ఎడమచేతితో మంచం బద్దీని నొక్కి నప్పుడు భుజంమీద ఒంపు రొమ్ములని కదిపి, చీర మడతలని కదుపుతున్నాయి.

"చెప్పి తీరాలి."

చంద్రంలో అస్పష్టమైన వాంఛ రేగినట్లు కళ్ళు పదే [illegible]
స్తున్నాడు. [illegible] మళ్ళా

"చెప్పకపోతే ?" [illegible]ట్టుకొని, గది

అరుణ చూపులో, మాటలో పెంకితనం, [illegible] తోశాడు. సరిగ్గా
ప్రకటించింది. [illegible]రింది. తలుపు తోసు

"ఏం మాట్లాడుతున్నావో, ఎవరితో మాటాడుతున్నావో తెలుసా ?"

"తెలుసు."

"మరిల్లాగియ్యి అదేమిటో"

"ఇవ్వను. ఏం చేస్తారేమిటి ?

అరుణ సంసారబంధాన్ని విస్మరించింది. తను భార్య కాదు- వ్యక్తిత్వంతో ప్రజ్వరిల్లుతున్న ఒక ప్రాణి. ఆ తిరుగుబాటుతో ఆమె మరీ దూరమైపోతోంది. లోయలో నిలబడి దూరంగా శిఖరంపై కలని వెదుక్కుంటూ తిరగాడే దేవకన్యని పిలిచినట్లుగా వుంది. అత నొక బురదగుంట. అందులో తారక ప్రతిబింబంగా అరుణ కదులు తోంది. ఆ తిరుగుబాటు అతసిని కవ్వించినట్లయింది. ఆమెను తన చేతుల మధ్య బిగించి ఆ శక్తికి ఆమె శరీరం పీడి రక్తం కారుతుంటే, అతనిలో కామజ్వాల చెలరేగి అందులో ఆమె హతమవుతే—ఏదో వెర్రి ఆవేశానికి లొంగిపొయ్యాడు చంద్రం. అతని ఆవేశం వెనక పురుషుడు, "మాన" వున్నాయి. చరిత్రలో కాయకష్టంచేసి, సౌందర్యాన్ని ఆరా ధించి, విఫలులైన లక్షలాది మానవుల—పురుషత్వం ఉంది. తనింక ఆమె భర్త కాడు, చంద్రం కాడు. బలహీనమై, తనచేతిలో లొంగిపోయి, తనిష్టమొచ్చినట్లు వాడి ధ్వంసంచేసుకునేందుకు అనువైన ఒక స్త్రీ దొరికిన, పురుష, పశుశక్తుల కుప్ప.

"ఏం చేస్తానా?"

మీదికొస్తున్నాడు చంద్రం. నల్లమేఘాన్ని తరుము కొచ్చిన పెను గాలిలో అల్లల్లాడిపోయిన గడ్డిపువ్వులా ఆమె ఒణికిపోయింది. ఆ గడ్డి పువ్వుకికూడా వేరుంది - విత్తనం వుంది. అవి భూమిలో పాతుకుని వున్నాయి. భూమండలంలో శక్తికి కదిలినట్లుంది ఆమె. ఇంకా వెనక్కి జరిగింది. మడత మంచం చివర - చీరకొంగు జారి రొమ్ములమధ్య ఇరు క్కుంది. శ్వాస వేడిగా, తెరలుగా వదుల్తోంది.

"నాకు తెలుసు" అన్నాడు.

"తెలిస్తే ఇంకెందుకు? వెళ్ళండి."

"చూడకుండా వెళ్ళను."

"నేనే ఇడతాను" అని లేవబోయింది అరుణ. చీర ముడి సరిగ్గా లేక నడుంమీదికి జారిపోతోంది. మంచంమ్మీది దుప్పటిని పైకిలాక్కుని కప్పుకుంటోంది. లేవలేదు. మళ్ళా అక్కడే చతికిలపడింది.

"అది ఉత్తరం, అవునా?"

"అవును"

"ఎవరు వ్రాశారు?"

అది తెలుసుకున్న వారు ఇదీ తెలుసుకోండి."

చంద్రం తల తిరుగుతోంది. అతని కంఠం తేటతెల్లమయింది. మరిప్పుడు ఆవేదనలేదు, నరాలులాగడంలేదు-స్థిరపడి కార్యానికి సిద్ధపడు తున్నాయి. "సింహం" స్టేషన్‌లో "అరుణగారు" అనడం బదులు "అరుణ" అని ఎందుకన్నాడో తెలిసింది. వారిద్దరూ వున్నప్పుడు, ఆమె సంభాషణ అదోకలా నడిచింది. చెప్పుకొన్న కబుర్లన్నీ ఎవరినో వుద్దేశించి చెప్పినట్లుగా వున్నాయి. అరుణ "సింహం" కేసి అదోకలా చూసింది. - ఆ చూపులో అమాయకత్వం బదులు, కుటిలత్వం కనబడింది. గుట్లు వొప్పజెప్పేసిన చూపులవి. "సింహం" గురించి చదువుకునే రోజుల్లో నలుగురూ చెప్పినవి గుర్తుకొస్తున్నాయి. అతనిలో సంస్కారం లేదు, నాజూకులేదు - ఆర్మీలోవాళ్ళ మోటుతనం కరుకుతనం వున్నాయి. ఆ పెద్దతల, పాచిలా మెరిసే పెద్దమెడ, భీకరమైన కనుబొమ్మలు-పొగ్గుగనిలోకి తొంగిచూసినట్లు, నల్ల కళ్ళు-అబ్బ! ఆ స్థానంలో అతనుతప్ప, ఇంక ఎవరున్నా, ఆమెను క్షమించివుండును చంద్రం. ఆమెలో నాజూకు, అమాయకత్వం, మృదుత్వం సహజంగా వున్నాయి. వాటికి వ్యతిరేకమైన లక్షణాలు సింహంలో వున్నాయి. అందుకనే వాటిని కోరింది కాబోలు.

"ప్రేమలేఖ?"

"అవును"

"చూడనీ."

"చూడనివ్వను. మీకొచ్చిన ఉత్తరాలన్నీ నాకు చూపుతున్నారా?"

"వేళాకోళమా ?"

"నిజంగానే"

"ఇస్తావా యివ్వవా ?"

"ఇవ్వనంటినిగా."

అర్థంలేని ధ్వనిచేశాడు చంద్రం. ఆమె మీదికొచ్చాడు. అతని రెండు మోకాళ్ళు మంచం ముందు భాగంలో ఆనించి ఆమెను పట్టుకో బొయ్యాడు. అరుణ వెనక్కి కదిలింది. ఆమె చెయ్యి మెడ వెనకదాచింది. భుజం మీద పడింది అతని చెయ్యి. వేగ పాదం కప్పపిల్ల మీద పడ్డట్టు. మంచం చివరికి జరిగింది – పట్టులేదు. లుంగచుట్టుకుని కిందపడింది. బరువుకి చంద్రం వున్న భాగం పైకి లేచిపడింది. అతను ఆ వూపుకి కింద వెల్లకిల పడ్డాడు. దెబ్బ తగిలింది. అతని చూపు తడబడుతోంది. వొస్తువులు కనిపించడంలేదు. బుర్రలో వాక్యం నిర్మాణం అవడం లేదు. ఏవో సగం సగం ధ్వనులు – లేస్తున్నాడు. లేచాడు. దూరంగా అరుణ వాడి వూడిన ఆకులా - ఒడ్డునపడి తెప్పరిల్లిన తెల్లపిల్ల కెరటంలా – చందమామను కప్పిన తెల్ల మేఘంలా అరుణ – ఊహలో అరుణ, జ్వాల నాలుక, కత్తి, బాణం, అగ్ని దేవుడు విప్పి పారేసిన వస్త్రం, చిలుక పొడిచిన ఎర్రపండు – "సింహం" నోట్లో నలిగిన పావురం అరుణ. తను బోనులో. లేచాడు, బోను కడ్డీలు వూడపీకుతున్నాడు. "ఇస్తావా ఇవ్వవా ?" ఆమె మీదికి వెళ్ళి, వొక్క వూపుతో ఆమెను నిలబెట్టి మంచం పైన కూలదోశాడు. చేతులో "హంటర్"ని గిర గిర తిప్పి, ప్రేళ్ళాడుతున్న పటకాలతో ఆమె జబ్బ మీదకొట్టాడు. ఆమె పెనుగులాట

విరమించి, మంచం మీద నుండి జారి, చేతి పట్టు విడిచేసి, కింద పడింది.
చంద్రం ఆ ఉత్తరాన్ని చిక్కించుకున్నాడు. హంటర్‌ని బుజాన వేళ్ళాడేసుకుని హాల్లోకి నడిచాడు. బల్లమీద గ్లాసులో మంచినీళ్ళు తాగాడు. ముందు గదిలోకెళ్ళి తలుపేసుకుని ఉత్తరం చదువుకున్నాడు.

అకుపచ్చ రంగు కాగితం, పై భాగం చిరిగిపోయింది. అక్షరాలు సరిగ్గా కనపడటం లేదు.

"... నేనింక సుఖపెట్టగలనేమో. ఇన్నాళ్ళు ఉద్యోగం లేక నాతోపాటు నిన్ను కూడా ఈ సమిష్టి కుటుంబానికి బానిసగా చేశాను... నిర్మలమైన సెలయేటి అడుగున కనిపించే బంగారపు ఇసుకలాంటి నీ శరీర కాంతి, నా చీకటి కలను వెలిగించింది. అంతటి నిర్మలమైంది కూడా నీ హృదయం, సుకుమారమైంది నీ శరీరం. ఏటికి అటూ యిటూ గట్లంట ముళ్ళ పొదలు – పెద్ద పెద్ద చెట్లు – ముసలివై వూగిసలాడి కొనవూపిరితో భూమిని అంటిపెట్టుకున్న ఆ చెట్లలాంటి నా జీవితానికి ఆ ఏరు మెల్లగా నృత్యం చేస్తూ, సున్నిత కంఠంతో గానం చేస్తూ ప్రవహిస్తూంటే చూసి ఆనందించటం తప్ప పరమావధి లేదు. అన్ని నదులూ ఎప్పుడో వొకప్పుడు ఒక చోట సముద్రంలో పడాల్సిందే అన్నాడు వొక కవి. ఇప్పుడా సమయం వొచ్చింది. ఉద్యోగం దొరికింది. నీకు ఉయ్యాలంటే యిష్టం కదూ ? ... మనుష్యులు లేని ఏకాంత లోయలలో రెండు శిఖరాలకి మధ్య తగిలిద్దాం అనందం అనే ఉయ్యాలని ... సిగ్గుతో దూరంగా వెళ్ళని పిల్ల వాయువు ఆ ఉయ్యాలని వూపుతుంది. చెట్ల ఆకులు సంతోషానికి తట్టుకోలేక మన మీద ఊడిపడి మన ఆనందాన్ని పంచుకుంటాయి ... అరుణా ... కొండ వెనక నుంచి వొక్కసారిగా నీ మోము వెలిగించే ప్రభాత కిరణం, నీ స్నానం కోసం వేచివున్న అడివి కొలను ... మనకోసం ఎదురుచూస్తూ వున్నాయి."

తరువాత అక్షరాలు బొత్తిగా కనబడటంలేదు. సంతకంకూడా

లేదు. కాని చంద్రానికి తెలుసు. వివాహం అయిన మరుసటి సంవత్సరం, ఉద్యోగం దొరకగానే అతను, అరుణకి వ్రాసిన లేఖ అది. అవుతే, అంత దాపరికం దేనికి? అర్థంలేని మొండిపట్టా? మూర్ఖత్వమా? హాస్యధోరణిలో ప్రారంభించిన పెంకిపట్టు. విషాదంగా అంతమొందిందా? అతనికి అర్థం కావడంలేదు. ఆ ఉత్తరం అరుణకి ఆనందం యిచ్చివుండాలి, ఎన్నేళ్ళ క్రితమో తానుపొందిన ఆనందాన్ని మళ్ళా యిప్పుడు చదువుకుని పొందు దామన్న సంకల్పానికి తనరాక అంతరాయంగా పరిణమించింది. ఆ ఉత్తరం వ్రాసిన చంద్రంవేరు. ఆ చంద్రం ప్రియుడు — యవ్వనంలో స్వప్నాలల్లే మాంత్రికుడు. ఇప్పటి చంద్రం భర్త. ఉద్యోగం, హోదా, డబ్బు, నౌకర్లు, స్నేహితులు, మర్యాదలు — ఆమె భార్య — వొంటొండి పెడుతుంది. ఆ ఉత్తరం చదవడంలో గతించినకలలు తిరిగి ఊహలో సృష్టించుకొని, రహస్యమైన ఆనందం పొందుదామని, తలంటుపోసుకొని, అలంకరించుకుంటూ, ఏకాంతంగా గతంలో యాత్రకి బైలుదేరుతుండగా, భర్త అనే ఇప్పటిచంద్రం, వర్తమానాన్ని హంటర్ స్వరూపంలో తన ముందు ప్రత్యక్షమై ఆ ఊహా జగత్తుని ధ్వంసంచేశాడు. అందుకే అతన్ని పరాయివాడిగా, విరోధిగా తూలనాడి, ఎదురుతిరిగి, స్వప్న జగత్తులో తన నిజ స్వరూపాన్ని ఒక్కసారి చూపెట్టింది.

వారి కిప్పుడు ఏలోటూ లేదని చంద్రానికి తెలుసు. డబ్బుంది, ఉద్యోగంవుంది, ఆరోగ్యంవుంది — అన్నీవున్నాయి. కాని ఏదో లోపిం చింది. ఆలోపించింది ఆ ఉత్తరంలోవుంది. అందుకే అంతరహస్యం. గతానికో అద్దం ఆ ఉత్తరం. అందులో తన నిజస్వరూపం చూసుకుం టుంది. ఉత్తరం నలిగింది; అద్దం మసగ్గావుంది. అన్నీ మరకలు; తలంటు పోసి, శుభ్రం చేసినా బాగివదు...అంతే మరి.

చంద్రం హంటర్ తాళ్ళని తనవెన్నుమీద పేల్చుకు చూశాడు. శరీరానికి నెప్పి తెలుసు; బాధ తెలుసు. కాని హృదయానికి తెలిసేది గాయం. అద్దాన్ని పగలకొడుతుంది శరీరం. పగిలిన ముక్కల్ని ఏరి అతుకు పెడుతుంది హృదయం. హంటర్ బల్లమీద పడేసి, పైన పత్రిక కప్పి, అరుణగది కేసి నడిచాడు చంద్రం. ఆ పత్రికని హంటర్‌ని పూర్తిగా కప్పేటందుకు సర్దుతున్నప్పుడు, ఒక్క కన్నీటిబిందువు పడి, అక్కడ తడిసింది. ఒక్కటే బిందువు వుంది – పగిలినవాటిని అతుకు పెట్టే జిగురులాంటిది. అది కాస్తా యిప్పుడు పడిపోయింది.

